# దేశభక్తుడు

## (Kandan, the Patriot)



శ్రీ కె. యస్. వేంకటరామాని.

# వచన గ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, శ్రీశత ఘంటము వేంకటరంగశాస్త్రికృతము | ... | 6 | 8 |
| డిటో 3 వాల్యములు | ... | 7 | 0 |
| ఆంధ్రవచనభారతము, ఆదిసభాపర్వములు | ... | 2 | 8 |
| డిటో ఆరణ్యపర్వము | ... | 2 | 8 |
| డిటో విరాటోద్యోగపర్వములు | ... | 2 | 8 |
| డిటో భీష్మద్రోణపర్వములు | ... | 4 | 0 |
| డిటో కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీపర్వములు | (అచ్చగుచున్నది). | | |
| డిటో శాంతిపర్వము | ... | 4 | 0 |
| ఆంధ్రవచనరామాయణము, 7 కాండలు, రెండుసంపుటములు | | 12 | 0 |
| ఆంధ్రకవిజీవితములు శ్రీగురుజాడ, శ్రీరామమూర్తిగారిది | ... | 3 | 8 |
| ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము | ... | 1 | 8 |
| అయిదుగురుదొంగలకథ | ... | 0 | 6 |
| అరేబియన్ నైట్సుకథలు | ... | 1 | 4 |
| ఈసబునీతికథలు, ప్రథమభాగము | ... | 0 | 6 |
| డిటో రెండవభాగము | ... | 0 | 8 |
| ఋషులచరిత్ర, శ్రీరాచకొండ అన్నయ్యశాస్త్రిగారు | ... | 0 | 8 |
| చార్ దర్వేషుకథలు | ... | 0 | 8 |
| సీతారామము | ... | 1 | 2 |
| దిలారామ | ... | 1 | 4 |
| తాతాచార్యులకథలు | ... | 0 | 6 |
| [illegible]కథలు | ... | 0 | 8 |
| తెనాలి రామలింగనికథలు | ... | 0 | 4 |

# దేశభక్తుఁడు

## (Kandan, the Patriot)

ఆంగ్లగ్రంథకర్త:

శ్రీ కె. యస్. వేంకటరమణిగారు







చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్‌సన్స్ వారిచేఁ

ప్రకటితము.

1933

# ప్రస్తావన.



ఆంగ్లసారస్వతమునకుపాయనమొసఁగూర్చుట అన్యదేశీయులకసాధ్యము. ఐనను భారతీయులు కతిపయులట్టికార్యమునుసాధించియున్నారు. ఆంగ్లమునరచనకుఁదొడంగి ప్రశస్తిగడించుకొనినదాక్షిణాత్యులలో శ్రీయుత కె. యస్. వేంకటరమణిగారు అగ్రగులు. వీరిగద్యపద్యరచనలను ఆంగ్లేయవిమర్శకావతంసులే కొనియాడియుండుటవిశేషము. అట్టివారిటీవలెనే ప్రకాశించిన 'Kandan, the Patriot' అను నవలకీగ్రంథము ఆంధ్రీకరణము. బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారి ప్రేరణచే నేనీయనువాదమునకు దొరకొంటిని. మాతృకనత్యంతముపలక్షించియే వ్రాసితిని. ఎడనెడ నించుకసంక్షేపించుటదప్ప నాస్వాతంత్ర్యమును సంపూర్ణముగానరికట్టుకొంటిని. గుణదోషనిర్ణయమునకుఁ బాఠకులేప్రమాణము.

గుత్తిం సుబ్రహ్మణ్యము,

అనువాదకుఁడు.

# దేశభక్తుఁడు.

## మొదటిప్రకరణము.

### అక్కూరులోని కల్లంగడి.

### 1

తూర్పుతీరమున మాయవరమునుండి ట్రాంక్విబారునకుఁ బోవు చిన్నరైలుమార్గమునందు అక్కూ రొకచక్కనిపల్లె. అచటికి మూఁడుమైళ్లదూరముననే సముద్రము.

ప్రొద్దుతిరిగెనుగాని తూర్పుగాలి యింకనుఁ దిరుగలేదు. మందసమీరుఁడు కెరటములమూర్ధముల స్పృశియించుచు, జలరేఖను ముద్దుగొనుచు, దరినిఁ బొలయునురుగుసొమ్ములఁ జిక్కువఱచుచు తామసించెను.

నాల్గుగంటలకైదునిమిషము లుండెను. అప్పుడే నెం 9 రు రైలు మాయవరమునుండి కూతవేసి బయలుదేరెను. దీనికున్న అయిదుపెట్టెల నీడ్చుట కొకశిథిలమైన యింజను తగిలించఁబడెను. ఒకకాలములో నీయింజను పెద్దలైనుమీఁద టూటికారిన్ ఎక్సుప్రెస్సును నడిపించినదే. వృద్ధాప్యమున దాని నీ చిన్నరైలున కంటఁగట్టిరి. పూర్వపుసత్త్వ కొంచెము శేషించి

యుండెనుగాని యిప్పుడు సందడియే మెండు. దీని రణగొణ ధ్వనికి రైలును అదరిపోవుచుండెను. మెఱుఁగుమాయని యా కమ్ములమీఁద నిమిషనిమిషమున కదరిపడుచు, ఇంజిను యానము సాగించుచుండెను.

## 2

నెం 9 రు రైలు కూతవేయుటయే గుర్తుగా అక్కూరు కల్లంగడిలో జీవము కళకళలాడును. కొబ్బరితోటలో నొక ఋషికుటీరమువలెనున్న దీయంగడి. దీనికెదురుగా నూరిచెఱువు. పగలంతయుఁ గష్టించిన పేదజనము సాయంత్రమే చెఱువున స్నానమాడి, ఉడుకెత్తిన దేహములు చల్లఁబడఁగా సురసేవాసక్తులై యీ ఆశ్రమము సేరుకొందురు.

మాయవరం ట్రాంక్వెబారు రైలునకు ప్రథమసంతాన మీ కల్లంగడి. ఈ రైలు వేయుసమయమున నిట ధనప్రచారము విశేషముగా గల్గెను. అందువలనఁ గల్లంగడి దెఱచిననాఁటినుండియు డబ్బు పుష్కలముగా రానారంభించెను. చెమటనోడ్చి సంపాదించిన నాల్గురూకలను కూలివా రిక్కడ ముడుపు చెల్లించుకొనుట పరిపాటియాయెను.

రెండువేలయేండ్లక్రిందట కరికాళచోళుఁడు రాజ్యము సేయుచున్నకాలములోఁ బ్రధాననగరమైన పుహారునం దీ యక్కూరొకభాగము. అపుడున్నసంబర మిపుడు మాయ

మైనది. కాని యప్పుడులేని దిప్పటికల్లంగడి. రాజులు సాధింప లేనివాని నెన్నింటినో రైలు సాధించినది.

రైలువేసెదరని తెలియఁగానే, ఆప్రాంతములందుఁ బ్రముఖుఁడైన నాటూరు అబ్కారీయధికారుల నాశ్రయించి, వారికిఁ బూలహారములు, పండ్లబుట్టలు రవాణాసేయించెను. బీదలకుసోమదానము జేసి లక్షాధికారియైన మహానుభావుఁ డితఁడు. ఇంకను రైలువేయుటకుఁ బాలుముట్టకముందే అబ్కారులోఁ గల్లంగడి ప్రభవించి పాడిగాంచెను.

అచట నొక మొదలియారు అంగడిలైసెన్సుపొందెను. అతనికి ముప్పదివేలకొబ్బరిచెట్లుండెను. తనభూమిలోనున్న బంగారును తానుగాక మఱొకఁడు సొమ్ముసేయుటా! మిత్రులొసంగిన హితవు మొదలియారునకు నచ్చెను. మొదలియా రింకను నవివాహితుఁడు. నడివయసులోనుండెను. పెద్దయొత్తులువేయుటకు మొనగాఁడు. కాని దేనిలోఁ జేయివేసినను, పెద్దలుపెట్టిపోయిన యాస్తి నలుగఁజేయుటయే పరిపాటియాయెను. ఇప్పటికే అనేకము పరిశ్రమల నీతఁ డుద్ధరించెను—వడ్లమిషన్, మోటారుబస్సులు, రైలురోడ్డుకంట్రాక్టులు. అలవవారి తెలివితేటలు మూఁడింటఁ జక్కఁగా రాణించును. కల్లంగడి, వడ్లమిషన్, మోటారుబస్సులు. సరే కలదుగదా అన్నిటికన్న మిన్న పూటకూళ్లపరిశ్రమ!

కల్లంగడి నెందుకుపెట్టరాదు? ఇతరులు నీచ మన్నంత మాత్రముననే అది నీచమగునా? కొబ్బరిచెట్లఁ బెంచుట పుణ్య

మగుచో నందుత్పన్నమైన యీసుర చేసిన పాపమేమి? సోమరులైన తనరైతులకుఁ దాను పుష్కలముగా నిచ్చుచున్న కూలిలోఁ గొంతనైన నీవిధముగా రాఁబట్టవచ్చును. ఇట్లని మొదలియారు తలపోసి సంకోచమును నివారించుకొని తన బుద్ధిచాతుర్యమునకు సంతోషించెను.

ఈవ్యవహారమును తాను స్వయముగా విచారించుకొనుట సాధ్యముగానిపని. అందువలన దానినిర్వాహకము నచ్చుటి నాటారుప్రముఖునకే వశముగావించెను. రుచ్యమైన కొబ్బరికల్లును కావలసినవారికిఁ గావలసినంతఁబోసి, అనాటారు అంగడి యెప్పుడును కళకళలాడున ట్లొనర్చెను.

## 3

అకూరులో సాయంత్రమగునప్పటికి కల్లంగడికి జనము గుమిగూడుట మఱువరానిదృశ్యము. పొలములనుండిఁ బరుగు దూరములో నున్నది కల్లంగడి. పిల్లకాయలు బడినుండి యే మిఠాయిదుకాణమునకో పరుగులెత్తినట్లు, కూలిజనము కూలి డబ్బులతోఁ దిన్నగా నిచటికే పరుగెత్తుకొనివచ్చెదరు. పూర్వము అకూరు చుట్టుపట్లఁ గల్లు చవిచూచినవా రరుదు. దూరమునకు లక్ష్యపెట్టనియుద్ధండులే కొందఱికో దానియను భవము. ఇపు డట్లుగాదు.

ఆరోజు సాయంత్రము కల్లంగడిఁజేరినజనములో నన్ని రకములమనుష్యులును గలరు. కాని వారికి సాంప్రదాయసిద్ధమైన విభజన లేకపోలేదు.

నందన్, మూఖన్, కాటేరీలు అనుభవశాలురలో నగ్ర గణ్యులు. తమబోంట్లకైన యీసుర సోమరిపోతులందఱికి నబ్బుచున్నదిగదా యని వారికి గంటు.

ఇరుల్లన్, కరుప్పన్, ఇరుల్లప్పనులు కుస్తీజట్టునకు మొనగాండ్రు. పనిలో నెంతచుఱుకో తిరుగఁబడుటకు నంతచుఱుకైనవారే. యీావనదర్పముతో వారంగడినిఁ బ్రవేశించిరి.

ఈరెండుతెగలును "అంటరాని"వారే. ఉర్వీమతల్లి స్పర్శ వీరికి జన్మసిద్ధము. కృషీవలులన్న వీరు. తలమనిషి అమవశి ఇతరులతోఁ గలియఁడు. కండలుతీఱిన యాతనిబలిష్ఠకాయము నల్లగుండువిగ్రహమువలె నుండెను.

గోవిందన్, పవడాయి, నల్లనులు తమమిత్త్రపరివారముతో మఱొకజట్టు. వీరికింకనుఁ గల్లు నిబ్బరము పూర్తిగా నలవడలేదు. తప్పుసేయుచున్నామను నాత్మప్రబోధము వారి ప్రాలుడు మోములందు వ్రేలుచుండెను. వీరందఱును పడయాచీలు. తంజావూరునందు చోళనాయకరాజులు రాజ్యముసేయుచున్న కాలములోఁ గాల్బలమంతయు నీపడయాచీలే. ఇప్పటికిని కల్లంగడిజగడములయందు వారి యాటోపము కొంతబయట పడుచుండును. కలహములకుఁ దామే కాలుద్రవ్వి, తమకన్న బలిష్ఠులైనను నందన్, మూఖన్, కాటేరీ, ఇరుల్లన్, కరుప్పన్, ఇరుల్లప్పనులను లొంగఁదీయుచుందురు.

ఇహాపరములందు మెప్పులేని యీపాటకసైన్యమునకుఁ గల్లంగడియే క్రీడారంగము. వారి కిచట దేవతలకులేనిసంతోషము. నాదనిచెప్పఁదగిన యింటిపట్టుగాని, జేనెడు చేనుగాని అందులో నొక్కరికినిలేదు. తెల్లవాఱినదిమొదలు చీకటిపడువఱకును విధివిరామములేక కష్టించుచుండే వారిజీవనము. పూర్వమెట్లో, యిప్పుడు నట్లే. శతాబ్దములతరబడి మార్పులేదు. ఆపూర్వపద్ధతులను ఛేదించుచున్ననూత్నశక్తులు వారి కెఱుకయే లేదు.

# 4

మొదటిజట్టునకు మొనగాఁడు నందన్. తనకు చిరకాలానుభవమైన సారాయిసామ్రాజ్యమున నూతనముగా నడుఁగిడినకుఱ్ఱవారింగూర్చి తనమిత్రునితో నిట్లు చెప్పఁదొడంగెను. "మూఖా! వీరినిఁ జూచుచున్నావా? ఎంత చేతగానివారు! కల్లుద్రాఁగు టొకవిద్య. అది పుట్టుకతోడనే రావలయును. నేర్చినవచ్చునా? అందునను ఒక్కరోజులో! త్రాఁగుటలో నెమ్మది, ఛలాకు ఉన్నవనియైన వీ రెఱుఁగుదురా? ఈకుఱ్ఱవెధవలకు ముంతనెత్తి నోటికిఁ దగిలించి చప్పరించుటయైనవచ్చునా? మంచినీళ్లవలె గుటగుట నోటిలోఁబోసికొనుచున్నారు. చూడు చూడు. మనతలమనిషి తెలివి! పొలములోఁ గొరడాకర్రను బుచ్చుకొని నిలుచున్నప్పుడు, అమవశి గట్టివాఁడే గావచ్చును. కాని కల్లంగడిలో వాని ప్రతిభయేమిటి? నేలఁబడిన చేఁప!"

నందర్ దెబ్బదియేండ్లవాఁడు. ఐనను ముంతమీఁద వాని పట్టుచలింపదు. వాఁడు నెమ్మదిగా నిలిపినిలిపి ఒక్కొకవాక్యమును పల్కుచుండెను. వానికంటి గ్రుడ్ల తిరుగుడులో ననుభవచక్రము తిరుగాడుచుండెను. పురాతనానుభవమునఁ బాల్గొనవచ్చినకుట్టువారియెడ నాతనిరోషద్వేషములు ప్రస్ఫుటమగుచుండెను. వీరిరాకవలన ధర పెరుగుటయేగాక కల్లు పలుచఁబడుచుండెనని వాఁడెఱుంగును.

"నందా! మనము వీరికి బుద్ధిచెప్పవలెను. ఇక్కడనైనఁ బెద్దలెవరో పిన్నలెవరో వారికిఁ దెలియవలయును. అమవశి మనకుఁ దలమనిషిగావచ్చును. కాని కల్లంగడిలో వాఁడొక బ్రద్దలైన కుండతోసమానము. వానియంతరము వానికిఁ జూపవలెను." అని మూాఖర్ తిన్నగొంతుకతో బదులుజెప్పెను.

అపుడు కాశేరీ, యింతవఱకుఁ దాను త్రాఁగుచున్న మూఁడవముంతను ముగించి,యీావైపుతిరిగి కండ్లెఱ్ఱగా జ్వలించుచుండ నొకవెడనవ్వునవ్వి యిట్లుచెప్పెను. "మూాఖా! నీకిన్ని యేండ్లువచ్చినవేగాని దీనికంతకు నిజమైనకారణమేమిటో దెలియలేకున్నావు."

మూాఖర్ కాదని తలనూఁచినను గమనింపక కాశేరీ తన ధోరణి నిట్లు సాగించెను."అమవశి మనమూలపల్లెపై నధికారము నేయుట నల్లర్ ఉన్నాఁడను నిబ్బరముతోనే. నల్లునకుఁ బట్టుగొమ్మ మనయజమాని. నందా! నీవాలోచింపుము___మూాఖర్

కేమియుఁ దెలియదు. వానికి సిద్దెతలకాయ, సొరకాయముక్క గాని మట్టిబుద్ధిమనిషి. మనము దినమంతయుఁ గష్టించెదముగదా. జీవితమునకంతటికి సుఖమనుకొనఁదగిన యీకల్లుముంతకు రూక మిగులులేదుర్ఘటముగానున్నది." కాశేరీ కోపముతో గ్రుడ్లు త్రిప్పి గర్జింప మొదలిడెను. "ప్రపంచములో మాలవానికుండు నదే కల్లుముంత. వేఱెచుట్టము లేదు. మనకేమి పొలా! పండ్లా! పూవులా! మన పెండ్లాలు మనతో బాటు పొలములందుఁ బాటు పడవలసినదే. మనబిడ్డలు రాళ్లలో, ముండ్లలో, అడుసులో, గొడ్లను మేపవలసినదే. వాటిపాలు వీరినోటిలోనికి గుక్కెడైనను రావుగదా. నంచా నీవు చెప్పుము. కల్లుముంత లేక పోయిన మనబ్రదు కెందుకు?"

ఈయుపన్యాసమునకు హర్షించినట్లు నందన్, మూఖను లిర్వురును తలలూఁచిరి. కాశేరీ మఱొకకల్లుముంతఁ ద్రాఁగి సాగించెను. "మనకష్టమునకు మనకువచ్చుదానికి నాలుగింతలు నల్లన్ సంపాదించును. అదంతయు న్యాయముగావచ్చుచున్నదా? నల్లన్ కుప్పకావలిగాచును. మొదలియారు నెల కిరువదిరోజు లూరిలోనుండఁడు. కుప్పలో నెలుకలబొక్కలున్నవి. వాటికి నల్లన్ కాపలాగాయును. పగలు రాత్రి వాని కదేపని!"

మఱొకని యీభాగ్యవిలసనమునకు కాశేరీ గాంధ్రించెను. యౌవనమునఁ దానును పేరుమ్రోఁగినకుప్పదొంగ. వాని దీర్ఘబాహువు లిందుకొఱకు ప్రకృతి నిర్మించెనో యన్నట్లుపక రించినవి.

నంద౯, మూఖ౯, కాశేరీలకు అందఱు రైతులకున్న కష్టములు లేవు. వీరిభుక్తికి మొదలియారుతండ్రి సదుపాయము చేసిపోయెను. ప్రక్కన విరోధిగ్రామములోని కర్ఘరాత్రిఁబోయి పగవారికుప్పల నుఱుచుకొని తెల్లవాఱులోగా ధాన్యముతో గ్రామమునేరుకొని నందులకు మొదలియారుతండ్రి వీరికి యావజ్జీవపర్యంతము నెలకు రెండుతూములవడ్లు ఖరారుచేసెను. అందువలననే కల్లంగడిలో వీరి కింతసంభాషణాసౌలభ్యము.

## 5

రెండవజట్టు ఇరుల్ల౯, కరుప్ప౯, ఇరుల్లప్పనులును సంభాషణను సురసేవను సాగించుచుండిరి.

"ఇరుల్లా, నీకీవేళ డబ్బెక్కడిదిరా, వారంరోజులనుండి పొలముమీఁదఁ బనిలేదుగదా! నామట్టుకు నాకుఁ దలప్రాణము తోఁకకువచ్చినది" అని కరుప్ప౯ అడిగెను. కరుప్ప౯ మొదలియారునొద్ద నెలజీతమునకుండెను.

ఇరుల్ల౯ గూడ మొదలియారునొద్ద జీతమునకుఁ బని జేసినవాఁడే కాని కలిసికట్టుపనిలో నాతనికిఁ జాకచక్యము లేక పోయెను. అందఱికన్నఁ దానే యెక్కువగా పాటుపడియు మిగిలిపోయినపనికి బాధ్యత తనతలకుఁ జుట్టించుకొనుచుండెను. చివరకొకసారి యేదోంగతనములోనో, చేసినది తానైనను, లాభపడినది అమవళియగుటచేతఁ గలహామువచ్చెను. అపుడు తలమనిషి వీనినిఁ బనినుండి తొలగించివైచెను.

"కరుప్పా, డబ్బెక్కడిదా? పెండ్లామును సాధించితిని. డబ్బువచ్చినది."

"ఏలాగురా!"

"ఏలాగా, యీలాగే" అని తనకుడిచేతిని గాలిలో విసరుచు, "తాను దాఁచుకొనియున్న వెండికడియము నిచ్చు వఱకు సాధించితిని."

"మొనమొన్న నేపోయిన కుఱ్ఱవానికడియముగదరా!"

"అవును. దానిఁజూచి యేడ్చుకొనవచ్చునని నాపెం డ్లాము దాచియుంచినది. ఇక దానితోసరి. కాని నీకెక్కడినుండి వచ్చినదిరా డబ్బు. కరుప్పా! నీకు రావలసినబత్తెముగూడ పదిహేనురోజులనుండి వెనుకబడియున్నదఁటగా. నీయజమానికి మోటారులో రావడంపోవడంతోనే సరిపోవుచున్నది."

"అవునురా, ఇరుల్లా. ఈపాలములోఁ బనిచేయుట కంటెఁ గడుపుగోట్టుకొనిచచ్చుట మేలురా. ఇక్కడ పశువుల కంటె నన్యాయము మనుష్యులకు. అమవశి నల్లనులవంటి దొంగల కిది స్థలముగాని మనకుఁగాదురా. నాకు నిన్నరాత్రి యంతయు నిద్రలేదు. కాలువప్రక్కనున్న నల్లతుమ్మచెట్టు నీకుఁదెలియునుగద. వఱదలవలన విఱుచుకొని పడియుండినది. ఎందఱో దానిమీఁదఁ గన్నువేసియుండిరి. నేను గొడ్డలితోటి రాత్రిఁబోయి, దానిని చీలవేసి,అయిదుమోపులుగట్టి,పెండ్లాము నెత్తినొకటి, పిల్లవానినెత్తినొకటిపెట్టి, మిగిలినవి నేను తల

కెత్తుకొని, అర్ధరాత్రమున మాయవరమునకు బయలు దేరితిని. దారిలో ముండ్లు, బురద, గాఢాంధకారము. ఉదయమునకు మాయవరము చేరి, సగముఖరీదున కామోపులనమ్మి, సొమ్ముచేసినాము. పొట్టజీల్చినచెల్లె నప్పటికిని, దొంగ చూపుపోదురా వాటికి. ఐదింటికిఁగలిసి ఒక్కరూపాయవచ్చినది. ఇదిగో రూపాయ, భద్రముగా తెచ్చినా" అని కరుప్పన్ సంతోషముతోఁ బొంగిపోవుచు, రూపాయఁజూపఁగా, ఇరుల్లన్ దానిపై దృష్టినిలగించి తనమందభాగ్యతను లోనదూఱుచుండెను.

ఈవెండినాణెము నందఱును పడిపడి చూచుచుండఁగా, కరుప్పన్ తనకథసాగించెను. "రూపాయను పూర్తిగా దెచ్చితిని. నా పెండ్లము గాజుల కొక్కణా యడిగినది. కాని గాజులు వద్దనువఱకుఁ జేయి మెలివేసితిని. చివరకొకదవడ పెట్టు పెట్టితిని. ముండ్లను బురదను ద్రొక్కుకొనుచు రాత్రివచ్చిన కుఱ్ఱవెధవ రెండుఇడ్లీలకని ఒక్కణా యడిగెను. వానికి నోటిమీఁద నొక తాపుతాపి, ముందటి కొకత్రోపుత్రోసివచ్చితిని. ఇట్లు సంరక్షించిన రూపాయ యిది. ఎంత త్రాఁగినను మూఁడురోజులకుఁ జాలదట్రా, ఇరుల్లా?"

"ఒరే కరుప్పా, నిన్ను దొంగతనమునకుఁ బట్టుకొని కొఱత వేసిన నెట్లురా? ఇక్కడనేయున్నాఁడు. తలమనిషి అమవశి. నల్లన్ గూడా!"

"వాడనిన నాకు భయమా? కల్లంగడిలో నందఱును సమానమే. వాఁడు తలమనిషియైన నాకేమి? ఒకముంతకల్లిప్పిం

-చిన నంతయు సరిపోవును. అమవశీ, యెట్లున్నదీ వేళ నీయదృ
ష్టము?"

"సోమరివెధవల్లారా, మీపని మీరుచూచుకొండి. కరుప్పా, యెక్కడ దొంగిలించినావు రా, రూపాయను?"

"లేదులే అన్నా, నేను దొంగిలించినాననే అనుకో, నీకు భాగంలేదేం?"

"అట్లయి తేసరే."

"అమవశీ నీవు చాలమంచివాఁడవు. ఎప్పటికి నీవే తల మనిషిగానుండవలె. కుప్పలు, యెలుకబొక్కలు, మన అమవశి చిరస్థాయిగానుండవలె" నని ఇరుల్లన్, కరుప్పన్, ఇరుల్లప్పనులు ఒక్కగొంతుకతో నఱచిరి.

ఈసందడిలోఁ దనకు డబ్బెట్లువచ్చినదో యడుగలేదు గదా యని ఇరుల్లప్పన్ సంతోషించెను. నెలరోజుల క్రిందట మొదలియారింటి కొక పెద్దమనిషివచ్చి తోఁటయింటిలో విడిసి యుండఁగా వీఁడు వారిబంగారుగొలుసు నొకదాని నపహరించి, కల్లంగడివానివద్దనే తాకట్టుపెట్టి, ఒకనెలవఱకు నిశ్చింతగా మద్యపానమును ఖరారుసేయించుకొనెను.

## 6

మూఁడవజట్టు గోవిందన్, పవడాయి, నల్లనులు, కల్లంగడి సమాజములోఁ బెద్దలు. వారును మాటలోను, ముంతలోను

దీసిపోకుండిరి. నల్లన్ వీరినాయకుఁడు. ఇతఁడు చొక్కలింగ మొదలియారు సేద్యమున కంతటికిని మేస్త్రీ.

"నల్లా, ఇటీవల మొదలియారువ్యవహారము లేమియు నీకు సరిపడుటలేదుగదా. మన మీకుప్పదొంగతనములు మానుకొని యేదో క్రమమైనపనిలోనికిఁ దిగఁగూడదా?" అని గోవిందన్ హెచ్చరించెను. గోవిందను నల్లనునకు దగ్గఱబంధువు. మొదలియారునకు నతనికి నెడముగల్పించు నవకాశమును వృథాపోనీయఁడు. "మనము పగలు రాత్రి కష్టించుచున్నాము. మొదలియారుమాత్రము పట్నవాసములనుండి క్రొత్తక్రొత్త మనుష్యులనుఁదెచ్చి మహారాజులలాగున మేపుచున్నాఁడు. భూమికిగాని పేరునకుగాని పూర్వమున్న గౌరవ మిప్పుడుపోయి నది. ఉదారుఁడు కందన్ చెప్పినట్లు, ఇదంతయు నెప్పుడో కూలి పోక తప్పదు."

"అవును. గోవిందా, నీవు చెప్పునది నిజమే. నాకుఁ బదు నెనిమిదినెలలనుండి జీతము బత్తెములేదు. యజమాని ఊరిలో నుండఁడు. బదులు మనుష్యులకేమి యెవరియిష్టము వారిది. ఈయేఁడు సగంభూమి బీడువడియున్నది. నేనెంతమందలించి నను, అమవశి యెంతకొరడాజాడించినను, రైతులందఱు నిప్పురు గప్పిననిప్పువలె నసంతృప్తులైయున్నారు. మొదలియారు కౌన్సిలు యెన్నికలలోఁ దగుల్కొనినాఁడు. ఆనాగపట్నంమనిషి నోడఁ గొట్టవలెనఁట. మనకీవలసినజీతము డబ్బులు అధికారులదండుగ తిండికి వ్యయమగుచున్నవి."

"కందర్ లాగే మాట్లాడుచున్నావే నీవు! మనము పండించు పంటలో మనకు భాగము లేదు. ఎందు కిట్లుండవలె? నల్లర్, నీవందఱినిఁ గట్టుకట్టి పాటుపడుము. మేమందఱము చావు కైనను సరే నిన్ననుసరించెదము. అమవళి తనమనుష్యులనందఱిని నీకు సహాయపెట్టును. ఈదొంగలను ధూర్తులను మనుష్యులను జేయుము. కందర్ చెప్పునదదేగదా. ఏదో మంచిపని చేసి మాకందఱకును దారిఁజూపుము. సారాయిసాక్షిగా చెప్పుచున్నాను. ఆమరణాంతము నిన్ను వదలను."

"కందర్ చెప్పునదియు నదే. అందఱిమేలునకై పాటుపడుమని. ఈ త్రాగుడు మానవలెనని. సారాయి విషముతో సమానము."

"దేవుఁడాదేశించినాఁడనుకొని, కందర్‌మాట ననుసరింతము." అని పవడాయి అందుకొనెను. "కందర్ మహానుభావుఁడు. ఋషికల్పుఁడు ఈదినమాతనియాశ్రమమునకుఁ బోయియుంటిని. బీదలకు బాధితులకు రాట్నములను ఖద్దరు బట్టను పంచుచుండెను. నేటాలూలో నీతఁడు చాలసంపన్నుఁడఁట. తంజావూరుకలెక్టరుదొరలాగే పరీక్షలిచ్చినాఁడఁట. కాని అట్లుండు టీతని కిష్టములేదు. అతఁడు నన్నెంతో ఆదరించెను." పవడాయి నల్లర్‌తమ్ముఁడు. పదునాలేండ్లకుఱ్ఱవాఁడు.

"పవడాయి, అతఁడందఱి నాదరించును. నీవనిన నాతనికిఁ జాలప్రీతి. మాలో నీకే కొంచెము చదువువచ్చును. నన్ను

బడికిఁ బంపలేదు. నిన్నేని బైకిఁ జదివింపలేకపోతినని వగర్చుచున్నాను. కుప్పలో బొక్కులు పెద్దవిజేసినైన నాపనిఁ జేసియుండెడివాఁడనే. కాని అడ్డమువచ్చిన దీకల్లంగడి. అంతటితో మనవ్యవహారమంతయు పాడైనది. ఈవిధముగా మొదలియారుగూడ చాలరోజులు నెగ్గఁజాలఁడు."

"కుష్ఠివాఁడను నేను. ఐనను నాకు నర్లైతోఁచుచున్నది. గ్రామజీవితము మాఱిపోవలెను. ఈకల్లంగడి పోవలెను. మన కుటుంబము నన్యాయముచేసిన దిది. మనలను మనుష్యులఁ జేయఁగలవాఁడు కందర్. అతనియుపదేశము ననుసరింతము. ఎప్పుడో మొదలియారునుసైత మాతఁడు మార్చగలఁడు. అతనికన్నులలో నొకమహత్తు గలదు. ఆతేజము దైవాంశము."

"మొదలియారును దేవతలు లేచివచ్చినను మార్పఁజాలరు. అతఁ డీవఱకే బురదలోఁ, గూరుకొనిపోయినాఁడు. పెండ్లిగాని తనకుమారునిచేష్టల కాతనితల్లి విలపించుట చూచి తీఱవలెను. గుండెల భేదించుశోక మామెది—అదిగో, కందర్ వచ్చుచున్నాఁడు. అతనిముఖ మెట్లు ప్రకాశించుచున్నదో చూడుము. మన మాతని ననుసరింపలేకపోయినను, అతనికి సాష్టాంగపడుదము."

ఇట్లనుటలో నల్లన్ మనగిస్ఫూర్తిగా నే పల్కుచుండెను.



# రెండవ ప్రకరణము.

## అడయారుసందుఁ శ్రేయసులు.

### 1

అడయారునది సముద్రముం గలియుచోటికి దాపుగా నొక విశాలమైన వంతెనగలదు. ఇచట రాకపోకలు తక్కువయ్యెను ప్రభుత్వనిర్మాణశాఖవారు తాము ను గొప్పకట్టడములు నిర్మింపఁ గలమని తెలుపుటకుఁగాఁబోలు నింతవంతెనఁ గట్టిరి. నదీ జలము వర్షాకాలమునఁదప్ప, సముద్రముతో నితరవేళల సరస మాడదు. కాని పోటుపాటుంబట్టి సముద్రజలములే నిరంతర మీావంతెనక్రింద నీలిమ నెఱపుచుండును. కమానుమధ్యఁ జేపట్టు గోడనానుకొని నిలుచున్నచో వారాశియు, భూసీమయు, భాను మండలమును సంప్రీతి సంపాదకములై చెలువారుచుండును.

ఈవంతెనదాటినచో దివ్యజ్ఞానసమాజమువారి యుద్యాన వనము గలదు. ఇచటియవస్థ, జీవితపరమప్రయోజన మరయు జిజ్ఞాసువుల'మానసాంబరమువలె నిశ్చలము నిభృతమునై నెగడు చుండును. నవనవలాడు ప్రకృతిదృశ్యముల వర్ణశబలతయు పరిమళసంభారములును తన్మయతఁ గలుగఁజేయును. సాగర వీచీసంజనితమరుదంకురములును శాంతిసంవాహకములై మెసోఁ కును.

ఇచటనే దివ్యజ్ఞానసామాజకులసమావేశముల కాటపట్టై జగద్విఖ్యాతమైన వటవృక్షముగలదు. దానిచెంతనే అతిథిగృహము. ప్రకృతిమానవుల యన్యోన్యతవలన నీప్రదేశమతిలోకరమణీయమైనది. నదిలోనికిసాఁగివచ్చి వెన్కకుమరలు సముద్రజలములమర్మరధ్వని తల్లింగూర్చి శిశువునోటవెడలు జిలిబిలిపలుకులచొక్కుగల్గి, చిక్కనియక్కడివృక్షవాటి నామ్రేడితమగుచుండును. పలురంగుల చిన్నిపక్షులు లెక్కకుమించి కలకలనాదముం జెలఁగించును.

రోడ్డుపై రాళ్లు బగులఁగొట్టుచు చెమటనోడ్చు కూలివానిదుస్థితి నేమాత్రమును సరకుసేయక, తెల్లదొరతెప్పయొక్కటి చల్లగా, నీలాంబరమున శరన్మేఘమువలె నదిపై నడయాడుచు స్వైరవిహారవిభ్రమమున విదేశీయునివిజయభావమును వ్యక్తముసేయుచుండును.

అక్కారునఁ గల్లంగడికిఁ గూలిజనమును త్వరగొల్పుచు నెం 9 రు రైలు కూఁతవేసిన యానాటిసాయంకాలమే అడయారునందు నావిర్భావమయ్యెను. అతిథిగృహము, లతాశీతలచ్ఛాయనుండి వాహ్యాళివెడలుటకై వెలుపలి కడుఁగిడినకన్యాకామణివోలె సాయంసూర్యరశ్మికలనాసంశోభితంబై యొప్పారుచుండెను.

రాజేశ్వరీబాయిపసారలోఁ జీకాకువడిన మనసుగలదియుంబోలె నడయాడుచుండెను. అతిథిగృహమున కధిదేవ

తర్యో యనునొప్పు నామగువ యొక్క ప్రత్రయే ఆదినమున కతిథి. రాజేశ్వరి యొకమహాపురుషునికిని, ఒకమహానారికినిఁగూడశిష్య. ఆమహాపురుషుఁడే గాంధి. ఆమహానారియే ఆనిబిసెంటు. రాజేశ్వరి దృష్టి యెదురుగనున్న బాటపై నటునిటు సంచరించుచుండెను. ఆబాటకును రహదారికిని రెండుఫర్లాంగులుండుటచే నచటఁ బరువు లెత్తుమోటారులకేకలు మాటిమాటికిని నటచ్ఛాయ నలమియున్న శాంతిని సంచరింపఁజేయుచుండెను. అట్టినినాదములకు రాజేశ్వరియు నెందులకో పులకరించుచుండెను. డాబా నుండి అడయారువంతెన రమణీయముగాఁ జూపట్టెను. దగ్గఱఁ జూచిన నతిస్థూలమైనయావంతెన, ఆపాటిదూరమునకు బలిష్ఠకాయుఁడగు నొకవీరశేఖరుని సామ్యముం బొరసెను.

పేటిగట్టు కాలినడకదారిని, రంగస్వామి యరుదెంచెను. నిశ్శబ్దముగా నతఁడు మెట్లనుదాటుకొని, నిరీక్షణభావనలచే సగము మైమఱచినరాజేశ్వరి భుజసీమను వెనుకమళ్లుగా తన కరము నునిచెను. ఆశీతలమృదుస్పర్శ కామె యులికిపడెను. కాని వెంటనే భావమును చక్కదిద్దుకొని యిట్లనెను—"దడదడగొట్టుకొనుహృదయమునకు వీపుదట్టిన నుపశాంతిగలుగదు. రంగా! మానవుగదా నీతమాషాలు. ఈవత్సర మెందఱినో మార్చి వైచినది. నీవు మాత్ర మెప్పటివాఁడవేసుమా!"

రాజేశ్వరిపలుకులందుఁ బ్రేమయు కోపమును సమ్మిళితమైయుండెను.

"రాజీ! నీకు సంభ్రమముగల్గించి, సంతోషపడుటకే యిట్లు జేసితిని."

"మంచిఅధికారులే!"

"అబ్బా, యెందు కీపెడమాట! ఒక్కసంవత్సర మెడఁ బాసియుంటిమిగదా! నాల్గుఘలోక్షుల్లైనఁ బ్రయోజనముగా రాదా? నీవు నన్ను విక్టోరియాటెర్మినసుస్టేషనువద్ద వీడ్కొని నప్పుడనినమాటలు జ్ఞాపకమున్నవా? ఆనీసూటివాక్కు లేసుమా పనికిమాలిన యధికారపదవులంబడి పరితపించు నాచిత్తమున కుల్లాసముం గొల్పుచు నన్నింతవట్టునకుం దెచ్చినవి."

"అప్పుడే అధికారముతో నసంతృప్తియా! నెలకైదు వందలును జిల్లాయధికారిహోదాయును తృప్తిగొల్పవా? లండనులో నీవు ప్రజల ఆయవ్యయములగుణించుట జ్ఞప్తికిఁదెచ్చి కొమ్ము. భారతదేశమున సామాన్యమానవునకు దినమున కాదాయ మొక్కయణామాత్రమే."

"ఇప్పు డప్పటికన్న నెక్కువ దెలియును. అప్పుడు లెక్కలంబట్టిమాట్లాడితిని. ఇప్పు డనుభవముంబట్టి చెప్పఁగలను. మనదేశములో జను లతిదరిద్రులనియు, అజ్ఞానాంధకారపరీవృతులనియు, ప్రపంచమునం దెల్లనధఃపతితులనియు నెఱుంగుదును. కాని దీనికిఁ బ్రతిక్రియ వారిచేతిలోనే గలదు. ప్రభుత్వమేమియుఁ జేయఁజాలదు."

"అప్పుడే ప్రభుత్వాధికారులధోరణి పట్టువడినదే!"

"రాజీ! నేనిచటికి బీదజనముంగూర్చి మాట్లాడరాలేదు. అంతకన్న నాహ్లాదకరమగువిషయములు లేవా?"

"ఉన్న వా?"

"తప్పకుండ, రాజీ!"

రాజేశ్వరిముఖ మించుక యెఱ్ఱవడెను. కాని ప్రేమభావమునకన్నఁ గోపమే యందుఁ బ్రస్ఫుటమాయెను.

"నీవు లేక, రాజీ! నాకు నెలకు రెండువేలున్నను నేమి ప్రయోజనము. ఇప్పటికైనను నిశ్చయింపవా? ఆక్స్ఫర్డునందు మనము మనదేశముంగూర్చి మూడున్నరవత్సరములు దలపోసినదంతయు మనమిర్వురముంగలిసినచోఁ గార్యముఖమొనర్పవచ్చును. పనిగదా ప్రధానము. మాట లెంత తెలివితోఁ గూడుకొన్నను ఉవ్వెత్తు పనికిరావు. దేశశ్శ్రేయమునకుఁ బునాదులైన గ్రామాదులలోఁ బ్రత్యక్షచర్యలకుఁ గడంగవలయును."

"నేనును అట్లే తలంతును. కాని నిజమైనపని ప్రభుత్వమునకు వెలుపల జరుగవలెను. ప్రభుత్వమున కిప్పు డొకటేపని దేశభక్తులను జైళ్లలో వేయుట."

"ఎందుకీమాటలు! ప్రభుత్వసహాయము లేని దే యేమియుం గొనసాగదు. పూర్వము నేనును నీవలెనే యనుకొంటిని. కాని అనుభవము నాయభిప్రాయమును మార్చినది. వ్యక్తుల

పరిశ్రమము నిష్ఫలము. ప్రభుత్వమే పట్టుగొమ్మ. ఏదిచేసి నను మనమిర్వురముంగలిసి చేయుదము. మన వివాహముమాట యేమి?"

రాజేశ్వరి పెదవివిఱిచెను. అపుడావిడ మఱింతమనో హరముగా జూపట్టెను. రంగస్వామి అనెను.

"రాజీ! నీవిపుడే నిశ్చయింపవలయును. ప్రజ్ఞాళువైన నిన్నొంటరిపాటునకు విధాత సృజింపలేదు. అతిమనోహరమైన నౌక అసాధ్యమైన వజ్రభారమునకై యెదురుసూచుచు నెన్నాళ్లు రేవున నిష్ప్రయోజనముగాఁ బడియుండవలయును?"

"ఆనౌకను బొగ్గుమోయుమందువా?" రాజేశ్వరి యీ మాట రంగస్వామిని బాణమువలె గ్రుచ్చుకొనెను.

రంగస్వామి నల్లనివాఁడు. కాని యీపొడుపుమాట నాతఁడు నవ్వుచునే గ్రహించెను. కొంచెము తామసించి, యిట్లతఁడు బదులువల్కెను—"అవును, అందువలన లోకము నకు వేడియు వెలుంగును గలుగునుగదా యని." ఈమాత్రము చాతురి రంగస్వామికి లేకపోలేదు. లేనియెడ నిరాశ్రయుఁ డగు నొకబాలుఁడు ఐ. సి. యస్. పరీక్షయిచ్చి, ఇరువదియైదవ యేటనే గుంటూరు అసిస్టాంటుకలెక్టరు యెట్లగును?

క్షణమునేపు రంగఁ పరిసరదృశ్య మవలోకించెను. "ఆంగ్ల భూమి నావిర్భవించి విలసిల్లిన యామనప్రేమను పెంపొందిం చుట కీవసారా తగినచోటుగాదు. రాజీ! అదిగో వటవృక్షము

నీలలితపాదాబ్జమును చుంబింపఁగోరి, శాఖాబాహువుల నేల కానించి సమాహ్వానించుచున్నది. ఆశీతలచ్ఛాయ కరుదేరు దము. వత్సరపర్యంతము దాచియుంచిన హర్షవారుణి నొకరి కొకరందిచ్చి క్రోలినఁగదా జీవనసాఫల్యము."

## 2

"రంగా! జీవితము కేవలము శృంగారముగాదు. ఆత్మ స్పర్ధ ఆలోచన లిపుడు నాకు మాఱినవి. సుఖముగాఁ బెంగ్లాడి మేడలందు భోగనిరతి నుండవలెనని నేను గోరుటలేదు. దేశ మాతపిలుపు ప్రేమవంక నామనసును పాలుపోనీయదు."

రాజేశ్వరి యిట్లు పలుకఁగా రంగఁడు ఆమెను తేఱిపాఱఁ జూచెను. ఆవిడకంఠమున నిశ్చయభావము వింతగొల్పెను. కన్నులందు దేశాభిమానము తొలఁకాడుచుండెను. ఎందఱనో దేశభక్తుల ననుదినము జైలుకంపుచుండిన అసిస్టాంటుకలెక్టరు ఒక్కచూపులోనే సర్వమును గ్రహించెను.

రాజేశ్వరి తనమెడను ముందుకు సాఁచి యింకను యిట్లు వల్కెను.—"నీవు చూచుటలేదు. కాని ప్రపంచమంతయు నుడికిపోవుచున్నది. ప్రాచీనవిధానము ఛిన్నభిన్నమగుచున్నది. అంతకన్న నున్నతమైన జీవితసౌధమును నిర్మించుటకే మన ముద్యమించుచున్నాము. ఆత్మస్పర్ధలో గ్రంథపఠనమునను, క్రీడాపరవశతను దీనిని గ్రహింపమైతిమి. నీవు అధికారివై మఱెంత హ్రస్వదృష్టివైతివని యీఅయిదునిమిషముల సంభాష

ణమే వ్యక్తముసేసెను. నూత్నభారతనిర్మాణావసరమున లోకో త్తరపురుషునినాయకత్వము సిద్ధించియుండ, భారతీయుఁ డెవఁడు గాని మేజాదగ్గఱఁ బాదువడియుండుట పాపకార్యము. మనము వ్యర్థులమయ్యెదమా?"

"రాజీ! నేను లోపలినుండియే దేశముకొఱకు పాటు పడుచున్నాను. దాని నెఱింగించుటకే నిన్నిచటికిఁ బిలిపించితిని. ప్రభుత్వములోఁ జేరి పోరాడుటయు నొకపద్ధతి. అంతకన్న భిన్న మైన కఠినవిధానమునకు వెనుదీసిగాదు. కాని భగవంతుఁడు నన్నీదారి పట్టించినాఁడు. దేశభక్తి మనోధైర్యములు పసతి పదవులంబట్టి తేలికగా మాఱిపోవు. ఒడలిరంగువలెనే పుట్టు కతోవచ్చును. నేను కలెక్టరుగా నేమిచేసితినో వినెదవా? గుంటూరు కాంగ్రెసుఉద్యమమునకుఁ బట్టుగొమ్మయని నీవెఱుం గుదువు. పైయధికారులు నాల్గులాఠీదెబ్బలతోను తుపాకీగుండ్ల తోను జాతీయోద్యమమును సమయింపవచ్చునని తలఁచు చున్నారు. నేనీవిషయమై యెన్నోమారులు ప్రభుత్వసభ్యునకు దీర్ఘముగా వ్రాసితిని. అతని కింగ్లీషు సరిగా నర్థమగుచో నిజ స్థితి నీవఱకు గ్రహించియుండవలసినది. మొదటినుండియు నే నీయుద్యమమువిషయమున నాభావముల కనుగుణముగ నే వర్తించితిని. కాని పోలీసుఉద్యోగులు సర్వదా మనముచెప్పి నట్లు నడచుకొనరు. ఈదినం ప్రభుత్వసభ్యునితో మాట్లాడితిని. పరిస్థితులేమో శుభమునకు మాఱనున్నవఁట. తొందరలోఁ ప్రభుత్వపద్ధతి మాఱఁగలదు. నన్నేమో తంజావూరునకు బదలా

యించిరి. గుంటూరులో నే నొకింత జాతీయోద్యమమునకు సానుభూతిచూపితినని ప్రతిఫలము. తంజావూరులో రాజకీయాందోళన తక్కువ. ఈబదలాయింపును నేను లెక్కసేయను. ఏమి, రాజీ, ఇదంతయు దేశసేవగాదా?"

రాజేశ్వరి యేమియు బదులువల్కక ఆలోచనానిమగ్నయై యుండెను. రంగఁడు సాగించెను. "నాపనిని నేను స్వతంత్రబుద్ధితో నిర్వహించితిని. అందువలననే బదలాయింపు. కాని తంజావూరు నాజన్మస్థలము. ఇంకను నేనచటికిఁబోయి పనిలోఁ జేరుటకు వారమురోజులు గడవుగలదు. అందువలననే నీకు తంతెగొట్టితిని. ఈసమయమున నీరాక నాకు మహోపకారి. ఏమిచేయుదువు మనవిషయము? ఇయ్యవా నీసమ్మతి? నీవు నన్నుఁ బరీక్షసేసెదవని యెఱుంగుదును. నీవు బొంబాయిలో జాతీయోద్యమమునఁ జేరి సాహసముతోఁ బనిసేయుచుంటివనియు నాకుఁ దెలియును. ఇండియాప్రభుత్వము నీపైఁ గన్నువేసియున్నది. ఈరాష్ట్రమున నీవు శాంతికి భంగముగల్గింతువేమో గమనించవలసినదిగా తంతెమీఁద నుత్తరువులు వచ్చియున్నవి."

"అవును, రంగా నీయెడ నాకుఁగలప్రేమయే నన్ను దక్షిణదేశమునకుఁ గొనితెచ్చినది. ఇచట నీతోఁగలిసిగాని, నీ కెదురుగాగాని పనిసేయవచ్చితిని. అంతయు దైవాధీనము. ఈ విషయము నీవనునంతసులభముగాఁ దీఱిపోదు. నీవు యుక్తివాదము జరిపితివి. దాని నేనంగీకరింపను. దేశభక్తుఁ డిప్పుడు

ప్రభుత్వమునకు బయటనే పనిసేయవలెను. ఇకార్యమును ప్రభుత్వమే యేబదేండ్ల క్రిందటఁ జేసియుండవలసినది. అప్పు డదిసేయలేదు. ఇపు డెంతమంచియుద్యోగులుకూడ దానికిఁ బనికిరారు. సంఘస్థితి మాఱిపోవు నవసరము వచ్చినది. మాఱక తప్పదు. ఏశక్తియు దాని నడ్డఁజాలదు."

రాజేశ్వరి హృదయావేగమున గాలిలోనికిఁ జేయివిసరెను. వటవృక్షమునఁ బ్రేమోన్మత్తులగు పిచ్చుకదంపతు లులికిపడి యెగిరిపోయెను. "ఇపుడు ప్రభుత్వముతోఁ బ్రయోజనము లేదు. నీనెలకై దువందలు వదలుకొని నాతోడి రణరంగమున కుఱికితివా, యిప్పటికిని నేను నీదాననే." ఇంచుక అలసట దేఱి మఱియు నిట్లనెను.

"ఈమూఁడు నెలలో బొంబాయి కొన్ని అద్భుత కార్యము లొనర్చినది. కాని యింకను మనము ప్రథమాంకముననే యున్నాము. మఱి నాలుగంకములనాటక మున్నది. నేను వేయిమైళ్లు దాటివచ్చుట నిన్నుఁ బెండ్లాడి సుఖముండు టకుఁగాదు. దేశాభిమానమును నీలోఁ బ్రజ్వరిల్లఁజేయుటకు. నీవు ఐ. సి. యస్. వదలుకుందువేని, నేనును, దేశమును నీకు దక్కెదము. నీ యధికారపదవినిఁ ద్యజించి కాంగ్రెసులోఁ జేరుము. బీదజనులకొఱకు పాటుపడుము. వారికన్నీళ్లను నీవు చూచి యెఱుఁగవు. జైలుకుఁబొమ్ము. లాఠీదెబ్బలు తినుము. జాతీయపతాకను మహోన్నతస్థానములకుం గొంపొమ్ము. అట్లు

చేయుదువా యీనాపాణి స్థిరముగా నీయది అవునుసుమా. మనసంతానము స్వతంత్ర దేశమున నుదయమగును."

"రాజీ! లక్షాధికారి కేకపుత్త్రివి. ప్రఖ్యాతవంశోద్భవవు. ఇట్టిమూఢావేశమువలన నీహృదయమును తపింపఁజేయనగునా? కన్నీటివాహినియేని బీదజనులను శుభ్రపఱుపఁజాలదు. వారి ప్రయాసము, వారి యాత్మవిశ్వాసముమీదనే వారియభ్యుదయ మాధారపడియున్నది. నీ యీలావణ్యము సౌధ సంవాసార్హముగాని జైలుకొట్టునఁ జీకువడఁదగదు. ఈదేశమున దేశారాధకున కెట్టి విపత్తులుగలవో నాయధికారానుభవము వలన నాకుఁ దెలియును. ఈ బ్రిటిషుసింహము జూలును మెలివేయుట చెల్లాటముగాదు." రంగన్ కొంచెము నిదానించి మాటల సర్దుకొని వెండియు నిట్లనెను.

"రాజీ వినుము. ఒక్కదినమున నొక్కకలముపోటుతో దేశము మాఱిపోఁజాలదు. కాంగ్రెసువాదుల వెఱ్ఱియది. నేనీవిధముగా వాదించుట నీ కిపుడు రుచింపదు. నీ భావములను నేను మరల్పఁ జూచుట అడయారునదిలోనికి సాఁగివచ్చు ఉప్పునీళ్లను వెన్కకుఁ బొమ్మనుటవలె నిష్ప్రయోజనము. దేశముం గూర్చి యుద్రేక ముప్పొంగినది. అందు స్త్రీజనమును తగులొన్నది. వారితో వాదించి ఫలములేదు" రంగన్ ధోరణికి రాజేశ్వరి యచ్చెరువందెను. "నీసోషలిస్టు సిద్ధాంతము లేమైనవి? లండనువేదికలపై బీదజనుల కష్టములంగూర్చి అట్లు గర్జించి యిప్పు డిట్లాడఁదగునా? నెల కైదువందలమాహాత్మ్య

మిది. అప్పటి నీయా యుదారభావములు గంభీరవాక్కులే నాకు నీయెడ మోహముంగొల్పెను. ఎంత తొందరలో మాఱితివి!"

"ప్రియా నేనుమారలేదు. బీదలయెడ నిప్పటికిని నాకు జాలి గలదు. నాయధికారపదవి నన్ను స్తిమితచిత్తునిఁ జేసియుండ వచ్చును. అంతియ. జీవితమున నెగుడుదిగుడులు గలవని యిప్పుడెఱుంగుదును. ఒక్కరి నుద్ధరించుటకుఁ గొనుచర్య మఱొక్కరిఁ గూలఁద్రోయుచుండును. సంఘమును చక్కదిద్దుటయన యుగములగుని. రాతిని మెఱుఁగువెట్టుటకు వర్షజలముల కెన్నియోయేండ్లు పట్టునుగదా. భిన్నమొనర్చుట నిమిషమాత్రము. ఇప్పుడు నేను జీవితము నలువంకలఁ గనుచున్నాను. అప్పటి భావముల నిప్పటికిని సఫలీకృత మొనర్పఁగలను. రాజీ! ఒక్క వారమురోజులు నాతో నుండుము. నన్ను నీవే యింతకఠినముగా విమర్శింపవు."

రాజేశ్వరి ఆలోచనానిమగ్నయై యుండెను. రంగన్ కన్నులు జేవురించి యిట్లనెను. నీవులేక నాజీవితము వ్యర్థము. నాహృదయము శూన్యగృహము. నాసర్వమునకు నీవే ప్రాణమువోయఁగలవు. నేనొక మృత్పిండమును మాత్రమే. నీప్రేమను నాకు నిశ్చయమొనర్పుము. మనము తిరిగి ఆకున్నఫర్డురోజులను ఆభావములను సఫలీకరింతము. బీదజనులకు జీవనాభిరుచిఁ గల్గింపఁగలము. వారికుండుటకు చోటు చెప్పుకొనుటకు నోరు నొసంగఁగలము. ఇదంతయు కలెక్టరుచేయఁగలఁడు. అతనికున్న

అవకాశము మఱొకనికి లేదు. రాజీ నామాట వినుము. నేను తప్పక యీమహత్కార్యమును చేయఁగలను. కలెక్టరు జిల్లాకు రాజన్నమాట. పోనీ చూడుము నన్ను వారమురోజులు. నిజము నీవే కన్గొనెదవు."

రాజేశ్వరి సమ్మతి దెలుపునట్లు శిరము పంకించెను. "పనిలోఁ జేరుటకు నాకింకను వారమురోజులు గడవుగలదు."

రాజేశ్వరి అతనిమాట కడ్డమువచ్చెను. "స్వరాజ్యము వచ్చినవెనుక నీపద్ధతి సరిగావచ్చును. ఇప్పుడు వీలుగాదు. ప్రభుత్వవిధానము మాఱనిదే బీదలకు నీవు మేలుగూర్పఁ జాలవు. ఇకాలమునఁ ద్యాగయుతమగుసేవ సైతము ధనికులకే లాభకారియగుచున్నది. జీవన మిట్లు చిన్నకాలువలుగా చెడిగిపోయవడినది. వెండియు నది సర్వజనులకు సౌఖ్యమొసఁగు మహారాశి గావలెను. ప్రకృతాందోళన కదియే పరమార్థము. నవయుగమున కదియే పరమాశయము. రంగా! నీకు నాప్రేమ వలయునేని, నీవు నీ కలెక్టరీత్యజించి, సాధకుఁడవు గావలెను. నీవు కలెక్టరుగాఁ బోవు జిల్లాలోనే నేను నాపని నారంభించెద. మంగళసూత్రమును గట్టవలసినచేయి ఖైదుశిక్ష విధించునేమో చూచెద. అదియు నాకు సంతోషమే. కాని నీవు కోరినట్లు వారమురోజులు నీతోనుండుట కభ్యంతరము చెప్పను."

"రాజీ, కృతజ్ఞుఁడను. ఈవారమురోజులు ప్రశాంతమైన బ్రాంక్వైబారున గడపుదము."

రాజేశ్వరి సమ్మతించుచు తలనూఁచెను.

"రాజీ, ఎగ్మూరు రైలుస్టేషనులో రాత్రి 8 గంటలకుఁ గలిసికొందము. బోటుమెయిలు 8—30 కు బయలుదేరును. నేను స్టేషను గడపలదగ్గఱ 7—45 నుండియే నిన్నెదురు సూచుచుందును.

"సరి, నేను 8 గంటలకు సరిగా వచ్చెదను."

రంగని ప్రేమపూరితవీక్షణము నొకదానిని రాజేశ్వరి ముఖసీమపైఁ బొలయించెను. రాజేశ్వరిచూడ్కులును రంగస్వామిముఖమున నించుక తామసించెను. ఇరువురముఖముల నేదోవేదన ప్రత్యక్షమగుచుండెను. కాని తత్క్షణ ముత్పన్నమైన నయనజలములుమాత్రము శాంతిస్థైర్యములఁ జాటుచు, తామరమొగ్గలపై మంచుబొట్లవలె విలసిల్లెను.

---

# మూఁడవ ప్రకరణము.

## అకూ్కరులోని కల్లంగడి.

"కందా! ఎందుకీవేళ నింత ఆలస్యము?" అని ఒక్కమారుగా నందన్, మూఖన్, కాళేరి, ఇరుల్లన్, కరుప్పన్, ఇరుల్లప్పనులు కేకవేసిరి. దీనినే, త్రాఁగి తడఁబడుచున్న మఱికొకపాతికమంది అందుకొనిరి. కందన్ రాక వారికి సారాయికన్న హర్షదాయకముగా నుండెను. ఆచుట్టుపట్లకెల్ల నతఁడే ఉత్తమపురుషుఁడు. వారినుద్ధరించుటకై సముద్రములుదాఁటివచ్చిన మహానుభావుఁడు. అందఱికిని అతనియెడ నపారమైనగౌరవము. తప్పత్రాఁగువానికి సైతము త్రాఁగుడులేనివానిమీఁదఁ బ్రీతిగౌరవములుండు.

ఆనాఁడు కందన్ ఆలోచనాపరవశుఁడై అంగడిలోనికిఁ బ్రవేశించెను. అతని ప్రశాంతగాంభీర్యముం గనుటతోడనే, చుట్టుపట్లసందడి డిందువడెను.

"ఏమికందా! ఏమైనది? ఎప్పుడూనవ్వుచు, ప్రేలుచుండువాఁడవు. ఎక్కడ నేమి పెడదారిఁబట్టినది?" అని నల్లన్ కొంత సాహసించి ప్రశ్న వేసెను. అప్పటికే మూఁడుముంతలను ఖాళీచేసిన నల్లన్ కన్నులు సుడిదిరుగుచుండెను. వెఱ్ఱినవ్వులో వాని

మాటలు లీనమైపోవుచుండెను. వాఁడు నాల్గవముంతనుఁ జేతి కందుకొని, యించుక చవిచూచి, కందర్ గౌరవార్థము గాఁబోలు నేలపై విసరివేసెను. అది మెల్లఁగా నిసుకలో దొర్లి దొర్లి టెంకాయప్రోదిలో వ్రేళ్లకుఁ దగులొ్కని నిలిచెను.

"నల్లన్, వినలేదా మీాయజమానింగూర్చిన క్రొత్త వార్త? అబ్బా! మీాకుఁ గన్నులు సెవులు నున్నవిగాని యీా అంగడికిఁ జేరుకొనుటకుఁదప్ప నవి వేతెందునకు నుపయోగ పడవుగదా! మీాకై నేఁజేయునదెల్ల బూడిదలోహోమము."

ఈమాటల కచటివారు కొంతభయభక్తులు సూపఁ దొడఁగిరి. కందర్ సాగించెను. "వినండి, మీామొదలియారు తనమనుష్యులతో నన్నణఁచివేయుట సాధ్యముగాదని తెలిసి కొన్నవాఁడై, యిపుడు సర్కారును బ్రతిమాలుకొనుచున్నాఁ డఁట. నాపై లేనిపోనికథలల్లి పోలీసులకు కలెక్టరునకు నివే దించుచున్నాఁడు. తెలియఁడుగాఁబోలు నాగప్పన్ కొడుకును కూలఁద్రోయుట తేలికపనిగాదని. నవయుగములో స్వాతంత్ర్యే చ్ఛనుఁజంపుట వానికి సాధ్యమా? ఈదినం నేను రైలుస్టేషను నకుఁ బోయియుంటిని. అక్కడఁ గన్బడినాఁడు మీామొదలి యారు. నెం 9 రు రైలుకొఱకు కనిపెట్టుకొని, స్టేషనుమాస్ట రుతో సంభాషించుచుండెను. స్టేషనుమాస్టరు క్రొత్తవాఁడు. బక్కచిక్కియెండిపోయినశరీరం. కాని వానిభార్యమాత్రము అద్భుతమైనరూపరి. స్త్రీలోకములో అట్టినారీమణిని నేఁ గని యుండలేదు. ఆమెముఖమున దివ్యజ్యోతి గలదు. అట్టి

సుమము నందనవనమునుండి బలవంతముగా భూమికిఁ దేఁబడ్డ నది గావలయు."

ఇందు కందన్ స్వగతమే యెక్కువ. నిజముగా స్టేషను మాస్టరుభార్యనుఁ గనినప్పు డతని కుదయమైనఆనందము స్వార్థ పరమైనదిగాదు. హిమాలయశిఖరములపై హిమపాతమువలె, ప్రావృడ్వేళ మేఘోదయమువలె, మందప్రవాహపరిణామోద్దిష్ట మయ్యును, యౌవనోత్సాహముతోఁ బర్వతవిహారమొనర్చు నిర్ఝరిణివలె నాయువతీలలామ మతని నాకర్షించెను.

"నేను చూచితిని మీ మొదలియారు అదరుచు బెదరుచు మెల్లగా స్టేషనుమాస్టరుయింటిపైఁ జూడ్కుల నిగిడించుట. నన్నుమాత్రము మొదలియారు తీక్ష్ణముగాఁ జూచెను. నేను మందహాసముతో నతనికి బదులువల్కితిని. నల్లన్, నాకును దర్శానులోఁ దోఁటలుగలవు. ఎప్పుడు తలఁచుకొన్న నప్పు డక్కడి కేఁగఁగలను. మీకొఱకుగదా నేనిక్కడికివచ్చి సంవత్స రమునుండియుఁ బాటుపడుట. ఇచట మీజీవన మతితుచ్ఛ ముగానున్నది. నేనెంత చెప్పినను, చేసినను, మీరు బాగుపడు నట్లులేదు. ప్రతిసాయంత్రము 'ఇది కడసారి, రేపటినుండి సారాయి ముట్టుకొనము.' అని మీరు చెప్పుటేగాని ఆరేపు వచ్చుటలేదు. దినములుమాత్రము గడచిపోవుచున్నవి."

నందన్, మూఖన్, కావేరి, ఇరుల్లన్, కరుప్పన్, ఇరుల్ల ప్పనులు మెల్లగా కందన్‌చుట్టును గుమిగూడిరి. కందన్ నిట్టూర్పువిడిచి, గొంతుసవరించుకొని యిట్లుపల్కెను.

"నందా, ఇరుల్లా, నల్లా, యిదే మీకు శుభసమయము వచ్చినది. మనుష్యులుగా నుండవలెనన్న, నీకల్లును విసర్జింపుడు. అంగడి దానంతట నిలిచిపోవును. అక్కూరు అప్పుడు తిరిగి బాగుపడును. సరియైనకూలికిఁ బని వెదకికొనుఁడు. మానవ మాత్రులుగండు. నేను మీకొఱకిచ్చిన డబ్బంతయు నెత్తిన నీకల్లంగడికేగదా మీరు ధారవోయుచుంటిరి. నల్లా నీవు ధైర్యస్థుఁడవు. వీరందఱు నీమాట వినుకొందురు. అక్కూరు నకు నీవుగదా మొనగాఁడవు. విశుద్ధజీవనమున నీవు వీరికి దారిఁజూపుము. కల్లువలన నీవును వారిలో నొకఁడవై నిష్ప్రయోజకుఁడ వగుచున్నావు."

కందన్ లేచి నిలుచుకొని, గాలిలోఁ జేయివిసరుచు నిట్లనెను.

"నల్లా, నూత్న జీవనగానమును నావీనుల నీగాలి రణిత మొనరించుచున్నది. మీకేమియు వినఁబడుటలేదా? లెండు, మేల్కొనుఁడు. ఇదే సమయము."

కందన్ అత్యుత్సాహముతో నిట్లు బల్కునప్పు డాతని నయనములు ప్రత్యక్షపరిసరముల నవలోకింపలేదు. భావప్రపంచమున భిన్నజీవనదృశ్యమును లక్షించియుండెను.

నల్లన్ హృదయము చలించిపోయెను. వెంటనే అతఁడు లేచి, మఱునాటిఉదయమునుండి తాను కల్లు ముట్టుకొనననిప్రమాణము జేసెను.

"కాని, కందా, నీవు నేటాలులో నెంతధనికుఁడవైనను, ఇక్కడ మొదలియారు అడ్డులేనివాఁడు. వానికి స్థానబలిమి గలదు. ఈతాలూకాలో వానిది ప్రభుత్వము." అని నల్లన్ మాఱినగొంతుతో తనసంశయమును వెల్లడించెను.

"నల్లన్ నీవు నాయుద్దేశ్యమును సరిగా గ్రహింపలేదు. మొదలియారుచేష్టలతో మనకేమిపని? మనయిల్లు మనము చక్కఁబెట్టుకొందము. త్యాగము ధైర్యము సోదరమానవుల కెంతద్గయైన మేలొనగూర్పఁగలవు. ఇతరులకు చెఱుపుచేయుట మనపనిగాదు. ఒక్కసంవత్సరములో మనచుట్టునున్న తుచ్ఛ జీవనము మాఱిపోవలెను. మాఱిపోదా, నేను విఫలమనోరథుఁడను, యేదేని ద్వీపాంతరమును సమాశ్రయించెదను."

కందన్ విశాలహృదయమును నల్లన్ గుర్తించెను. "సన్నగాళ్లము, పెద్దలు దారిజూపనిదే మేమేమియుం జేయఁ జాలము. ఇక్కడకు మాకు పెద్ద మొదలియా రేవిధముగా నడచుకొనుచున్నదియును మీరెఱుంగుదురు. ఇరువదిమూ డేండ్లు, పెండ్లిగాలేదు, అప్పుడే అతఁడు జీవితమును పాడు సేసినాఁడు. అతనితల్లి ఊరక దుఃఖించును. సేద్యగాండ్రకు కొన్నినెలలుగా కూలిడబ్బులు ముట్టలేదు. మంచిపనికి మాడ రాదు. చెడ్డసలహాలకు మాన్యములువచ్చును. జవానుమొదలు కలెక్టరువఱకును అతనివలన నేదో యొకటి పరిగ్రహించు వారే. అందఱు నతని భూషించువారే. ఇప్పటికే యీమనుష్యు లందఱు అసంతృప్తులై యున్నారు. ఇక వీరు నేరములకుదిగిన

నాశ్చర్యముండదు. గడ్డివాములు, పంటకుప్పలు తగులఁబడఁగలవు." దోచుకొనవచ్చునుగదా యని నందన్, మూఖన్, కాశేరి, ఇరుల్లన్, కరుప్పన్, ఇరుల్లప్పను లొక్కపెట్టుగా "భేష్" అనిరి. కాశేరి ఒక్కమాఱు తనదండలు విఱుచుకొనెను.

దీనినంతను కందన్ విని శాంతముగా నిట్లు బదులుచెప్పెను. "నల్లా, అదితప్పుత్రోవ. ఎవరికిని లాభకరముగాదు. పంటను తగులఁబెట్టినయెడల ప్రజలకుఁ గూడుండునా?"

"కాని, మాకు తెలిసిన దదొకటే. బీదలము. అజ్ఞానులము. అడగండి వీరినిఁగూడా."

అందఱును "భేష్, భేష్, ఈదినమే పనిగావింతము. యజమాని ఊఁరిలో లేఁడు." అని కేకలిడిరి.

"నల్లా, యిదితప్పు. వీరిని రేపి ముప్పుపాలుసేయుట తగదు. శాంతివలన శాంతి, కలహమువలన కలహము కలిసివచ్చును."

"అదుగో కరియన్ వచ్చుచున్నాఁడు. మామిడిచెట్టుక్రింద వాఁడే. మిమ్ము నాశముసేయుటకు మొదలియారేర్పఱిచినవాఁడు."

కరియన్ మెల్లఁగా కాళ్లీడ్చుకొనుచు అంగడిఁజొచ్చెను. వానికన్నులలో నధికసంతోష ముండెను. కందన్ చేతులుసాఁచి వానిస్వాగత మడిగెను.

"కరియా, నీకు నూతేండ్లాయుస్సు" అని ఇరుల్లప్పర్ ఆశీర్వదించెను. కందర్ కరియనులమధ్యఁ గలహము ప్రసగించుటకన్న ఇరుల్లప్పర్కుఁ బ్రియము లేదు.

"ఏదో నామీఁద నసుగొనుచున్నారుకదూ? అవును, ఉన్నాఁడుగా కందర్ ప్రక్కనే. ఎండినఆకులమీఁద నిప్పురవ లాగున మీమీఁద నేదో ప్రయోగించుచుటేగదా అతనిపని. త్రాఁగుడు లేనివారందఱు నట్లే. అందులకే ఒక్కముంతకల్లును చవిచూచి, మఱి లోకమెట్లగపడునో చూచి అనుభవింపుమని నేనతనికి బోధసేయుచుండుట." ఈమాటతో కరియర్ నురుగు వచ్చుచున్న కల్లుముంతను చేతికెత్తుకొనెను.

"ఏమి, కరియా, నీధోరణిఁజూచిన నీకేదో లాటుపడిన ట్లున్నదే?" అని నల్లర్ ప్రశ్నించెను. కరియర్ చేయిజాపి, అయిదురూపాయిలు చూపెట్టెను. వారందఱు నిర్ఘాంత పోయిరి. కరియర్ సగర్వముగా కందర్వైపు తిరిగెను.

కందర్, కరియనులు దాయాదులు. వారితండ్రు లేక కుటుంబముగానుండిరి. వీరిగ్రామము తిల్లాయడి. కరియర్తండ్రి పెద్దవాఁడగుటవలన సంసారములో నధికారమంతయు నతనిదిగా నుండెను. దేనులీప్రాంతములనుఁ బరిపాలించుచుండి నపుడు అతఁడేదో యొకపోరాటములోఁ జాలాధైర్యముతోఁ బ్రవర్తించినందువలన ట్రాంక్విబారునందలి డేనిషుగవర్నరు ప్రధానన్యాయాధికారిగా నాతని నియమించెను. జేష్ఠుని

నిరంకుశాధికారమున కాగ్రహించి, కందర్ తండ్రి నాగప్ప్ ఇరువదినాల్గవయేట నేటాలునకుఁ బాఱిపోయెను. ఆవంశములో వారికి ఇరువదినాల్గవయేడు ముఖ్యమైనది. అప్పుడే వారి అదృష్ట దేవత యిటో అటో ఆకుఁదిరుగవేయును. నాగప్ప్ నేటాలులోఁ బైకివచ్చెను. గాంధీమహాత్మునకక్కడ నితఁడు చేదోడు వాదోడుగా నుండెను. ఆఋషికల్పుఁడు రాజకీయవేత్తగాఁ బరిణమించుట కితఁడు కారణభూతమౌట ప్రశస్తము. ఈవిధముగా కందనునకుఁ బ్రజాసేవాసక్తి తండ్రినుండియే లభ్యపడెను.

కందర్ జీవితమునను ఇరువదినాల్గవయేడు విషమావస్థయయ్యెను. ఆక్సుఫర్డున విద్యనభ్యసించి, ఆయేట నితఁడు ఐ. సి. యస్. పరీక్షలోఁ గృతార్థుఁడయ్యెను. కాని ప్రేమోదంత మొకటి నిష్కరుణముగాఁ బరిణమించుటచే, స్వార్థప్రేమ పరార్థముగాఁ బుటముతీఱి యితనిజీవితమును వేఱుమార్గముం ద్రొక్కించెను. కందర్ ఉద్యోగము వదలుకొనెను. నేటాలులో స్థిరపడిపోవుట కిచ్చగింపక స్వదేశమునకువచ్చెను. తనతిల్లాయడి గ్రామమునే చేరుకొని చుట్టుపట్లజనులజీవితమును నిర్మలము, ఉన్నతము, ఫలవంతము సేయవలెనని సంకల్పించెను. అతఁడీప్రాంతములకు వచ్చునప్పటికి, ట్రాంక్విబారునకు రైలుపడుట గూడ తటస్థించెను. తనవంశమువారిలో కరియర్ ఒక్కఁడే మిగిలియుండెనని అతఁ డెఱింగికొనెను. కరియర్ వృత్తాంత మేమన, డేనిషుప్రభుత్వముమాఱి బ్రిటిషుప్రభుత్వ మేర్పడుటతో, కరియర్ తండ్రికిఁ బ్రతిష్ఠయు, పలుకుబడియు తీసి

కట్లాయెను. ఆ స్త్రీయు క్షీణించెను. చివరకు చనిపోవునప్పటికి కరియనునకు కొన్ని యెకరముల యిసుకదిబ్బలుమాత్రమే మిగిలెను.

కరియన్ నిర్వాహకమునకు రాగానే, ఆమూఁడుయెకరముల యిసుకదిబ్బలను అమ్మివేసి, మాయవరం ట్రాంక్విబారు రైలువేయుసందర్భమున మట్టిపని మక్తాకుఁ దీసికొనెను. పని నితఁడు నమ్మకముతోఁ జేసెనుగాని, తేనెతుట్టెకు కంతిరీగలవలె ముసరుకొన్న ఉద్యోగస్థులను సంతృప్తిపఱుపఁజాలకపోయెను. అందువలన నాపని ఊడిపోయెను.

కరియన్ ధైర్యము విడనాడలేదు. తిల్లాయడిలోఁ దన కులదేవత బృహన్నాయకి ముందును, ఒలుగుమంగళములో మరియమ్మన్ ముందును, రైలువారినుండియే తిరిగి తనడబ్బునెల్లైన రాఁబట్టుకొందునని శపథముసేసెను. రైలును రాత్రి పూటనాపి నాలుగుసొమ్ములుదోఁచికొని నాలుగుపెట్టెలు పాడుచేయగలమాత్రపు అల్లరిమూఁక అతనివెంట లేకపోలేదు. కాని యీకాలములోఁగూడ నట్టికృత్యములు జరుపుట కతనికే సాహసముచాలలేదు. చివరకు కరియన్ అక్కూరుస్టేషనులో చెక్కవాల్వువాఁడుగాఁ గుదురుకొనెను. సామానులుమోయుట, తూచుటగూడ యితనిదే. ఇది కేవలము నీచమని మొదటమొదట కరియన్ భీష్మించెను. పినతండ్రివలెనే తాను గూడ నేటాలునకుఁ బాఱిపోవలెననిగూడ తలఁచెను. కాని చేతికబ్బినది వదలుకొనుట మంచిదిగాదని యెంతనీచమైనను

ఆపనిలోనే ప్రవేశించెను. దీనిలోఁగూడ నవకాశములుండవా యని అతనియాశ. తగినట్లే యెవ రేమాత్రము పెట్టిబట్టుకొని వచ్చినను కరియర్ తూకమువేసి, పావుసొమ్ము రాబట్టుకొనుచుండెను. తూకమువేయుటలో కరియర్ చాలా నేర్పరి. రైలెక్కవచ్చిన గ్రామస్థులు ఆపెద్దదిమ్మెత్రాసును చూచుటకే భయపడువారు.

కందర్ కరియర్‌తో సుహృద్భావముగలిగి మెలంగవలెననియే కోరెను. దేశోద్ధరణ కితఁడును ఉపయోగపడఁగలఁడని కందర్ నమ్మకము. కాని కరియర్ యేమాత్రము సుముఖత చూపలేదు. తాను నీచవృత్తినుండుటయు, కందర్ ఐశ్వర్యవంతుఁడగుటయు నాతనిచిత్తము నుడికింపఁజేసెను. ఎట్లైనను దాయాదిబుద్ధిగదా! కందర్‌మాత్ర మవకాశముదొరకినప్పుడెల్ల నతనిపైఁదనప్రేమను బ్రకటించుచుండెను. తనసర్వస్వము నాతనితోఁ బంచుకొన నిచ్ఛగించెను. కాని యిర్వురు సమాధానపడుటకు కరియర్ పేదఱికమును గర్వమును తీఱనిఅంతరాయములుగా నుండెను.

ఈదినంమాత్రము కరియర్ ఐదురూపాయలసంపద వలనఁ బొంగిపోయినవాఁడై కందర్‌నెడ సౌమనస్యముం జూపెను. కందర్ చేయి నందుకొని "కందా మనమిద్దఱ మిఁక నొకటే. ఇదుగో శుభవేళ, కొంచెము కల్లుచవి చూడుము. తరువాత నీపెడవాదము లెక్కడనుండునో నేఁజూచెదగా. అపుడు మనమిద్దఱమును అన్నదమ్ములముగా నుండవచ్చును."

కందన్ ముఖమున హాసము వికసిల్లెను. అం దవజ్ఞ యించుకయు లేదు. పూర్ణమైనశాంతి,సుహృద్భావమే తోఁచెను. మాటలు కలహకారణమగునేమోనని యితఁడు పెదవి విప్ప లేదు.

కరియన్ చేతిరూపాయలు కల్లంగడికిఁ గాంతిదెచ్చెను. అందఱికిఁ దనడబ్బుతోఁ గల్లుపోయవలసినదని కరియన్ ఆజ్ఞాపించెను. ఒక్కగంటసేపు కోలాహలము ప్రబలెను.

కందన్ మాత్రము భోజనమునకు వేళయైనదనియు ట్రాంక్వెబారునుండి నెం 13 రు రైలు రాకకు సిద్ధపడవలసిన దనియు కరియనును హెచ్చరించెను.

చివరకు కందన్ కరియను లొకరినొకరు కౌఁగిలించుకొని వీడ్కొనిరి.

కందన్ పోగానే, అంగడిలో మఱింతకోలాహలమయ్యెను. కరియన్ డబ్బుతో నొక్కొక్క డెంతెంతఁ ద్రాఁగినది వారి పాటలు, కేకలు,చప్పట్లు చాటింపువేయుచుండెను. ఆ రాత్రియే, యేమేమో చేయవలయునని కాశేరీ గట్టిగా హెచ్చరించుచుండెను. నందన్, మూఖన్, ఇరుల్లన్, కరుప్పన్, ఇరుల్లప్పన్‌లు సరే యని చప్పట్లు జఱచుచుండిరి.

ఈసేద్యగాండ్రకు నయిదురూపాయలకల్లు దొరకిన దనఁగా నెంతటియదృష్టమో! వారికోలాహలమునఁ గల్లంగడి ఇంద్రసభను మించియుండెను.



# నాల్గవ ప్రకరణము.

## ఎగ్మూరుస్టేషను

### 1

రంగస్వామిమాటప్రకారము ఎగ్మూరుస్టేషనునకు మంచి టాక్సీలో నేతెంచెను. ఉదయమే ట్రాంక్వెబారునకు మొదటి తరగతి టిక్కెటుగొని బండిని రిజర్వుచేసికొనెను. కాని ఆ చీటీలోc గేవలము "ఆర్. యస్. రంగస్వామి" అనిమాత్రమే వ్రాసి, తన ఐ. సి. యస్. హోదాను మఱుఁగువఱచెను. రాజేశ్వరీ సేవాలోలుఁడై ఈప్రయాణమున కతఁ డొంటరిగా, అజ్ఞాతముగా బయలుదేరెను.

రంగఁడు రూపరి కాదుగాని ధిషణాప్రభావంబున నాతని ముఖమున నొకవర్చస్సు గలదు. రంగు నలుపైనను, ఇంచుక పొట్టియైనను అతనితో సంభాషించువారికవి గోచరముగాకుండునట్లు బుద్ధిచాతుర్యము ప్రయోజనకారియగును. ఆంగ్లదేశమున నుండినపు డీతఁడు సోషలిస్టుసిద్ధాంతములను బాగుగా బరిశీలించినవాఁడై, బహిరంగసభలం దద్భుతముగా నుపన్యసింపుచుఁ బలువురహృదయముల సంచలింపఁజేసెను. అట్లాకర్షింపఁబడిన కన్యయే రాజేశ్వరి. రంగఁడు దారిద్ర్యగాథను చక్కఁగా

నెఱిఁగినవాఁడు. మంచివక్త. మిణుగురుబురుఁగులకు చివరఁ నుండువెలుఁగువలె, వక్తలకు జిహ్వాగ్రమున మహత్తుగలదు. రంగని వాక్కులో రవగలదు. ఎదుటివారిని మోహింపఁజేయున దదియే.

రంగస్వామి స్టేషనుమెట్లదగ్గఱ దిగఁగానే, చింపిరిగుడ్డలతో పోర్టర్లగుంపు ప్రత్యక్షమాయెను. ఇతనికి బరువులుగూడ అధికముగానేయుండెను. పూర్వము తాను చదువుకొనుదినములలో నిదేస్టేషనునకుఁ గట్టుగుడ్డతో ప్రయాణమునకు సిద్ధమగువాఁడు. అప్పు డతనికున్న దంతయే. మూడవతరగతి ప్రయాణీకుల శాల పూర్వదృశ్యముల నతనికి స్మరణకుఁదెచ్చెను. కాని ఇప్పు డారంగమునుండి రంగస్వామిముఖము ద్రిప్పుకొనియెను.

పోర్టర్లబాధమాత్రము అనివార్యము. వారిసంఘముతరఫున వాదించుటకుఁ దెలివిగలయీతఁడు, వారితోనే తన సామానుకూలిని సరిగా కుదుర్చుకొనగల చాకచక్యముఁ గలవాఁడుగాఁడు. వీరితో జరుపవలసిన రాయబారమునకు రంగస్వామి తెలివి పనికిరాదు. చుట్టును, పోర్టర్లుమూఁగిరి. ఒక్కొక్కఁడు ఒక్కొక్కపెట్టెను తలకెక్కించుకొనుచుండెను. ఎంత చిన్న వస్తువునకును ఒక్కొక్కపోర్టరు వేఱుగా తయారయ్యెను. ఇఁక వారిలో వారికి తగవులు, గలభా 'అయ్యవారు నాకు సంజ్ఞ చేసినాఁ' డని యొకఁడు, 'ముందఱవారినడిగినది నే' నని యింకొకఁడు, 'నన్ను పేరుపెట్టి పిలిచినాఁ' డని యింకొకఁడు

పరిపరివిధములఁ దమతమహక్కులను వారు స్థిరీకరింపఁజూచుచుండిరి. అందఱును అష్టదరిద్రులే. ఒక్కరిముఖమునను జీవకళ లేదు.

రంగన్ వీరి యల్లరినాపుట సాధ్యముగాదని తెలిసికొని, అందఱికిని బరువులుమోయుట కవకాశమిచ్చెను. పోనీ, మఱొక్కరూపాయిగదా యీదరిద్రులకు!

పోర్టర్లు చాలా తెలివితేటలుగలవాండ్రు. రైలుస్టేషను వారికి పాఠశాల. అనుభవమే వారికి గుణపాఠము. మనుష్యుల యౌదార్యము, కృత్రిమము, దాంభికము, దర్పము, స్టేషనులో సుప్రత్యక్షమగుచుండును. పోర్టర్ల కీయనుభవము పుట్టినప్పటినుండి గలదు. ఒకమనిషి రాగానే అతఁడేమాత్రపువాఁడో, వాని సామానును తూచుయంత్రముకన్నఁ జక్కఁగా తూనికవేయఁగలరు. ప్రొద్దుననే రంగస్వామిపేరు తరగతి, వీరుకన్గొని, పుట్టుపూర్వోత్తరములు చాలవఱకు నిర్దేశించుకొనిరి. ఐ. సి. యస్. అనిమాత్రము వారికిఁ దెలియదు. తెలిసినచో ఆవైఖరియే వేఱు. ఎట్లైననేమి రంగస్వామిసామాను జాగ్రత్తగా మొదటి తరగతిపెట్టెలోఁ జేర్పఁబడెను. రంగన్‌మాత్ర మింకను బండిఁ జేరలేదు.

## 2

రంగస్వామి కొకచిక్కుదోచెను. తనపెట్టెలోనే రాజేశ్వరికిని స్థానము కుదురవలసియుండెను. ఉదయమున ఐ. సి. యస్.

అక్షరము లుపయోగింపకపోతినిగదా యని చింతించెను. ఇపుడుపోయి, దీనికొఱకుగా, తాను ఐ. సి. యస్. అని చెప్పుకొనుట తనకుఁ దనసాటిఉద్యోగులకు నవమానకరము. కావున అజ్ఞాతవేషముననే, అసిస్టాంటుకలెక్టరు టిక్కెటుకలెక్టరును సమీపించెను. అతఁడు ప్లాటుఫారంగేటునొద్ద రైల్వేఉద్యోగుల కుండవలసినవిరసత్వమంతయు నుట్టిపడునట్లు నిల్చియుండెను.

"నేను స్టేషనుమాస్టరును చూడవచ్చునా?" యని రంగస్వామి అడిగెను.

"వీలుగాదు." కస్సుమని జవాబువచ్చెను.

"వీలుగాదా?"

"కాదు. చెప్పుచున్నానుగాదూ. అతఁడు చాలాపనిగానున్నాఁడు."

"నేను లోపలికిఁ బోవచ్చునా?"

"వాహ్, ప్లాటుఫారం టిక్కెటుఉంటే—అదుగో అక్కడ అణావేసి లాగి టిక్కెటుతీసికొని రండి" అని యంత్రమువైపు వ్రేలుజూపెను. టిక్కెటుకలెక్టరు అసిస్టాంటుకలెక్టరునకు టిక్కెటుగొనువిధమును బోధించుట ! రంగఁ జేబుదడవుకొనెను. అణారూకలేదు. పావలారూకయుండెను. "కలెక్టగారు, అణాలేదు. పావలాఉన్నది. పుచ్చుకొండి" అనుచు, దానిని టిక్కెటుకలెక్టరు చేతిలోనికి జార్చెను.

టిక్కెటుకలెక్టరు ఇటునటుచూచి దానిని గ్రహించెను. ఆ చూపులోనున్నది దుర్భరమైనగాథ. పాపము, టిక్కెటుకలెక్టర్లది పాడుజీవనము. గంటకు నలువదిమైళ్లు జగద్వ్యాహారము సలుపుధన్యుల కీరు దాసులు. దాస్యమువలన దారిద్ర్యము. దారిద్ర్యమువలన నీచత.

టిక్కెటుకలెక్టరు వెంటనే సౌమ్యుఁడాయెను. "అయ్యా రండి లోపలికి. మీదాసుఁడను. స్టేషనుమాస్టరు బడామనిషి. తేలికగా నతనిచూడ వలనుపడదు. నేను చేయఁదగినసహాయముఁజేసెదను. కలెక్టరు చేయలేనిది కరణముసేయఁగలఁ డను సామెత మీ రెఱుఁగనిదా!"

"మంచిదండీ, మీ పేరేమి? మీకు జీతమెంత?"

"నా పేరు రంగస్వామి; అందఱు నన్ను రంగన్ అనెదరు. జీతము ఇరువదియైదురూపాయలండీ. నేను బహుకుటుంబీకుఁడను. ఐదుగురుకుమార్తెలు. ముగ్గురుకొడుకులు. ఇక్కడ చావుపని మీకు తెలియనిదండీ."

"అవునవును. నాకు మీరు కొంచెముసహాయముజేయవలె. నేను బోటుమెయిలులో ట్రాంక్విబారునకు మొదటితరగతి టిక్కెటుఁ బుచ్చుకొన్నాను."

"ట్రాంక్విబారునకు మొదటితరగతిటిక్కెట్టా? అయితే ప్లాటుఫారంటిక్కెటు అక్కఱలేదండి. నేను తప్పుజేసితిని. క్షమిం—"

"ఫరవాలేదు. నాల్గణాలకేమి లెండి. అదే పెట్టెలో నా కింకొకమనిషికిఁగూడ చోటు కావలెను. నాతో నొకస్త్రీ ప్రయాణముసేయుచున్నది. ఆమెకునుఁ జోటుగావలె. మీరా మాత్రము సహాయముచేసిపెట్టెదరా?"

"మీరు తొందరగాగూడ వచ్చినారు. తప్పకుండా నాకు వీలైనసహాయముచేసెదను. ఐదునిమిషములలో మీకు తెలిపెదను."

రంగన్ టిక్కెటుకలెక్టరు చేతిలోనికి మఱొక్క రూపాయి జార్చెను. వెంటనే అతఁడు డేఁగవలెఁ బరుగెత్తెను. బోటు మెయిలునకు ప్రయాణీకులసమ్మర్ద మెప్పుడు నెక్కువగానుండును. ఆదినం, రంగన్ నిశ్చయించుకొనిన మొదటితరగతి బండిలో ఖాళీలు లేకపోయెను. కాని ఒకచెట్టి, షాహుకారు ఆదేబండిలోఁ జోటుతీసికొనియుండెను. అతని కుద్వాసనఁ జేయుటకు రైల్వేదొరలు నిశ్చయించిరి. షాహుకార్లు డబ్బుగాఁ బరిణమించువిషయములందుదప్ప, ఆత్మగౌరవమనిగాని నా హక్కు అనిగాని భేషజము పెట్టుకొనరు. వీటి కెంతవఱకైనను వారు సర్దుకొందురు. చెట్టియారు తనకు మూడుదేశములలో ముప్పదిజిల్లాలలో రావలసినవడ్డీని లెక్కవేసికొనుచు ప్రయాణపు టసౌకర్యములను లెక్కసేయలేదు. దస్తావేజు దావాల విషయమున షాహుకార్లు సాహసముచూపుదురేగాని, మిగిలిన అన్నివిషయములలోను చాలా అణకువ. వడ్డీవ్యాపారంవలన నొంటిలో రక్తము చచ్చిపోవును. మాంసముపెరిగి గుండె

ణచివేయును. షాహుకారికి తేలికగా ధనమువచ్చును. కాని తేలికగా ధైర్యముచచ్చును. ఉపాధినిల్చును. గుణము ఖర్చగును.

చెట్టియారు రంగస్వామికన్న నరగంటముందుగావచ్చి యుండెను. ఐనను రైల్వే ఉద్యోగులుపోయి, చెట్టిని లేవఁగొట్టి, ఎవరో దొర ఆడమనిషితోఁగూడ నా పెట్టెలోఁ బ్రయాణముసేయనున్నాఁడనియు, చెట్టిగారు ఆబండిలోఁ బ్రయాణముసేయ వీలులేదనియు, వలయుచో బోటుమెయిలులో రెండవతరగతిబండిలోఁ బోవచ్చుననియు, లేదా, తర్వాత మఱొకగంటలోఁ బోనున్న రైలులో మొదటితరగతిఁ బోవచ్చుననియుఁ జెప్పిరి. చెట్టిగా రాక్షేపింపలేదు. సరే కానిమ్మనిరి. "అయ్యా, మొదటితరగతియైనను, రెండవతరగతియైన నొకటే. నేను కేవలము ప్రతిష్ఠకోసరమే మొదటితరగతిలోఁ బోవుట. బోటుమెయిలులో నేమూల నాకుఁ జోటిచ్చిననుఁ జాలును. రేపు నామనుమరాలిపెండ్లి. తరువాత బండిలోఁ బోయినచో ముహూర్తవేళ దాటిపోవును. కావున నాకీరైలులోనే యెక్కడనో యొకచోట సర్దండి, దయయుంటుంది."

## 3

తానిచ్చినరూపాయకుఁ గార్యము ఫలించినదిగదా! యని రంగఁడు సంతోషించెను. రాజేశ్వరిబాయికొఱ కెదురు సూచుచు మెట్లబడి నిల్చుకొని మెడను ముందుకువంచి

చూడ్కులనిగిడ్చెను. అప్పుడే తాను మొదటితరగతి బండిలో రాజేశ్వరిప్రక్కన గంటకు నలువదిమైళ్లవేగముతోఁ బ్రయాణముసేయుచున్న ట్లాతనిహృదయము మురియుచుండెను. స్టేషనుముందు బుర్రుమన్న కారెల్ల వాని కాళ్ళఁగొల్పుచుండు. నిమిషములు పర్వెత్తుచుండెను. కాని రాజేశ్వరిరాలేదు. ఇఁకఁ బదునేనునిమిషములే మిగిలియున్నది. రాజీ మాటఁదప్పునా? అట్టి మనిషిగాదు.

చివరకు మూడవతరగతి ప్రయాణీకులశాలవైపున మెట్ల దగ్గఱ నాతనికి రాజేశ్వరిస్వరము వినఁబడెను. అచ్చట జనము క్రిక్కిఱిసి, కందకములో యుద్ధముసేయుచున్నంత భీభత్సముగా నుండెను. చప్పున నతఁ డక్కడికిఁబోయెను.

అవును, రాజేశ్వరియే.

రాజేశ్వరి బస్సులో బయలుదేరెను. మధ్య రాయపేట ఆసుపత్రియొద్ద దానిటైరు పగిలెను. మెల్లగా మనుష్యులవెంటఁ బడి లాగుకొనివచ్చి, బండినింపుకొని బస్సువాఁడు అమితమైన ఆలస్యముచేసెను. స్టేషనుదగ్గఱ దిగఁగానే పోర్టర్లు గుంపుగా చుట్టుముట్టి, ఆవిడదగ్గఱనున్న దొక్కచిన్నసంచి, పడకయై నప్పటికిని వాటినిఁబట్టుకొని, నేను ముందంటే నేను ముందని తగవులాడుకొనుచుండిరి. ఇందులో నెవరు ముందుసామాను ముట్టుకొన్నది జెనివాలో ప్రపంచన్యాయస్థానముగూడ తీర్మానించలేదు సుమండీ. ఆకలిఁగొన్న వారివేగ మంతయు నొకచో ఎచ్చుతక్కువలుండవు.

రాజీనిఁ జూడఁగానే, రంగేశ సంతోషభరితుఁడాయెను "అట్లుగాదు రాజీ, అది మూడవతరగతివారిదారి. ఈ దేశములో నరకస్వరూపము. మనది మొదటితరగతి. ఇదిగో త్రోవ. ఇద్దఱికి మొదటితరగతిబండి ఖరారు చేసినాను."

అసిస్టాంటుకలెక్ట రొక్కమాఱు తీక్ష్ణముగా పోర్టర్ల వైపు దిరిగి, "పొండి, వెధవల్లారా, ఒకటేగుంపు. ఒరే, నీవు దీసుకో" అని అప్పుడేవచ్చినిల్చిన దిట్టమైనపోర్టరున కొకనికి సామాను నొప్పఁజెప్పెను.

"వలదు రంగా, నాసామాను నేఁబట్టుకొని రాఁగలను ఇదెంతబరువు! మఱి నేను మూఁడవతరగతిలోనేగాని యెక్కను." ఆమె గొంతులో దృఢసంకల్పముండెను. రంగేశ నిర్ఘాంత పోయెను. "అదేమిటి రాజీ, ఇది ఇంగ్లాండు అనుకొంటివా ? ఇచ్చట మూఁడవతరగతిబండి నరకం, ఆఁడమ్మి, పెంట, గలీజు తలఁచుకొనిననే జలదరించును. అప్పుడు స్టీమరులో మొదటి తరగతి నిండుకు నీసామానుతో వైభవముగా -రాణిలాగునఁ బ్రయాణము చేసినదానవు. ఇదేమిటి! మతిపోయినదా? ఊపిరి ఆడ దక్కడ. ఇద్దఱికొక్కే మొదటితరగతిబండి నే నేర్పాటుజేసి తిని. కనిపెట్టుకొనియున్నది మనకొఱకు"

రంగేశ బ్రతిమాలుకొని ప్రయోజనము లేకపోయెను. "నేను మూఁడవతరగతిలోనే ప్రయాణము చేసెదను. ఇది తప్పదు. నీవు నావెంటరావలెననునట్లయితే, వెంటనేపోయి యిద్దఱికి మూఁడవతరగతిటిక్కెట్లు రెండు పట్టుకొనిరా."

రాజేశ్వరి నిశ్చలముగా మబ్బు సందులగుండా ప్రకాశించుశశివలె భాసిల్లుచుండెను.

## 4

కాని మూఁడవతరగతి టిక్కెట్టుకొనుట యనఁగా సామాన్యమైనపనిగాదు. అదొకసాహసకృత్యము. ఏకంపెనీయైనను దానిని సినిమాదీసినచో చాలా లాభపడఁగలరు. రంగస్వామి కీకష్టము తెలియును. పూర్వము జనములో దూఱిపోయి టిక్కెట్లుకొనుకొనివచ్చినకుఱ్ఱవాఁడే.

మూఁడవతరగతి టిక్కెట్లిచ్చుకిటికీకి ముందుగా నొక యినుపకమ్ములబోను ఉన్నది. దీనికి నాలుగుపత్కములు. దీని గుండా పోయిననేగాని టిక్కెటు లభ్యపడదు.

ఇప్పటికే అచ్చట జనము కిటకిటమనియుండెను. ఇక వారియొత్తిడి, తిట్లు, అఱపులు—వాటికి మితిలేదు. ముందుకు నెట్టుకొనిపోయిననేగాని స్వర్గమునకు టిక్కెట్టుదొరకదు. కిటికీకి ఆవలివైపున టిక్కెట్లిచ్చువాఁడు నిర్లక్ష్యముగాఁ గూర్చొని యుండెను. అతఁడు టిక్కెట్లకు ప్రభువు. అవి దొరకుట అతని అనుగ్రహము. అతనికిముందు అణాలు, బేడలు, కానీలు, సరే రూపాయిలు పెద్దకుప్పబడియుండెను. టిక్కెట్లిచ్చుమనిషి బాగుగా డెబ్బదియేండ్లు చెల్లినవాఁడు. మొగముమీద నామము చెమటకు కరఁగి కొంచెముకొంచెము కన్పడుచుండెను. చెమట

నదీప్రవాహామువలె నిరంతరము కారుచుండుటచే నాతఁడు దానిని తుడుచుకొనుట మానివేసెను. ఎదురుగా త్రొక్కిడి పడుచున్న జనముపై నాతనికి నిరసనభావము. అతనిగోడవ లత నివి. కుటుంబీకుఁడు. మొనమొన్న నే కూతురునకుఁ దలచెడెను. సెలవుకోరుకొనఁగా, నింతపెద్దస్టేషనునకుఁ దగినభర్తీమనిషి లేఁడని సెలవీయలేదు. ముందురోజున బోటుమెయిలుటిక్కెట్లు అమ్ముటలోనే ఒక్కరూపాయ ఎనిమిదిఅణాల మూడుదమ్మిడీలు మోసమువచ్చెను. ఆనష్ట మాతని నింకను వేధించుచుండెను. తనసంసారమును మూడురోజులు వెళ్ళఁబుచ్చఁగలమొత్తము!

బోనులో గుంపు పెద్దదై పోయెను. సమ్మర్దమున కది తిరుగుటఁగూడ మానెను. టిక్కెట్లిచ్చుముసలాయన లోపల నెవరితోనో మాటలుపెట్టుకొని కూర్చొనెను. ఎన్నాళ్ళకో తన యూరిమనిషి యొకఁడు వానికిఁ దటస్థించెను. చూడుము నా ప్రభావమనునట్లుగా నాపూర్వపరిచితుఁ డిప్పుఁడు టిక్కెట్లగది లోనే ప్రవేశించి టిక్కెట్టు గైకొనుచుండెను. టిక్కెట్లిచ్చియిచ్చి విసుఁగెత్తిపోయియున్న గుమస్తాయును వానితోనేవేవో మాట్లాడ నారంభించెను. ఊరిలో వర్షము, పంటలు, ఎక్కడెక్కడివారి క్షేమం, మఱెన్నో గృహచ్ఛిద్రములు— వారిసంభాషణకు తెఱిపిలేకుండెను.

ఇఁక రైలుకదలుటకై దునిమిషములుండెను. మొదటిగంటవాగెను. ఆబోనులోనున్న జనమున కది చావుగంటయే! టిక్కెట్లను మఱి వారియాశలు పట్టరానివయ్యెను. మెల్లగా

టికెట్లద్వార, తాంబూలమునమలుచు, పండ్లమధ్యనిఱుకు కొనిన వక్కపలుకులను కుట్టుకొనుచు, మిత్రునికొక్కొక మాట విసరుచుండెను.

రంగన్ అప్పుడే బోసులోఁ బ్రవేశించెను. అతనిగోడ వకు, ఈ ఆలస్యమునకుఁ జీకాకుగానుండెను. "ఏమి, టికెట్లిచ్చేమనిమి నిద్రపోవుచున్నాఁడా?"

"అబ్బో, దొరగారువచ్చినారా? ఇప్పుడే లండనునుండి దిగి? ఇంతవఱ కేమిసేయుచుండినారు? గంటకుతక్కువగా నెడ తెంపి లేక టికెట్లిచ్చుచున్నాను. అవును మాకు నిద్ర!"

తత్క్షణమేగాకపోయినను రంగన్‌మాటలకు ఫలితము లేకపోలేదు. గుమస్తా టికెట్లనులాగి టకటక తేదిగొట్టుట ప్రారంభించెను. రంగన్‌హృదయమునకుఁ గొంచె మూఱట గల్గెను.

కాని బోసులో జన మత్యధికమగుటవలన నది తిరుగ లేదు. చివరమనుష్యులు బయటికివచ్చి దాని నాడనిచ్చిన వారై నఁగారు. ఒక్కొక్కఁడు టికెటుకొనుక్కొని, కమ్మ లెక్క దుమికిపోవుటయే యుపాయముగా తలంచి, అంతసాహా సముసేయుచుండెను. రంగస్వామివంతువచ్చెను. అతని శ్రమ దైవమునకెఱుక. ఒక్కమాఱు తనకులదైవము ఏడుకొండల వానిఁదలంచుకొని కమ్మలెక్కి గెంతెను. మణికట్టుకొంచెము

బడెను. కాలిబొటనవ్రేలు కొంచెము నలిగెను. మెడ ఒక వైపునొప్పిపట్టుకొనెను. అంతకుమించి ప్రమాదము జరుగలేదు.

రాజేశ్వరి కొంచెముదూరముగా నాలోచనలో మునింగి నిల్చుకొనియుండెను. రంగడు ఆవిడదగ్గఱకుఁ బరుగెత్తి "రాజీ, చూడు మీశోభ. ఇంకెప్పటికైన స్వరాజ్యము నడుగఁగలవా? ఏసభ్య దేశముననైన నిట్టిదుండునా? రైళ్లు కిన్నేండ్లలవాటుపడి నను, వరుసగా, నొకరివెంబడి నొకరుపోయి టిక్కెట్లుతెచ్చు కొను తెలివి మనవారికిలేదే! ఎందుకు మనము! ఏమైననేమి, ఆ టిక్కెట్లిచ్చుగుమస్తా యేమాత్రము బాధ్యతగలమనిషిగా లేఁడు. తంజావూరులో దిగఁగానే ఏజెంటుతో రిపోర్టుచేయ వలెను. నా కీఅనుభవ మీరాత్రికలుగు టొకందుకు మంచిదే. కాని యేమిశ్రమ!" అని యొకేధోరణిగా మాట్లాడెను. రాజే శ్వరి అడ్డమువచ్చి "సరే, ముందు రైలు కందుకొనెదము. తరు వాత వేదాంతము, ప్రతిక్రియ లాలోచించుటయు. కావలసి నంతసేపు మాట్లాడవచ్చు. రండి."

బోనుకుచేరువనే ఒకపోలీసువాఁడు కాకీచొక్కా, ఎర్ర టోపీతో నిర్లక్ష్యముగా, కాఱాకిల్లీ నములుచు, పచారు సేయుచు, ఎప్పుడైన సుందరు లావంకఁబోయినపుడు వారిపై దృష్టినెఱపుచుండెను. రంగడు వానిని సమీపించి, టిక్కెట్ల అవస్థ చెప్పెను.

"అవునయ్యా, ఈజనమును బారులుతీర్చుట మాపని గాదు. ఈకష్టము ప్రతినిత్యముండునదే. ఎవ్వఁడావిషయ

మనుకోఁడే! మీ రీపట్నమునకుఁ గ్రొత్తవారుగా నున్నారు. దొంగలనుఁబట్టుకొనుమని నాకుత్తరువుగాని, వీరినందఱిని బారులుదీర్చుమనిగాదు.” అని పోలీసువాఁడు జవాబిచ్చెను.

“రాజీ, చూచినావా? ఈదేశస్థితి యంతయు మాఱవలెను. చిన్నచిన్న సర్దుబాట్లవలనఁ బ్రయోజనములేదు. ఏ ముసోలినియో, నెపోలియనో రావలసినదే దీనిని బాగుపఱచుటకు! ఉపవాసములవలన సీజాడ్యము కుదురదు. శస్త్రపెట్టవలసినదే! దయాదాక్షిణ్యము పనికిరాదు. సంస్కరణములతోఁ గాలమువ్యర్థపుచ్చరాదు. ఒక్కమారు మొదలంట ఛేదముచేసి శుభ్రపఱుపవలసినదే!”

“సరే, సరే. ఇక్కడగాదు ఉపన్యాసము. తొందరగా పద. రైలెక్కుటకు నిమిషముంది. రైలే అందితే, తర్వాత సావకాశముగా మాట్లాడుకొనవచ్చును.”

రంగణ జనము నిరువంకల నెట్టుకొనుచు, నితరులకష్టములంగూర్చి తన ఉపన్యాసము నంతలోనే మఱచిపోయి, పెద్దలను, పిల్లలను మోచేతితోఁ బొడుచుచు దారిచేసెను. రాజేశ్వరి మెల్లఁగా పడక, సంచి, తానే మోసికొనుచు వానివెంట నడిచెను.

---

# అయిదవ ప్రకరణము.

## బోటుమెయిలు

రంగస్వామి టిక్కెట్లకై అవస్థపడుచున్న సమయమున, సిలోనుబోటుమెయిలు మొదటిప్లాటుఫారమునకువచ్చి నిలిచియుండెను. దానియొప్పుం దిలకించిన, వల్లభురాకకై కేళిగృహమున నెదురుసూచు రాణివలె నుండెను. ఇంజను యేబదిగజములు ముందునకుఁబోయి నీళ్లుత్రాగుచు, నరణ్యమృగమువలె మధ్యమధ్య గుఱ్ఱపెట్టుచు, నక్షత్రఖచితమగు నాకాశమునకుఁ దనగర్భమునను నట్టిసంపదగలదని తెలుపుటకుఁగాఁబోలు నిప్పురవల నప్పుడప్పు డెగఁజిమ్ముచుండెను.

సిలోనుబోటుమెయిలు చాలాసుందరమైనది. తిరుచినాపల్లిలోనున్న రైల్వేశాఖాది దేవతల కత్యంతము ప్రియమైనది. ఆ రెండువేలమైళ్ల యినుపదారి పైనడచు నితరబండ్లయెడ వారికి నిర్లక్ష్యము. కాని దీనిపై మాత్రము మమకారము. ఆనాఁడు బోటుమెయిలున కొకక్రొత్తకళవచ్చియుండెను. మొదటి రెండుతరగతులబండ్లు క్రొత్తమాదిరి నూత్నముగా తయారైనవి. వాటికి రంగుగూడ మాయలేదు. అట్టి గొప్ప సందర్భములలో మూడవతరగతిబండ్లకుఁగూడ నించుకరంగుఁ

బట్టించెదరు. ఏమైననేమి, ఆనాటిబోటుమెయిలునకు రాణికళ పూర్ణముగానుండెను. రంగస్వామికి టిక్కెట్లసంక్షోభము లేకుండినట్లయిన నాతఁడు దీనిలావణ్యమును వర్ణించి, బ్రిటిషు రాజ్యమున నెంతమహత్తుగలదో నిరూపించియుండును.

ఆదినము రంగూనుస్టీమరు మదరాసు చేరినరోజగుటచే సుమారు రెండువేలమంది పిల్లలు పెద్దలు స్త్రీలు పురుషులు తమతమయిండ్లకుఁబోవు నాతురతతో బోటుమెయిలుకు వచ్చి పడిరి. కావున మామూలుకన్న నిబ్బడి మనుష్యభారమును బండి లాగవలసినదయ్యెను. ప్రతిబండిలోను పెట్టెలు, మూటలు, పిల్లలు, స్త్రీలు. మెదలుటకు సందులేదు. ఒకటే బందెలదొడ్డి.

రైలు కదలుట కింక నైదునిమిషములుండెను. స్టేషను మాస్టరు తనయేకాంతవాసమును వీడి ప్లాటుఫారమున కేతెంచెను. దర్జాయైనమనిషి. నోటిలో సిగరెటు గప్‌గప్ మనుచుండెను. ప్రయాణీకులమధ్య కతఁడువచ్చుటే ఒకగొప్ప. ఒక్కమారు మూడవతరగతిబండ్లవైపు చూచెను. ఈనల్లవారి గతి యింతే. అందఱు నొకేబండిలో నెక్కవలె. ఇంకొక గంటలో మఱొకరైలు పోవునుగదా. అది ఖాళీగాఁబోవలసినదే. దీనికి డ్రెక్కుడు ఇటువంటిమనుష్యులనుఁబెట్టుకొని దక్షిణదేశములోఁ బ్రయాణసౌకర్యము లొదఁగూర్చుమనిన నెట్లు? గొత్తెలలాగున నంద ఱొకటేగుంపుగా నొకేరైలు, ఒకే బండిలో నెక్కి, త్రొక్కి చిక్కులువడుట!

స్టేషనుమాస్టరు ప్లాటుఫారంమీాద నడచుట మనుష్యుల మధ్యకు దేవుఁడు దిగివచ్చినట్లే. రైల్వేఉద్యోగులందఱును భయభక్తులతో సందడి చప్పిడిలేకయుండిరి. ఎవరితోఁగూడ నతఁడొక్కమాట మాట్లాడలేదు. చివరకు పోలీసు ఛీఫ్ ఇన్‌స్పెక్టరు కనఁబడఁగా హెచ్చరించుకొనెను. "ఏమండోయి, అపూర్వం తమదర్శనము. ఈగుంపులో నేదోపనిమీాదఁగాని తాముండరు. నావలన నేమైన సాయముకూడునా?"

"అవునండీ. పోలీసుకమీాషనరు టెలిఫోనులో సందేశ మంపినాఁడు, ఈరైలులోఁ బోవుచున్నవారి నిర్వురిని గమ నించుమని."

రంగన్ టికెట్టుకుఁబోయి బోనులోఁజిక్కి తంటాలు పడుచున్నసమయమున ఎగ్మూరుస్టేషను రైల్వేపోలీసుగది కీ క్రింది టెలిఫోనువార్తవచ్చెను. "హాల్లో, ఇన్‌స్పెక్టరేనా, నేను మదరాసు పోలీసుకమీాషనరును. గుంటూరు అసిస్టాంటుకలెక్టరు ఆర్. యస్. రంగస్వామి బదలాయింపై తంజావూరునకుఁ బోవు చున్నాఁడు. అతనితోఁగూడ రాజేశ్వరిబాయి అనునావిడ ఈ దినం ఉదయమే మదరాసువచ్చియుండినది. ఇరువురిని గమ నించి వెంటఁబెట్టవలసినదని పైనుండి అవసరముగ నుత్తరువులు వచ్చినవి. వెంటనే స్పెషలు సి. ఐ. డి. వాని నొకనిఁ బంపించు చున్నాను. వాఁడెప్పుడువచ్చినను కష్టములేకుండుటకై ముందు గానే మీారు ఆయిర్వు రెక్కుడేబండిలో నెక్కునది గుర్తించ వలసినది."

చీఫ్ ఇన్‌స్పెక్టరు ఇంక నాలుగెలలలో పింఛనుపుచ్చు కొనును. తన ఆశలకు ఫలముగాంచినాఁడు. ఏదో గదిలోఁ గూర్చొనుటే అతనికి సుఖము. కాని పోలీసుకమీషనరంతటి వాఁడు సందేశమంపినాఁడుగదా యని బయటికివచ్చి ప్లాటు ఫారంమీద మెల్లగా సామానులకుఁ దట్టుకొనిపడకుండా నతఁడు వీరికై వెదకుచుండెను. చివరకు మొదటితరగతిబండిలో వీరిసామానుగుర్తుచిక్కెను. అక్కడ నిలుచుకొనియుండఁగానే స్టేషనుమాస్టరు పలుకరించెను. అంతటితోనే స్టేషనుమాస్టరు ఇన్‌స్పెక్టరునువదలిపెట్టి ఇంజను డ్రైవరుదగ్గఱకుఁబోయెను.

రంగన్ సామానులు మోసినపోర్టర్లను కూలిడబ్బులకై కనిపెట్టుకొనియుండిరి. "ఏడిరా మీమనిషి? ఇంతసామాను బండిలోకెక్కించి రాకుండఁడుగదా?" అని ఇన్‌స్పెక్టరు వారిని దర్పముతో నడిగెను. "అయ్యా, మాకండ్లతో వారిని మేము చూచినాము. సన్నగా పొడుగుగా మామూలుమనిషియేనండి. టిక్కెట్టుకలెక్టరు నడగండి. వివరము లేమైనజెప్పును." "ఛీ, సోమరిపోతులారా, అతఁడుగానుండఁడురా. గుంటూరు అసి స్టాంటుకలెక్టరయితే! మీరుచూచినమనిషి వారిజవానై యుం డును. ఇంకను బయట వారికోసరం కాచుకొనియున్నాఁడేమో. వినను, రైలుకదలుట కిఁక మూఁడునిమిషములేయున్నవి!"

పెద్దగడియారమువంకఁ జూచెను. సరిగా పింఛనుపుచ్చు కొనుసమయమునకు దురదృష్టమువల్లనే పొరబాటువచ్చి తనకుఁ గళంకమువచ్చునో యని అతని భయము.

ఎవ్వరును రాలేదు. కాని చివరనిమిషములో నొక యువకుఁడు ఛీఫ్ఇన్‌స్పెక్టరుదగ్గఱకుఁ దొందరతొందరగావచ్చి చెవిలో నిట్లు చెప్పెను. "అయ్యా, అంతయు సరిగనేయున్నది. భయంలేదు. వారు మూఁడవతరగతిబండిలోనున్నారు. తావు నకు వారు తంటాలుపడుచుండగా మెల్లఁగా నొకబండిలోని కెక్కించినాను. సామాను మొదటితరగతిబండిలో! మనుష్యులు మూఁడవతరగతిలో! విచిత్రమే! కాని ముస్ముందు విడఁదీయ వచ్చు నీసమస్య. రాజకీయము లెప్పుడును దుర్ఘటమే. బహు విచిత్రము! సెలవు, మీకు నన్ను జ్ఞప్తిలేదుగాఁబోలు. నాపేరు పొన్నన్. మీదగ్గఱనే, హెడ్‌కనిస్టేబుగా విల్లుపురములోఁ జేరితిని. అది ఆఱేండ్లక్రిందట. ఇపుడు పైకివచ్చినాను, సి. ఐ. డి. లోఁ జేరి. వందనములు సెలవు."

పొన్నన్ తలనాడించి, పసిపట్టినవేటకుక్కవలె చెంగున రంగన్ రాజేశ్వరులెక్కినబండివైపు పరువెత్తెను.

ఈచారుల చాకచక్యమునకు వృద్ధుఁడైనపోలీసు ఛీఫ్ ఇన్‌స్పెక్టరు ముగ్ధుఁడాయెను. తనకును ఎర్రటోపీగలదు, ముప్పదియేండ్లుగా చెమటకుతడిసి. కాని మొదటితరగతి మను ష్యులు మూఁడవతరగతిలో నెక్కినరహస్యమును తాను గుర్తిం చలేదు. తానీస్వగతమునుండి మేల్కొని, అపూర్వపుకనిస్టేబు నభినందించులోపలనే, బోటుమెయిలు కూఁతవేసి నక్షత్రమం డలమున మబ్బువలెఁ గదలిపోయెను.

---

# ఆ ఱ వ ప్ర క ర ణ ము.

## గృహచ్ఛిద్రము.

అక్కూరు రైల్వేస్టేషను చిన్నదైనను సుందరమైనది. ఇనుపదారి వంకదిరుగుచోట నొకమిట్టప్రదేశమున చల్లని చెట్ల మధ్య, గుబురుకొనిన మామిడికొమ్మ నధివసించిన శకుంతము వలె, చూపట్టును.

ఇచ్చట భూమి సారవంతమైనది. సముద్రతీరమైనను చెట్లు చేమలు దండిగాఁ బెరుగును. కొబ్బరిచెట్లు ఆకసముఁ జూచుచున్నవి. మఱ్ఱినీడల వైశాల్యమునకు దరిదాపు లేదు. మామిడిచెట్లు నేలపై నీడఁబఱచి బాటసారుల నిరీక్షించును. అక్కూరు ఊహాప్రపంచమున నొకరంగముగా నుండదగినది. రైల్వే దానికొక వింతసొబగు నొడఁగూర్చును. పలువంకల యినుపదారి నాగకన్యను స్ఫురింపఁజేయును.

రైల్వే ఆవరణమున రాతికట్టడములు నాల్గును ఆశ్రమమునఁ బర్ణశాలలవలెనున్నవి. స్టేషను సైతము సమాధికి స్థానము. సంచారముయొక్క సందడి చాలతక్కువ. రైళ్లుగూడ సముద్రపుగాలికి సొమ్మసిల్లుచు, నిద్రలో నడచినట్లు మెల్లఁగా కదలిపోవును

ఆకసమున చంద్రరేఖ చిఱుమబ్బులతో దోబూచు లాడుచుండెను. సముద్రపుగాలి తిన్నఁగా వీచుచుండెను. అప్పుడే నెం 10 రు రైలు ట్రాంక్విబారునకు సాగిపోవుచుండెను.

## 2

గడియారము ఎనిమిదిగొట్టెను. సుందరమున కప్పటికి విశ్రాంతిగలిగెను. పగలంతను పొలముమీఁద కష్టించి మేతకు దారివట్టుదుక్కియెద్దువలె నతఁడు ప్రక్కనున్న గృహమునకు బయలుదేరెను.

గడపదగ్గఱ, సరస్వతి యెదురుపడెను. "అవును, నా పెండ్లినాఁడే నాకిట్టిగతి విధింపఁబడునని నాకుఁ దెలియును." సరస్వతికంఠము రోషకషాయితమైనను మార్దవము, మధురిమ సువ్యక్తమగుచుండెను. స్టేషనుమాస్టరు తనకేదో యొసరు వెట్టినదని అప్పుడే గ్రహించెను.

రాత్రి శాంతికేమి భంగముకలుగునో? సంఘర్షణ దప్పించుకొను టెట్లు?

సరస్వతి కింటివద్ద నన్నియు నవకతవకలుగానుండెను. చీపురకట్టమొదలు చేఁద్రాడువఱకు నంతయు విపర్యాసమే. చీపురుకట్ట యెవరినైన దండించుటకుఁ బరికరముగా నుండెను గాని ఇల్లుతుడుచుట కనువుగాకుండెను. కావిని రైల్వేవాడు

విసరివేసినట్లు దూరముగాఁ గట్టిపెట్టిరి. దానిచుట్టును నల్లకంకర. సరస్వతి లేబాదముల రాళ్ళమైన లతితీవ్రముగా బాధించెను. అంతకన్న స్త్రీలకుఁ గోపకారణ మేమికావలెః

"ఏమివచ్చిందికష్టము, మొదటిదినమే ప్రారంభించినావు నస" అని సుందరము బుజ్జగింపునారంభించెను. "చుట్టుపట్లఁ జూడు; ఎంతరమణీయమైనదో యీప్రదేశము. స్టేషనుచూడు యెత్తుగా..."

"చాలులెండి వర్ణన. ఏమిటి నాకష్టము! బాగుగానే విచారించినారు! నన్నుఁ దీసికొనివచ్చి అడవిలోఁ ద్రోసివేయుటే గాబోలు సుఖపెట్టుట. ఇక్కడ మృగములుండవలసిన దేగాని మానవులుండలేరు. గుడ్లగూబలఘోష, కప్పలసంగీతము, పాములు బుసగొట్టుట, మీకేమోగాని నాకుఁ బ్రియము గావు. ఇక్కడ నేనొకగంటయైన నుండఁజాలను. ఈరాత్రికే మీరు తంతేఁగొట్టి బదలాయించుకొనుఁడు. దినమంతయు నిత రులకొఱకై తంతెగొట్టుచుండెదరు. ఒక్కరాత్రి మీకొరకు మాపనిచేయరాదూ? లేదా నన్ను రాత్రిబండిలో బోటు మెయిలుకు అందించండి. నేను గుంటూరుబోయెదను. చాలు ఇక్కడింతమట్టుకు సంసారము."

సరస్వతి నిష్కర్షగా మాట్లాడెను. చివరకు వెండి లోటాను మగనిదగ్గఱకు విసరివేసెను. సుందరము, తనవలెనే ఆవిడతర్జనభర్జనములకుఁ బాత్రమైన యాపాత్రను క్రిందఁబడ

కుండ నందుకొనెను. అతనికి వస్తుసంచలనము నతివేగముగా పసిపట్టుశక్తి గలదు. గంటకు నలువదిమైళ్లు వేగమునఁ బరువులెత్తు రైలుమొదలు, ఇంటిలోఁ బరిపరివిధముల ఫల్టీలుగొట్టు పాత్రసామగ్రివఱకు నాతని మెలకువకు మించిపోవు వస్తువు లేదు.

ఆవెండిపాత్ర సుందరముగారిసంధ్యావందనార్థము విసరఁబడినది. రైల్వేమూలచాకిరి కిది కొంతపరిహారమని సరస్వతి నమ్మకము. కాని రైలు వేళలు, సంధ్యావందనమును సకాలమున జరుగనీయవు. మగవారివిషయమున విధికృత్యము లెప్పుడో యొకప్పుడైనను మేలేనని సరస్వతి భావించెను.

సుందరము చేతిలోఁ బాత్రను క్రిందుమీఁదు చేసెను. నీళ్లు లేవని నోరువిప్పిచెప్పుటకు ధైర్యము చాలదు. సరస్వతి యెడమకంటి కొసచూపుములికి నొకదానిఁ బ్రయోగించి, దూరముననున్న బావికిఁ బొమ్మని సంజ్ఞ చేసెను. కాని మరల నించుక మెత్తవడి నిర్లక్ష్యముగా ప్రక్కనున్న గంగాళమువైపు వ్రేలుసూపెను.

సుందరము పిల్లివలెఁబోయి నీళ్లు ముంచుకొనెను. కాని మొదటిదినమే పరిస్థితు లింతవిషమించుట బాగులేదని, సాహసించి ప్రత్యుత్తర మారంభించెను.

"సరే, ఇది అడవి, మృగము లుండఁదగినచోటు. కాని రైల్వేఉద్యోగులందఱు దీనిపై నెంతగా కన్ను వేయుదురో నీ కేమి తెలియును? రైళ్లు తక్కువ. పని స్వల్పము. ఒకస్టేషను

దాటినచో, దివ్యమైనప్రదేశము ట్రాంక్విబారు కలదు. మనము ఒద్దికగానున్న యెడల నిది స్వర్గతుల్యము. జంక్షనులలో రాత్రిం బగళ్లు చచ్చి చెడి పని జేసినాను. నాకు తెలియు నాకష్టము. ఇక్కడఁ, గాలుమీఁదఁ గాలు వేసుకొని, పింఛనుబుచ్చుకొని నట్లు జీతముఁ బుచ్చుకొనుచుండవచ్చును.”

“అవును లెండి, పింఛనులాగేయున్నది మీజీతము. నెల కిరువదిరూపాయలుముష్టి. మా అన్న వినిన నవ్విపోవును. మీకు నెలకువచ్చునది, ఆయన కొకదినములోవచ్చును. మీరు జెండా చేతఁబట్టుకొనెదరు. ఆయన జెండానిలుపువిధముమాత్రము వేఱె.” స్టేషనుమాస్టరు అధికారలాంఛనము నామె నిష్కారుణ్యముగాఁ బ్రస్తావించెను.

“అవునవును, మీఅన్నది అదృష్టము. రంగని ఐ సి. యస్ అగునని యెవరనుకొనిరి! ఇపుడు గుంటూరు అసిస్టాంటు కలెక్టరుగదూ? కాని అందఱు కలెక్టర్లుగాఁజాలరు. రైళ్లనడపించువారుగూడ కొందఱుండవలెనా!”

సరస్వతిముఖపద్మము నలముచున్న రోషచ్ఛాయలఁ దొలంచుటకు సుందరము వాక్చతురుఁడాయెను.

“కాని, నీకిటీవల జాబువ్రాసినట్లు లేదే? ఎప్పుడతనికి పెండ్లి? యస్. ఐ. ఆర్. లైనుమీఁద నేస్టేషనుకైనను మనము ఛార్జీలేకపోవచ్చును. శుభలేఖనైన వ్రాయఁడూ?”

సరస్వతి, యీప్రశ్నలకు జవాబు నిచ్చుటకుమాఱుగా, ప్రస్తుతమైన మఱొక ప్రశ్న వేసెను. "ఏమి, యీవేళ నిమంత్రణ బ్రాహ్మణునికివలె విస్తరిఁబఱచుకొన్నారు? చిన్నది చాలదా?"

భోజనమువలన నేమైన భార్యామణి కోపముతగ్గు నేమో, తనకు రాత్రియంతయు నామె ననునయించునవస్థ తప్పు నేమోనని, సుందరము త్వరత్వరగా వెండిగిన్నెలో నీరు వ్రేళ్ల సందునఁ బాఱఁబోసి, సంధ్యను ముగించుకొనెను. ఇఁక నా మహాదేవికి కష్టమెందుకని తానే, మంచి అరఁటియాకును దీసి, ముందఱవేసుకొని, నాలుగై దుమార్లు నీరుప్రోక్షించి, కడిగి, ముడుతలులేకుండునట్లు పఱచుకొని, పొడిదగ్గుదగ్గి, తలనాడిం చుచు, సిద్ధముగానున్నానని తెలియఁజేసెను.

ఆసమయములోనే సరస్వతి నిమంత్రణ బ్రాహ్మణప్రశ్న వేసినది.

ఈసారి సుందరము సరిగా జవాబిచ్చెను. "ఎందు కింత విస్తరి యనియా నీనస? మనదొడ్డిలో నరఁటియాకులు విస్తార ముగా నున్నవని పెద్దవిస్తరినే వేసుకొన్నాను. ఇంత మంచి భూమి యీచుట్టుప్రక్కలమైళ్లతరబడి వెదకినను లేదు."

"మఱి తినండి ఆకులనే; ఇక్కడ బియ్యపుబస్తాలంతవిస్తార ముగా పండవుగదా. ఇరువదిరూపాయ లిరువురినిఁ బోషించ లేవుగూడా."

"ఎందు కంతనిరాశ? తొందరలోనే బియ్యపుబస్తాలకుఁ గూడ మనకు లోటుండదు. నీవుమాత్రము కొంచెమోపికఁ దెచ్చుకొనవలె. దైవమున్నాఁడుపైన."

"రైల్వేఉద్యోగులుగూడ నున్నారుమీాపైననే! వారినిఁ బోయి ప్రార్థించండి ముందఱ."

"దైవమనుకూలముగానున్న నదియు నోడఁగూడును. సరసూ, ఎందుకింత? తొందరలో గూడ్సుబండ్ల నీలైనుమీాద నడిపించెదరు. అపుడు నీవు కోరినవస్తువు గోరినట్లు తెచ్చిపెట్ట ఁదను. బియ్యము, పప్పులు, పండ్లు—యేమియును కొదువయుం డదు. తక్కువజీతమువారికి దేవుఁ డేదో దారిచూపనే చూపి యున్నాఁడు."

## 3

సుందరము విస్తరిముందుకూర్చొని, యింకను నీళ్లు ప్రోక్షించుచు, నిటునటు నానీటిబొట్టులఁ గదలించుచుండెను. సరస్వతిమాత్రము రోషస్ఫురన్మూర్తియై ముందునిలిచియుండెను. సరసమో, విరసమో యింకను నిశ్చితముకాలేదు. చివరకు సర సమే సంప్రాప్తమయ్యెను.

సరస్వతి ప్రసీదయై, వంటయింటిలో నడుగుపెట్టి, అన్నపుస్తాంబాళమునుఁ దెచ్చి, సుందరమువిస్తరిలోఁ జిందరవంద

రగా మెతుకులఁ గ్రుమ్మరించెను. అలిగినఆఁడవారికే తెలియును ఆవడ్డెనయొప్పిదము.

విస్తట్లో నన్నమునుఁజూడఁగానే, సుందరము కోపము నేసికొనునుద్యమము మానుకొని, సంధిప్రయత్నమునే కొనసాగించెను. తనరాణిని వశపఱచుకొనుటకు మఱొకఅధ్యాయము నారంభించెను.

"ఇచ్చటి మిరాశీదారు నాకుఁ దెలియును. చాలాసంపన్నుఁడు. రెండువేలయెకరములు క్షేమైనమాగాణి. అతని ధాన్యపుకుప్పలు స్టేషనునుండి చూచినఁ గన్పట్టును. వాని ధాన్యరాసులఁజూచిన దేవతలకన్నులునుం గోరగించును."

ఐశ్వర్యోద్ఘాటనము స్త్రీలకుఁ బ్రియమని కథలం దతఁడు చదివియుండెను. సరస్వతిరోషము ననునయించుట కిచ్చటి శ్రీమంతునికథ యెందుల కుపకరింపరాదు!

"నేనప్పుడే మొదలియారుస్నేహమును సంపాదించితిని. ఈరైల్వేలైను కేవల మతనికొఱకే వేయఁబడినది. అక్కూరుస్టేషను అతనిసృష్టి. ఇతరుల కిది నిష్ప్రయోజనము. అతఁడడుగఁగానే యీస్టేషను వేయఁబడినది. మొదలియారు తాలూకాబోర్డు, జిల్లాబోర్డులందు సభ్యుఁడు. అఱవములోఁ దాను చేవ్రాలుచేసి, యింగ్లీషనిపించుకొనఁగలనని సగర్వముగా నతఁడు నాతోఁజెప్పెను. శాసనసభకుఁగూడ నిలువవలెనని ఆశ

వడుచున్నాఁడు. ప్రపంచములో భాగ్యవంతుఁడు సేయలేని దేమిగలదు?"

సరస్వతి సుముఖియై వినుచుండెను. సుందరము సంతోషించెను. నవలలఁ జదివినందువలన నిపుణముగా కష్టముల గట్టెక్కించుచున్నానని తన్నుఁదా నభినందించుకొనెను.

"మొదలియారీదినం మధ్యాహ్నము నెం 9 రు రైలుకొఱకు, సీడన్ మోటారు కారులో వచ్చెను. పలువన్నెలదుస్తులు, మెఱుగు పెట్టినయుక్కు వంటిశరీరము, స్థూలకాయుఁడు. ఇంకను అవివాహితుఁడు."

వ్యాఖ్యానమువదలి తొందరగా కథగానిమ్మని సరస్వతి తలయూఁచెను.

"నెం 9 రు రైలు అర్థగంట ఆలస్యముగా వచ్చెను. డ్రైవరు ట్రాంక్విబారులో తనసరసురాలితో మఱికొంతజాగు సేయుటే కారణము. నేనొక్కఁడనే మొదలియారుతో ముచ్చటించితిని. స్టేషనులోనున్న కుర్చీలలోకెల్ల మేలైన దాతనికమర్చితిమి. పోర్టరువాఁడు కరియన్ విఱిగినకాలు ప్రాతకుర్చీని జోడించి తయారుచేసి వడ్రంగి కూలిబుచ్చుకొన్న కుర్చీ అది. మొదలియారు నాపైఁ జాల యభిమానముచూపెను. తాను తిరిగి రాఁగానే, రెండుబస్తాలు మేలైనబియ్యము మనకుఁ బంపించెదననెను. స్టేషనుమాస్టరు నతఁడు స్వజనముతో సమానముగాఁ జూచుకొనునఁట."

సుందరము చెప్పినదానిలో సగము నిజము, సగము కల్పన. కల్పనయును తానాశపడుచున్న దాని కనుగుణమైన దే. ఏమిచేయును ? పెండ్లాము ననునయించవలెనా ? సత్యముతో నామాత్రము స్వాతంత్ర్యము చెల్లదా! సరస్వతీస్మితమున కెట్టి కల్పనలకైనఁ బాల్పడవలసినదే. ఆవిడ మెల్లగా కటాక్షించెను. చిఱునవ్వొకటి పెదవులపైఁ దొలాఁడెను.

సుందరమునకుఁ బట్టరానిసంతోషమయ్యెను. రెండవ చేయి విస్తట్లో నన్నమును ప్రోగుసేయుచుండెనుగాని లేకున్నఁ జప్పట్లు చఱచియుండును.

"గూడ్సులైను సమ్మతింపఁబడినట్లే. కొన్నిరోజులలో ఖరారు. అపుడు నీవు కోరినదెల్ల నీకు లభించును. కూరగాయలలో తోఁటకూరమొదలు కోసుగడ్డవఱకుఁ గొదువలేదు. బియ్యము, పప్పులు, మేలైనసరకు—అంతయు నుచితమే. మొదలియారే ప్రతిసంవత్సరము కొలంబో కిరువదివేలబియ్యపు బస్తాల నెగుమతిసేయును. ఇక కాశ్మీరముమొదలు కన్యాకుమారివఱకు దొరకుఫలపుష్పములు, నాగరికవస్తుసముదాయము దిగుమతిసేయును. ప్రతిది మనచేతిగుండా పోవలయును."

"ఇరువదివేలబియ్యపుబస్తాలా ? ఆశ్చర్యము ! అతఁడు చాలాభాగ్యవంతుఁడై యుండవలెను. అంతధనముతో నాతఁడేమిసేయును?" సరస్వతికంఠము చాల మృదువై యుండెను.

శాంతముగా సంభాషించునప్పటి మధురిమ పునరుద్భావ మయ్యెను. చుట్టుముట్టు మేఘపటలములజయించి వెలుఁగొందు నుదయభానునివలె నామె ముఖమండల మింపుగొలిపెను.

సుందరము తనచాతుర్యము ఫలించెఁగదా యని పొంగి పోయెను. "అవును, వీరు చాలాభాగ్యవంతులు, కాని నిర్వ్యాపారులు, దుశ్శీలురు. మూఁడుతరములుగా కూడఁబెట్టినధనరాశి క్షణములోఁ గరఁగుచున్నది. మొదలియారు యువకుఁడు. అతనికి సలహాలిచ్చువారనేకులు. అక్కూరుస్టేషనుమాస్టరునకును వారిలో సర్వస్థానము గలదు. మొదలియారు తాతలనాటి రొక్కము నంతటిని వెచ్చించినాఁడఁట. సాయంత్ర మతఁడు తీవిగా బయలుదేరిపోయినది మాయవరములో నొక మార్వాడీవానికడకని వినికిడి. నేను పెషావరునుండి రామేశ్వరము వఱకు సంచరించినాను. పనిలేనిభాగ్యవంతులీతమిళదేశములో నున్నంతనీచులు, స్వార్థపరులు మఱెక్కడనుఁ గానరారు. ఈ మిషనరీవిద్యమువలన మనగుణములును క్షయించినవిగావలయు. చింతపండుతిని చెడినాము."

సరస్వతి కథలోఁ బూర్తిగా నిమగ్నయయ్యెను. తన నాథునియందును కవిత్వగుణముండుట కచ్చెరువందెను. ఏకాంతవాసము, సాగరసమీరము నిరంతరజీవనపరిశ్రమమున మోడులైనవారింగూడ చిగిరింపఁజేయునా!

ఈసుముఖత్వమును బురస్కరించుకొని సుందరము తన విన్నపముఁజేయ సాహసించెను. ఇంతవఱకు భోజనముసాగ

లేదు. అన్నము వడ్డించినదేగాని సాధకముగా లేదు. సాంబారు కొఱకతఁడు కనిపెట్టుకొనియుండెను. సరస్వతి సౌందర్యరాశి వలె ముందఱగూర్చొని యుండెను.

"అన్నము చల్లగాఁబోవుచున్నది. ఇక్కడ నీలగిరులంత చలి. కొంచెము సాంబారు తేఁగూడదా?"

సరస్వతి ఒక్కమాఱు స్వర్గమునుండి దిగెను. "సాంబారా? ఈవేళ విందుభోజనముకొన్నారా? ఎందు కాసాంబారు మీఁద అంతప్రేమ? సాంబారులోఁ జింతపండువలననే మీరు చెడినారు. ఇక్కడదిగిన దీవేళనేగదా. ఇంకను నేను వస్తువులను సర్దుకొననైనలేదు. ముఖముగడిగికొనుటకే తడవులేదు. క్రొత్త యింటిలో నాల్గుమెతుకులు వండిపెట్టినందుకు సంతోషించండి. మగవారిదంతయు విపరీతమే. ఏమి మేము బరువుమోయుపశువులమా, ఆటబొమ్మలమా?"

సరస్వతి ప్రసంగమునకు సుందరము నిర్ఘాంతపోయెను. ఆవిడ రోషముఁగనినఁ గేవలము సాంబారువలననే ప్రత్యక్షమైనట్లులేదు. గృహజీవనమే ఆమెను అడుగడుగున బాధించుచున్నట్లుండెను.

నిమిషములు గడచిపోయెను. ఎవ్వరును మాట్లాడలేదు.

# 4

సరస్వతి నిండుజవ్వని. ఇంచుక లావయ్యును మృదువైన శరీరము, అపరంజిబంగారువంటివర్ణము, గుండ్రనిముఖము,

హొచ్చైము లేనిపూర్ణసుందరి, ఉన్నతమైనలలాటము, తిన్నని ముక్కు, విశాలమైననేత్రములుగలిగి ఆగర్భశ్రీమంతులయింటం బుట్టినదివోలె విరాజిల్లెను. నిజమునకు సరస్వతి పేదవంశము ననే ప్రభవించెను. సౌందర్యప్రాప్తి దైవికము.

ఈమెతండ్రి తంజావూరులో సంపన్నులైన యొకా నొకమహారాష్ట్రబ్రాహ్మణవంశమునఁ గొలువుండెను. జీతము నెలకు పదితూములధాన్యము, ఐదురూపాయలయ్యెను, ఇంటి పెత్తనమంతయు నీతఁడే నిర్వహించుచుండెను. అట్టిసంపన్నుల గృహాంగణమునఁ బెరిగినదగుటవలననే సరస్వతికిఁ గళాకాంతులు నిజవంశమున కన్న నెక్కుడుగా సమకూడెను.

ఆసంపన్నులకుఁ దటాలునఁ బతనముగల్గెను. రాచఱికపు మర్యాదలుగల్గి, సముచితాచారముల నడిపించుటకు రాచఱికపుసంపత్తి వలయుఁగదా. మూడుకేసులు హైకోర్టులో వీరికి విరుద్ధముగా తీర్మానమాయెను. దివాలా తీవలసివచ్చెను. సరస్వతి తండ్రియు, తనయజమానునివలెనే భగ్నహృదయుఁడై మరణించెను. సరస్వతి కపుడు పదేండ్లవయసు. తల్లియు మఱినాలుగేండ్లకే పరమపదించెను. సుందరము సరస్వతికి దూరబంధువు. పెండ్లియగునప్పటి కాతఁడు కాలేజీలో చుఱుకుగా చదువుకొనుచుండెను. కాని, పెండ్లియైనకొన్నాళ్లకే అతనికి మతిచలించెను. దేశద్రిమ్మరియాయెను. చేతిలో రాగిదమ్మిడి లేకపోయినను, ఒడలినిండుకు విభూతిఁబూసికొని, సన్యాసివేషమున భారతదేశమంతటనుఁ దిరుగాడ నారంభించెను. రైలువారు,

పాపము, సన్యాసివేషధారుల నట్లే పీడించరు. బూడిదబూసి కొన్నచో టికెట్టుపట్టింపు తక్కువ. చేత రుద్రాక్షమాల యుండెనా, టికెట్టుకలెక్టర్లావంకయే తిరిగిచూడరు. అథవా, అడిగినను విసుగుతప్ప వేఱుఫలము లేదు.

సుందరము దేశాటనము మథురలో దైవికముగాసమాప్తి నొందెను. క్రొత్తగా నుద్యోగములోఁజేరిన అసిస్టాంటు ట్రాఫిక్ సూపర్నెం టొకఁ డచ్చట యీదంభసన్యాసినిగుర్తించి, యితనికథనాలకించి, దయగొని, భార్యను దెచ్చుకొని గృహ జీవన మారంభించునియమముతో నాతనికి మాయవరమున టికెట్టుకలెక్టరుపని నిప్పించెను.

సుందరము టికెట్టుకలెక్టరుగా మంచిపనివాఁడాయెను. సంసారముఁదెచ్చి పెట్టుకొనెను. కాని మొదటినాఁడే సరస్వతికిఁ దనకుఁ గలయంతర మెఱింగెను. సరస్వతిరూపమునను, గుణము నను, తేజమునను తనకన్న నెంతో యుత్తమమైనది. ఆమహా ప్రవాహము చెంతఁ దానొకచిన్న కాలువ. ఉన్నతదరుల నధిగ మించి తనప్రేమోపహారము నాప్రవాహమున నైక్యపఱుప ధైర్యముచాలలేదు. ఆవిడవైఖరి ననుగమించుటే యితనిజీవన విధానమయ్యెను. కాని మాయవరములో నితని కొకశుభము చేకూరెను. తిరిగి, బాల్యమందువలెనే గ్రంథపఠనాసక్తి కల్గెను. సరస్వతియు తనవలెనే గ్రంథపఠనమునఁ గుతూహలినియగుట సంతోషదాయకమయ్యెను. స్టేషనులో హిగిన్బాథమ్సుకంపెనీ వారి పుస్తకములదుకాణ మతనికి శరణ్యము. అచటిగుమా

స్త్రాతో స్నేహమునెఱపెను. ఆగుమాస్త్రాయును చదువుట ప్రధానము, చదువఁబోనిధనికులకు విక్రయించుట తరువాతి విషయమనియుఁ దలంచువాఁడు.

మాయవరములో మూఁడేండ్లు రాత్రింబగళ్లు పనిచేయుటతో సుందరమునకు విసుఁగెత్తెను. మాయవరం, ట్రాంక్విబారు చిన్నలైనుపడఁగానే, ఇతఁడు అక్కూరుమీఁదఁ గన్నువేసెను. పట్టణముల కలవాటుపడిన తనసహధర్మచారిణి కావిజన ప్రదేశము సరిపడదని శంకించెను. కాని మొదటిదినమే యింత భీభత్స మగుననుకొనలేదు.

సుందరము కొంతవఱకు జీవితములో జయించుకొని రాఁగలవాఁడే. కాని అతనివర్తన వంకరటింకరపద్ధతి. ముఖాముఖ నవిచ్ఛిన్నముగా వర్తించు టెఱుఁగఁడు. ఎన్నో వంకలు దిరిగి విషయమునకువచ్చును. ఇఁక సరస్వతిముం దీలక్షణము మఱింత రూఢియగును. ఇది గొప్పలోపము. స్త్రీల కీపరిభ్రమణము నచ్చదు. తానుచదివిన నవలలవలనఁగూడ నీవిషయమాతఁడు గ్రహించియుండెను. కాని నిత్యజీవనమున నాతడు తనసహజలక్షణముల మార్చుకొనఁజాలకపోయెను. అతనిబుద్ధికీవక్రత నాపాదించురహస్యకోశముల నరికట్టఁజాలఁడు. ఇట్టి దానికి ఫలమే, యీనాఁడు సరస్వతి దేవిగా ముందుకూర్చొని యుండ, నీతఁడు సాంబారునకై కనిపెట్టుకొనియుండుట.

కాలము కష్టముతో సాగుచుండెను. కాని, మంజులమైన యీసందిగ్ధదశ యట్లే యుండెను.

నెం 10 రు రైలు ట్రాంక్వీబారునకుపోయి నెం 13 రుగా తిరిగి అక్కారునకువచ్చి మొదటిచెక్కదగ్గఱ నిలిచియుండెను. మాటిమాటికి రైలుకూత గింగురుమనుచుండెను. సుందర మింకను సాంబారునకై వేచియుండెను. ఇంకను అన్నమును ప్రోగుసేయుచుండెను. రైలుకూత వినఁబడఁగానే, ఇతడు అన్నమును విస్తరిమీఁద చెల్లాచెదరుగా విసరికొట్టి రైలును రప్పించుటకు లేచెను. "అబ్బబ్బా! ఈచిన్నలైనువారికిఁ గాలజ్ఞానమేమాత్రమును లేదు. వారియిష్టమువచ్చినట్లు ముందఱగానో, ఆలస్యముగానో వచ్చుట, మమ్మిట్లువేధించుట. ఇఁక నిట్లు జరుగఁజాలదు. ఏడీ, ఆదొంగవెధవ కరియప్ప?"



# ఏడవ ప్రకరణము



## కరియప్ప కడగండ్లు.

సుందరం గృహచ్ఛిద్ర మిట్లుండఁగా, కరియప్ప మాత్ర మూరకుండ లేదు. కల్లంగడిలో నతిరభసము సేయుచుండెను. కరియప్ప అక్కూరులో చాలాచోరవగలవాఁడు. స్టేషను మాస్టర్లు వచ్చుచుందురు, పోవుచుందురు; కాని కరియనులు మాఱరు. అక్కడి రైలుకమ్ములవలెనే స్థిరముగా నాటుకొని యుందురు. రైళ్లునడచుట కాకమ్ములవలెనే వీరును అత్యవసరము. స్టేషనునకు బహిఃప్రపంచమునకును కరియప్ప లంకె. అందఱుపోర్టర్లకన్న నొక్కయాకు నెక్కువచదివినవాఁడు.

అక్కూరుస్టేషను ఆవరణములో కరియనునకును రైల్వేవా రొసఁగినవసతిగృహము గలదు. ఇదొక నలుచదరపురాతి కట్టడము. ఇల్లనుటకన్నను పెట్టెయనుట మేలు. గాలి, వెలుతురువచ్చుటకుగా పైన నొకరంధ్రముతప్ప వేఱుసదుపాయము లేదు. ఇట్టిచోట వసించుట తననౌకరినీచత్వమును మఱింత సార్థకపఱచుటయని కరియప్ప భావించెను. రైలునెక్కువారు, దిగువారు తనరాణివాసములపైఁ గన్నువేయుటగూడ గొప్ప యిబ్బంది. జగద్వ్యాపారమునకు సమర్థుఁడైన తాను రైలువారు కట్టిపెట్టినబోనులో నుండుట తగదు.

రైల్వేనియమముల నుల్లంఘించిరయ్యెనను, కరియప్ప ఒక ఫర్లాంగుదూరమున గ్రామములోనే కొబ్బరితోటలో నొక ప్రాతయింటఁ గాపురముఁబెట్టెను. ఇల్లాలు పెద్దయింటిపిల్ల. ఇప్పటికిని ప్రాతమర్యాదలు పోలేదు. అందువలన నందఱికంటెఁ బడకుండఁ గాపాడుట కరియనునకు మఱింత విధ్యుక్త మాయెను.

కరియప్ప యౌవనమునుండియు ఖులాసాగా తిరిగిన వాఁడు. చుట్టుపట్లనున్న చదురుకత్తెలతో సరసముసాగించిన వాఁడు. మన్మథునిసాహాయ్యముతో ననేకగ్రామముల నీతఁడు దండెత్తెను. అదంతయు తనకుటుంబ ముచ్ఛదశలోనున్న కాలమున. వంశమునకుఁ బేరుమాసి, సంపద క్షయించిన వెనుక నీతని స్వైరవిహారము మందగించెను.

భార్యమాత్రము పతివ్రత. నల్గురుబిడ్డలను కన్నులఁ గప్పుకొని పెంచుచుండెను. ఈబిడ్డలగొడవ కరియనునకు నచ్చదు. ఏదో దౌర్బల్యావస్థలో సంప్రాప్తమైరని యతని తలంపు.

కందప్ప అక్కాఱుచేరుకొన్నవెనుక, నాతనికి మఱింత ప్రతిగా నుండుటకుఁ గాబోలు, కరియప్ప స్త్రీవిషయమున స్వేచ్ఛ నెక్కుడుగాఁ జూపసాగెను. ఇటీవలనే పదునేనేండ్ల బాలిక, ఇంకను గోటగిల్లువడక కొమ్మనేనిల్చియున్న కుసుమము వలె రమణీయమైన దీతనికంటఁబడెను. ఒకదినము స్టేషనులో

రైలుదిగుచుండఁగాఁ జూచెను. ఆపిల్లనవ్వు ఇంకను యితని చెవులరణితమగుచుండెను. ఇప్పుడు రైలుధ్వనిగూడ దాని ముందు హీనముగా శ్రవణగోచరము.

కరియణ్ణ అప్పుడప్పుడిట్లు స్వగతము వచించువాఁడు. "ఇంతచక్కనిచిన్నదానిని, ఒకదినమైనఁ బంజరములోఁబడక యిటునటు చరించు నీరామచిలుకను నేనూరకపోనీయను. అవసరమేవచ్చుచో, రెండవపెండ్లాముగాఁ బెండ్లాడెదను." రెండవపెండ్లి కరియణ్ణ ముందఱనే నిశ్చయమునేసికొనెను. చక్కనిపిల్లకొఱకుమాత్రమే వేచియుండెను. తాను తప్పద్రాఁగి యున్నప్పుడునైతము కామాక్షి యతనికి మఱపురాదు.

కల్లంగడిలో కందణ్ణతో సమాధానపడిన వెన్వెంటనే, కరియణ్ణ పూర్తిగా సారాయిమత్తుతో నింటిదారివట్టెను. కాని, త్రోవలోఁ దలవనితలంపుగా కామాక్షి ప్రత్యక్షమయ్యెను. ఆవిడ అరటియాకులకట్ట, యేవో పండ్లు, పేముపెట్టెయొకటి, చిన్నపడక మోసికొనిపోవుచుండెను. చూడఁగా రైల్వేస్టేషనున కేదో ప్రయాణమై పోవునట్లుండెను.

ఇదేమి, ఒక్కసారియైన ముట్టుకొనకముందే, ఒక్కపాటయైనఁ బాడకముందే తనముద్దులపిట్ట యెగిరిపోవుచున్నదా! త్రాఁగియున్నను కరియణ్ణ ఈమాత్రము గ్రహించెను. దైహిక విషయములఁ గొన్నింటఁ ద్రాఁగుడువలన సూక్ష్మతహెచ్చును. కామాక్షి తేటఁదనము కరియణ్ణ నూఁగించెను.

"చక్కనిదానవు, యెక్కడి కీరాత్రి చీఁకటిలో నొక్క తెవే పోవుచున్నావు?" కరియర్ నిర్భయముగా ముందుపడెను.

"స్టేషనునకు, అక్కడనుండి మాయవరమునకు. ఇల్లు లేనిదానను. ఇక్కడనుండి అక్కడకు, అక్కడనుండి యిక్కడకు,ఇంతే మాబోంట్లగతి. కరియా, నీకు రైలుకు వేళగాలేదా? ఇంకను యిక్కడనున్నావే?" "ఇంకను చాలాసేపున్నది. భయపడవద్దు. ఈరాత్రి ఒంటరిగా నెందుకు? నేనువచ్చి నీకు టిక్కెటుఁదీసియిచ్చి రైలెక్కించెదను. నాతో నింటికిరమ్ము. రెండుముద్దలు నోట్లోవేసికొనివచ్చెదను. ఇద్దఱముఁగలిసి స్టేషనునకుఁ బోవచ్చును."

కరియర్ గొంతు, చూపులు మోహము వెలువరించెను. కామాక్షి చుఱుకుగలపిల్ల. అందులో మానసంరక్షణమున స్త్రీలందఱికిని చాలా మెలకువ. కరియర్ ఉద్దేశ్యముఁ గనిపెట్టి యిట్లనెను.

"నాకు భయములేదు. నేను స్టేషనునకుఁ బోఁగలను. నీ వింటికిఁ ద్వరగా వెళ్లి వచ్చివేయుము. నీకును వేళయైనది. వెళ్లుము."

ఇట్లనుచు నావిడ, అతఁడు నిర్బంధించునేమోనని వేగముగా ముందుకునడచెను. ఇట్టిసమయమున నొకముద్దునైనఁ గొనవలెనని కరియనున కుత్సాహముపుట్టెను. చుఱుకుపిల్లలు

కామాక్షీవంటివా రూరక మాటలకు లొంగరు. సాహసము సేయనిదే ప్రయోజనములేదు. సరిగా నిదే సమయమునకు దాపుననే బండ్లధ్వని, లాంతరులవెలుతురు కరియన్ ఉద్యమమునకు భంగకారులయ్యెను. త్రాఁగియున్నను, ఇంచుక తెలివిఁ దెచ్చుకొని, భార్యపై మఱింతరోషముతో నింటివైపు పరువెత్తెను.

## 2

కరియన్ నెలరోజులుగా నింటికొక్కదమ్మిడినైన నిచ్చినవాఁడుగాఁడు. భార్యయే పైతృకధనముతో నెట్లో వెళ్లఁబుచ్చుచుండెను. పరాయివారిని ఉప్పునడుగు టెఱుఁగదు. ఇంటిలో బియ్యము లేవు. పొరుగువారి నడుగుదమనుకొనెనుగాని ధైర్యముచాలలేదు. అందువలన భర్తరాక నిరీక్షించుచు గూర్చొనెను.

ఎవరిదో కాలిచప్పుడు విని తలుపు దెఱచెను. వచ్చినది కరియన్ గాదు, కందన్. వెంటనే వెన్కకుమరలి, ఆవిడ వంటింటి మఱుఁగుఁజొచ్చెను.

“అమ్మా, భయపడవలదు. నేనును కరియన్ యీదినం తిరిగి స్నేహితులమైతిమి. ఇక్కడి కతఁ డింకను రాలేదా? వచ్చియుండుననుకొంటిని. పోనీ, మీకందఱికిఁ గుశలమా? బిడ్డలు

ఖులాసాగానున్నారా? ఏమి యింటిలో వంటప్రయత్నము లేదే! అరమరలులేక నాతోఁ జెప్పుడు."

ఈలోపుగా, బిడ్డలునల్గురు కందన్ దగ్గఱకువచ్చి తిను బండారముల కాసపడిరి. కందన్ పరిస్థితులను గ్రహించెను. "కరియన్ డబ్బంతయును కల్లునకు ధారవోయుచున్నాఁడు. ఇదిగో ఈరూపాయ గైకొనుఁడు."

కందన్ తిన్నగా రూపాయను నేలపై దొర్లించెను. అది మట్టిలో దొర్లిపడి నిలువఁగానే, కరియన్ లోనికివచ్చెను. అతఁడేయవస్థలోనున్నదియుఁ జెప్పనక్కఱలేదు.

"కందా, యిక్కడేమిసేయుచున్నావు? నా పెండ్లాముతో నీ కేమిపని? ఇందుకా నాతో సాయంత్రము స్నేహము నటించితివి? ఈరూపాయ యెక్కడిది. దానికి లంచమా? ఛీ" అని కరియన్ కోపావేశముతో గద్దరించెను.

కందన్ అతని శాంతింపఁజేయ దొరకొనెను. "కరియన్, ఎందుకు కోపము? విషయమంతయు వినుము. నీవింటికివచ్చియుందువని వచ్చితిని. మనస్నేహమును పెంపొందించుటకే నారాక. వదినెకు నానమస్కృతు లందఁజేయఁగల్గితిని. త్వరపడి లేనిపోనినిందలు వేయకుము."

కరియన్ జవాబుపలుకలేదు. కందన్ కరియనునకు హితోపదేశము సేయ నెంచెను.

"ఇదిగో, నీవు భార్యాబిడ్డలయెడ నిష్కారుణముగా నున్నావు. ఈపదు నేనురోజులలో నొక్కదమ్మిడీ వారి కీవైతివి. అందఱును మాడుచున్నారు. నేనిది గ్రహించితిని. బిడ్డలనైన రక్షింపవలెనని ఒక్కరూపాయనిచ్చితిని. వారు నీముందేడ్చుచుండలేదా ? చూడుము." నిష్కర్షగా మాట్లాడకతప్పదని కందర్ యిట్లనెను. "నీకిష్టము లేనిచో నేను రూపాయను మరల పుచ్చుకొనెదను. కరియా, నీబిడ్డలు నావారుగారా? నాకీప్రపంచమున నీవును నీసంతానమునుఁదప్ప మఱెవ్వరుగలరు?"

కరియర్ ఈమాటల వినిపించుకొనలేదు. అతనికోపము వేఁకదరినుండెను. ఒక్కమారు కందర్‌ను నెట్టి, "పో, పో" అని విసరుగా తలనూఁచెను.

త్రాఁగినవాఁడింటికి రాఁగానే, పట్టెడన్న మిడవలెను. అది నాస్తియగుటచే, కరియర్ ఆగ్రహపరవశుఁడై పాతకాడఁగైకొని, భార్యపై విసరెను. తలకుఁదగిలి, నెత్తురుగాఱుచు నావిడ నేలవ్రాలెను.

కందర్ యింటికివెనుక నిలుచుకొనియుండెను. దెబ్బ వినఁగానే "కూనీ, కూనీ" యని కేకలువేసెను. ఊఁరిజనమంతయును ప్రోగైరి.

సరిగా, ఆదేసమయమున నెం 13 రు రైలు స్టేషను బయటిచెక్కవద్ద నిలిచి కూతవేసెను. సర్చిలైటు వెన్నెలవలె

కష్టములనెల్లఁ గాంతిమయముచేసెను. కరియర్ ఒక్కపెట్టున స్టేషనునకుఁ బరువెత్తెను. ఎంత త్రాఁగియున్నను, రెండవలైను మీఁద ఖాళీబండియొకటియున్నదనియు, చెక్కలన్నియు సరిగానుండకపోవచ్చుననియు నాతఁడు జ్ఞప్తికిఁదెచ్చుకొనెను.



# ఎనిమిదవప్రకరణము.

## రైలుసంభాషణ.

## 1

ఇక బోటుమెయిలు నెక్కినరంగన్ రాజేశ్వరులసంగతి. జనము క్రిక్కిరిసిన యాబండిలో నెట్లైనను రాజేశ్వరి కించుక చోటు చూపించుటకు రంగన్ తననైపుణినెల్ల వినియోగించుచుండెను. కాని ప్రయాణీకులు తంటాలుపడి సంపాదించుకొనిన జేనెడుచోటును మాటలకు బెలుపోయి వదలుకొనరు. ఏదో కోటను బ్రద్దలుచేసివచ్చి విశ్రాంతిగైకొనుచున్న సైన్యమువలె నాబాటసారులు అలసటదీర్చుకొనుచు, శ్వాస విడుచుచుండిరి.

మూఁడవతరగతిరైలుబండి చేతనాచేతనవస్తుప్రదర్శన శాలనుబోలియుండెను. పెట్టెలు, పరుపులు, సంచులు, పలురకములసామగ్రి గందరగోళముగా పడియుండెను. మేదరివాడు ప్రేముతోనల్లిన బుట్టలుమొదలు, అతినాగరికము మొసలిచర్మముతోఁజేసిన నాణెపుసరకువఱకు, ప్రదర్శనములో సమస్తముండెను. బాటసారులుగూడ చిత్రవిచిత్రముగా నుండిరి. ఒకవైపున నిరువురుబైరాగీలు యేబదేండ్లవిచ్ఛిన్నముగా బెరిగిన

గడ్డముతోఁ గూర్చొనియుండిరి. మఱొకవైపున నవనాగరికులు రంగఁ, రాజేశ్వరులు. ఒకమూల నుపవసించువృద్ధబ్రాహ్మణుఁడు రుద్రాక్షమాలఁ ద్రిప్పుచు, జపముసేయుచుండెను. వానిప్రక్కనే కాకీదుస్తువేసి టోపీబెట్టుకొన్న నల్లదొర యొకఁడు త్రాఁగి, సగము మతిదప్పి, సిగరెట్టుకాల్చుచు, బ్రాహ్మణునిముఖము మీఁదికే పొగవిడుచుచుండెను. పాప మాబ్రాహ్మణుఁడు చేయునదిలేక, జపముతోఁగలిపి శాపమును గొణుఁగుచుండెను.

కాని, భారమెట్టిదో సరకుసేయక, రైలుయింజను ఆత్మానుభవోత్కర్షనానందించునదివో లెఁ బరువెత్తుచుండెను.

రంగఁ యెట్లో రాజేశ్వరి కొక గ్రామీణునికిని బైరాగికినిమధ్య చోటుసంపాదించెను. గ్రామీణుఁ డొకగోచిపాతరాయఁడు. బైరాగితొడిగిన నల్లచొక్కాలో రామేశ్వరము మొదలు హరిద్వారము, బదరీనారాయణమువఱకుఁ గలస్థలమాలిన్యవిశేషములు జీర్ణమైయుండెను.

ఈమూఁడవతరగతిబండి దృశ్యమును దారిద్ర్యసంపద్వైపరీత్యవ్యవస్థలను రాజేశ్వరి శాంతచిత్తయై విస్మయముతోఁ దిలకించెను.

రంగఁ తెలివితేట లాతనికిఁ జోటుసంపాదింపలేక పోయెను. ఏమియుందోచ కాతఁడు నిలువఁబడెను. అతని కాళ్లు ఒకమహమ్మదీయునిమోకాళ్లమధ్యఁ దగులొక్కనెను. ఆ మహమ్మదీయుఁడు రాజేశ్వరిసౌందర్యమును తిలకించుచు, ఇతని

స్పర్శ కాగ్రహింపలేదు. కాని యెప్పుడు వాఁడిటుతిరిగి మోకాళ్లమధ్య తనకాళ్లను గట్టిగా నొక్కునో యని రంగకు ఉక్కిరిబిక్కిరి మనుచుండెను. ముందుగానే అనునయించు టకుఁగాబోలు, ప్రక్క నేమైనఁ జోటుదొరకునా యని పనికి మాలిన ప్రశ్న లారంభించెను. బోటుమెయిలులో నందఱును దూరముపోవువారేగాని దగ్గఱప్రయాణీకులు కారని తనకుఁ దెలియును. బహుశః తానుపోవుచోటే, అందఱికన్న దగ్గఱది గావలయు. ఈదుర్భరావస్థను మఱచిపోవుట కతఁడు రాజేశ్వ రితో సంభాషణకు దొరకొనెను.

"రాజీ, నీవలన నాకు మతిపోయి, ఆటికెక్కుట్లకిటికీయొద్ద నట్లు తంటాలుపడితిని. కేవలము అనవసర మాశ్రమ"

"మతిపోయినందువలననే సామానుకు మొదటితరగతి మనుష్యులకు మూఁడవతరగతిటిక్కెట్లు కొన్నారు. ఇదేనా వి. సి. యస్. వారిపద్ధతి!"

"చింతించి యేమిప్రయోజనము! రాజీ నీవు నాయవ స్థలోనున్న నట్లే చేసియుందువు. మొదటితరగతిటిక్కెట్లతోనే మనము మూఁడవతరగతిబండిలో నెక్కియుండవచ్చును. కాని ఆపోర్టర్లగుంపాకతట్టు, రైలుకు గంటయిపోవుట, నీనిరంకు శత్వము నాకేమియుం దోఁచనిచ్చినదిగాదు."

"కాన్యంపుకర్తొర్కు లేనిదోషముది!"

"చాలించు, రాజీ నీచాతుర్యము. బొంబాయి నిన్ను మార్చివేసినది. నీవు మొదటితరగతి రాననఁగానే, నాకు మతి చలించెను. అల్లరిజనము నొక్కదెబ్బతో నణఁచినానుగాని నిన్ను నేను సాధింపలేకపోయితిని."

రంగన్ ముఖమునకు నవ్వు దెచ్చుకొన నుద్యమించెను. కాని యతనిశ్రమ భగవంతునికెఱుక. కాళ్లు పీకుచుండెను.

"ఇట్టి అనుభవము కలెక్టర్లకు, దేశసేవికలకుఁగూడ మంచిదే. నేనేమియుఁ జింతించుటలేదు—రంగన్, నీకక్కడ కష్టముగానున్నదా?"

"లేదు, రాజీ." నిజమునకు రంగన్ముఖము చాలాదీనముగా నుండెను. అప్పుడే అతని కాలిబొటనవ్రేలిపై నింకొకరు కాలి నదుముటో సామాను వేయుటో జరిగెను. ఆనొప్పి మెదడు కెక్కెను. రంగన్ కష్టపడి దాని నోర్చుకొనెను. చివర కామహాప్మ దీయునిపారుగు దప్పించుకొని, రాజీప్రక్కకు చేరుకొనెను. ఇక్కడ కొంచెము తెఱపిగల్గి, యిట్లు మాట్లాడఁదొడంగెను.

"రాజీ, యీ ఒక్కగంటలో నాకు మనుష్యులపై రోత పుట్టినది. ఏమిటి మనదురవస్థ! మిగత ప్రపంచములోఁ బ్రయాణ మెంతసుకరము, సుఖావహము! ఇది యమయాతన. ఏబదేండ్లుగా రైళ్లుకలవుగదా. మనకు వాటిలోఁ బ్రయాణము చేయవలసినవిధము పట్టువడలేదే. పూర్వపద్ధతులు మఱచి

పోము. క్రొత్తపద్ధతులు నేర్చుకొనము. ఇక బాగుపడున దెట్లు? మనబండిచూడుము. సామానుపెట్టెవలె నున్నది. దొంగలవలె మధ్యమధ్య నీమనుష్యులు. ఈసామగ్రి నంతటిని పార్సెలుచేసి, పార్సెలుపెట్టెలో వేయఁగూడదా?"

"చాలు లేవయ్యా, మంచిమాటజెప్పినావు ! మన సామానునంతటిని గార్డున కొప్పజెప్పుటా ? మనము స్తిమితముగా ప్రయాణముసేయఁగలమా? బిడ్డ యేడ్చుచున్నది గాబట్టి, ఆబిడ్డనుగూడ పార్సెలుపెట్టెలోఁ ద్రోసివేయుదువు గాబోలు. మున్నూటయరువది రాత్రులలో నొక్క రాత్రి నిద్ర నష్టమైన నేమాయె ? టోపీపెట్టిననల్లవాఁడెల్ల, మొదటితరగతిలోఁ బ్రయాణముసేయుదొరనని మిట్టిపడును" అని మహాద్మదీయుఁడు తీవ్రముగా నధిక్షేపించెను.

రాజేశ్వరి, యీసంభాషణ విన నిచ్ఛగింపలేదు. బండిలో నొకమూల నొదిగియున్న నొకయువకునివైపు దృష్టిమరల్చెను. రంగనితో జనాంతిక మిట్లనెను.

"అదిగో, కిటికీప్రక్కన సగము నిద్రవోవుచున్నవానిఁ జూడుము."

"అతఁడే మనలను లోపలికిఁ బ్రవేశపెట్టినది."

"అతఁడే మనలను లోపలికిఁ ద్రోసినది!"

"అతనికిఁ గృతజ్ఞతఁ దెల్పుదము."

"నీయిచ్చవచ్చినట్లు. కాని, చూడుము, అతడు సి. ఐ. డి. వలెఁ దోఁచుచున్నాఁడు. నన్ను గమనింపుమని పంపిరిగాఁబోలు."

"అట్లుండదు"

"ఎందుకుండదు ? నన్ను ప్రభుత్వము లక్ష్యమందుంచుకొనియున్నదని నీవేగదా ఉదయము చెప్పితివి. ఉదయమున నతఁడు అడయారునొద్దఁ గనిపించెను. అప్పటినుస్తు వేలు. ఏటిలో నీదులాఁడి, తదనంతరము కొబ్బరిచెట్లమధ్య హాయిగా పాడుకొనుచుండెను. బాగుగా మేపఁబడు సి. ఐ. డీ. లకుఁదప్ప యితరుల కానిబ్బరముండదు."

"నిజమా?" రంగన్ ఆశ్చర్యపడెను. తనపైఁగూడ నీ చారుఁడు ప్రయోగింపఁబడెనేమో నని భయపడెను.

నిన్నుఁగూడ అతఁడు గమనించుచున్నాఁడు. అతని నిమీలితలోచనసంచారముఁ గనిపెట్టుము."

"నన్నుఁగూడనా? దుస్సాధ్యము."

"సుసాధ్యమే. ఎందుకుగాదు? నీవంటివారటు ప్రభుత్వమునకు, ఇటు ప్రజలకుఁగూడ యిష్టులుగారు. అతనిరిపోర్టుమీాద నాధారపడియున్నది నీభవిష్యత్తు. నెపన్ను అధికారముగల తంజావూరుకలెక్టరుగానుండుటో, లేక ఫలనికొండలలో సెటిల్మెంటుఆఫీసరుగా రాళ్లుగోలుచుచుండుటో."

"రాజీ, నీవేదో తెలిసిచెప్పుచున్నట్లున్నావు. నిజమగునేమో! కాని, నేను సెటిల్మెంటుఆఫీసరుగా చచ్చిపడియుండను.

దేశ మెట్టిస్థితిలోనున్నది! ఈమూఁడవతరగతివిషయము నన్నుఁ గలంచివైచినది. నాయాత్మ వేదనపడుచున్నది. బ్రిటిషురాజ్య మీారైల్వేవిధానమునకే నశింపవలయు నవసరముగలదు. ఈ ప్రయాణీకుల నిట్లు దొడ్డిలోనికి గొఱ్ఱెలనుబలెఁ ద్రోలునది ప్రభుత్వమా?"

రంగని నిజముగా అనుభవించి పల్కినమాటలవి. ఇతఁడు మేల్కొనుటను రాజీ కనిపెట్టి సంతోషించెను.

"రాజీ, నామాట నమ్ముము. ఒకొక్కప్పుడు చిన్నవిష యములును చాలా బాధించును. ఇదే, బొగ్గునలుసు కంటిలోఁ బడినట్లు."

"రంగా, పూర్వపుటుత్సాహ మింకను నీలోనున్నదని యెఱిఁగి సంతోషించుచున్నాను. మరల దేశభక్తుఁడవయ్యె దవు. ఆమనిషినిఁ బిలిచి, కృతజ్ఞతఁ దెల్పుము. వానిసంభాషణఁ బట్టి వానిగుట్టు నరయుదము."

"అట్లేచేసెదను."

"అతఁడు గూఢచారుఁడాయెనా, మనప్రక్కకువచ్చి మనల గమనింపఁగల్గుటకై కిటికీవద్ద తనస్థానమును వదలు కొనునుగూడ. ఆమాత్రము చేయఁడా, సుఖమైన తనకూటికి?"

"పాపపుకూటికనుము"

రంగన్ మెల్లగా మూలుచుండెను. అతనికన్నులఁ గోప ముండెను. గొంతు గాద్గదుచుండెను. ముఖమునఁ జెమట గ్రమ్మెను.

బోటుమెయిలు అతివేగముగా గంట కరువదిమైళ్ల చొప్పునఁ బరువిడుచుండెను. ప్రేమోత్ప్రేరితయగుచిలువ చెలువుగట్టునందుబలె, రైలు కమ్ములపై నతిలాఘవముగా సంచ రించెను.

"ట్రాంక్విబారు అనుటతోడనే బుషికల్పుఁడు కందన్ నాకు స్మరణకు వచ్చుచున్నాఁడు. కందన్ దేశాంతరమందు జనించినట్లు జ్ఞప్తి. ఐనను, ట్రాంక్విబారు అతని పూర్వికులజన్మ స్థానమని తలఁచెద."

తలవనితలంపుగా రాజేశ్వరి కందన్ ప్రస్తావనఁదెచ్చుట రంగస్వామిని చలింపఁజేసెను. రాజేశ్వరియు నాయవస్థం గ్రహించెను.

"రంగా, కందన్ జీవిత మద్భుతముగదా. ఈ ప్రపంచ మున కనువైనమనిషిగాదు. ఎట్టిత్యాగము! నీవలె నతఁడును ఐ. సి. యస్. అయి రాజభోగము లనుభవింపఁదగియుండెను. కాని సర్వము నైచ్ఛికముగా త్యజించె. అట్టిత్యాగమున కెవరు సమర్థులు? ఆతఁ డిపు డిక్కడ నేమిసేయుచున్నాఁడో నీకుఁ దెలియునా?"

రంగన్ జవా బొసఁగ లేదు అతనిమనస్సు బోటుమెయి లునకన్న వేగముగా పరిభ్రమించు చుండెను. రాజేశ్వరి యింకను జెప్పసాగెను. "అప్పుడు కందన్ నాకొక లేఖవ్రాసెను. ప్రేమ వలనఁ గృశించినవాఁడై చివరకు తనజీవితమునకు దేశసేవయే పరమప్రయోజనముగాఁ జేయ నెంచినట్లు తెలిపెను. శాంతి తొల్కాడు నతనిముఖము నాకా లేఖజదువఁగ నేకనులఁగ ట్టెను. ఇంద్రియముల మెల్లగా జయించుచున్న యాయాత్మ తేజము నాహృదయమును వెలిఁగించెను. తమిళ దేశమునకువచ్చి, స్వదేశీ యుల కుపకృతిసేయుచు జీవితమును ధన్యమొనర్తునని నాకు వ్రాసెను. బొంబాయిలో నన్నుఁ గలిసికొను ననుకొంటిని. కాని అట్లతఁడు సేయలేదు. ఏమి రంగా, నీవు నన్ను వినునట్లు లేదు. అవును, పాపము, మొదటితరగతిబండిలో నుండవలసినవాఁడవు. నిద్రవచ్చుచున్నదా?" "లేదు, రాజీ! కందన్ పేరువినఁగానే నా మనస్సు విస్మృతపథమున సంచరింపఁబోయెను. కందన్ నిజ ముగా గొప్పవాఁడు. అందఱికుండ దట్టిత్యాగదీక్ష. నాకు లేదు. కార్యవాది యాతఁడు. నవీనమార్గముల సంచరించి, లోకము నకుఁ ద్రోవసూపఁగలఁడు. వర్షాకాలపునీటిమబ్బువలె స్వాభా వికముగా పరహితవ్రతుఁడు."

"నీవు కందను ప్రశంససేయుట నాకెంతయు నాహ్లాద కరము. నిజముగా నిది హృదయపరివర్తనం జాటుచున్నది. నాకుఁ బ్రీతిఁగొల్పిన పూర్వపురంగస్వామి వేసుమా, కలెక్టర వయ్యెను!"

రంగన్ హృదయమున వేడినెత్తురు ప్రవహించెను. రాజేశ్వరి విశాలనయనములు మఱింత విశాలములయ్యెను.

"రాజీ, నీవచన మమోఘము. నేను చరితార్థుఁడను. మఱి, కందన్ గుఱించి నేనెఱింగిన దిఁకఁ గొంత కలదు. వినిన నీవును సంతసిల్లెదవు. కందన్ యీజిల్లాలోనెల్ల శ్రీమంతుని యింటఁ బుట్టినవాఁడు. కాని యిప్పు డావంశీయులు నిరుపేదలై యున్నారు. దేనులపరిపాలనమున, వీరు గ్రామమునకుఁ బెద్దలై వృద్ధిగాంచిరి. భూమి బ్రిటిషువారికి మాఱుటతో క్షయించిరి. అవును, రాజీ, బ్రిటిషురాజ్యమున గ్రామములు క్షయించినవి. జిల్లాలోనెల్ల బాగుపడునది కలెక్టరొక్కఁడే. మిగిలినవారిక్షీణత వీనియభివృద్ధికిఁ దోడ్పడును"

"కందన్ కథ యేమి?"

"నాకుఁ దెలిసిన దింతయే"

"కందన్ తండ్రి మహాత్మునకు బాసటయై దక్షిణాఫ్రికాలోఁ బనిచేసెను. అందువలన నేగావలయు కందనున కట్టి దేశభక్తి."

"నిన్ను వలచి నిరాశఁజెందుటవలన నని నాతలంపు. పూర్వము నీవాతని నిట్లుగ్గడించి యెఱుఁగవు. స్వార్థపరమగు ప్రేమ కవకాశముజాఱినందున స్వార్థమున కతీతమైనప్రేమ అతని కలవడినది. దేశమాతను ప్రేమించి, తదారాధనకుఁ

గడంగినాఁడు. నీవును నన్ను నిరాకరింతువేని నాకును దేశ భక్తునిచావు నిశ్చయమనుకొందును."

"దేశముకొఱకైన నిన్ను నిరాకరింపఁగలుగుధైర్యము నాకుండిన బాగుండును."

రాజీచెక్కులు గగుర్పొడిచెను.

కొంచెము నిదానించి భావమును మరలించుకొని యిట్లనెను.

"సేవాసక్తి వంశపారంపర్యముగాగూడ వచ్చును. గ్రామము నేలినవాని వంశీయుఁ డెన్నిమాఱుబాట్లందినను, జనముపై నభిమానమును పూర్తిగా విసర్జింపఁజాలఁడు."

రంగఁ చేతులు నలుపుకొనెను.

"దేశాంతరమున జన్మించినకందఁ ప్రకృతావస్థలో మాతృదేశమగుభారతభూమికి సేవసేయుట తగియున్నది."

"రాజీ, కందఁ దేశాంతరమున జన్మించినవాఁడు కాఁడు. ఇతనితండ్రిచరిత్ర అద్భుతమైనది. కందఁతల్లి, బిడ్డ ఆఱునెలలవాఁడైనప్పుడే పరలోకమేఁగెను. కందఁ మూఁడేండ్లవాఁడుగా నుండగా, తండ్రి నేటాలునకుఁ బాఱిపోయెను. ఆవిధముగా కందఁ దేశాంతరమునఁ బెరిగెను."

"విచిత్రము విధివిలాసము. కాని నిగూఢ కారణ మేదో ప్రకృతియం దంతర్లీనమై యుండును. కందఁ నిజరూపును నేను ఆస్పత్రులో నెఱుఁగనైతిని."

రంగఁడు తత్తరపడసాగెను. అజ్ఞాతముగా పెదవిఁగొఱుకుకొనెను. "ఎందుకురంగా, కలవరపడుచున్నావు. పూర్వపుస్మరంతులవలనఁ బొంపిరిపోవుచున్నావా?" రాజేశ్వరి చూపుచేత నే అతనిహృదయమును పరిశీలించెను. మఱి దృఢచిత్తయై యిట్లు చెప్పెను. "రంగా, నన్నుఁగూర్చి బెగడొందకుము. నాజీవితము నన్యునిపాలుసేయు నవసరముతప్పినది. ప్రకృతము దేశమాత కధీనమైనది. విషయలౌల్యమును విడనాడినది. నాప్రేమ అఖిల ప్రపంచగతమైనది. స్వాతంత్ర్యసంపాదనమునకై బ్రహ్మచర్య దీక్ష వహించితిని. నాశక్తికిఁ బరమప్రయోజనముదొరకినది. స్వార్థనిరాకృతివలనఁ బరోపకారపారీణత—ఇదియే సుమా సన్యాసులమహానీయతకుఁ బునాది. భగవానుఁ డనుగ్రహించి నా కీరహస్యము నుపదేశించినాఁడు. నాహృదయమునకు నైర్మల్య మాపాదించినాఁడు. చరితార్థనైతిని."

ఈవచనధోరణికి రంగఁడు విస్మయమందెను. రాజేశ్వరి నైతికస్వరూప మాతనికి గోచరించెను. ఆమెముఖముం గని, తన్నుద్ధరింపఁగలమహాత్తుగలదని గుర్తించెను. కాని తనఆశలన్నియు వమ్మయ్యెననిగూడ నిశ్చయించుకొనెను.

## 3

రంగస్వామి యింకను నిల్చుకొనియే యుండెను. అరగంటలో నతనిసారమంతయు మాయమైనట్లుండెను. కాని

రాజేశ్వరికొంత కెంతటికైన హృదయమును భద్రపఱచు కొనెను.

"రంగా, కిటికీమూల నామనిషి మనపై నింకను దృష్టి నిల్పియున్నాఁడు."

"రాజీ, నీసౌందర్యమును తిలకించుచున్నాఁడేమో! చక్కనిస్త్రీ నెందఱు చూడరు?"

"ఇతరులవెడగుచూపునకును, ఇతనితీక్ష్ణదృష్టికిని భేదము తెలియనిదానను గాను. లేనిపోని కారణములు కల్పింపఁబోకుము. మనలను రైలెక్కించిన యలవానికిఁ గృతజ్ఞత దెల్పుము. లేదా, నేనే అట్లు చేసెదను."

రాజేశ్వరి ఆజ్ఞ ననుసరించి వెంటనే రంగన్ ఆవంకకుఁ గదలెను.

"అయ్యా మేము చోటునకై అవస్థపడుచుండఁగా, మాకు సహాయపడినందుల కెంతయుఁ గృతజ్ఞుఁడను. మీరును మాతోడి ప్రయాణము సేయుట సంతోషకరము."

పొన్నన్ నిర్లక్ష్యముగా తలనాడించి సమ్మతిఁ దెలిపెను; కాని కూర్చున్న చోటును దలఁగ నిచ్చగింపలేదు. "మొదటి తరగతిలోఁ బోవలసినవారు మూఁడవతరగతికివచ్చినపుడా మాత్రముసేయు టొకగొప్పయా?"

ఇతనివిశేషజ్ఞానమునకు రంగన్ చకితుఁడాయెను.

ఫ్రాన్సిస్ నెమ్మదిగా తనధోరణి సాగించెను.

"మూడవతరగతిబండ్లలో నెప్పుడును త్రోసి త్రొక్కుడే. ప్రభుత్వమువారి కిది స్వల్పవిషయము. మాకుఁ బ్రాణసంకటము. వారు పూనుకొనిన నిది చక్కఁబడఁగలదు. మొదలు, శాసనసభలలోఁ బ్రజలప్రతినిధుల మనువారు ప్రయత్నింపఁ గూడదా? కాని వారికేమి? ప్రజలఖర్చున మొదటితరగతిలోఁ బ్రయాణముసేయుదురు. తెలియనివిషయమునకై వారేమి ప్రయత్నింపఁగలరు?"

"అవునండీ, యీఘోర మెక్కడను లేదు. చూడుడు, రెండు మూఁడవతరగతిటిక్కెట్లు గొనితెచ్చుటకు నామెడ విఱిగినది. మణికట్టు బెణికినది. మీరు తోడ్పడనియెడల రైలు నెక్కుటయే దుర్లభమైయుండెడిది." "కాని మీవంటివారు స్త్రీలను వెంటఁబెట్టుకొని, మూఁడవతరగతి విలాసము ననుభవింపఁగోరునప్పుడు అరగంట ముందఱగానైన రావలసినది."

రంగన్ తనకథయావత్తుఁ జెప్ప నుత్సహించెను. కాని రాజేశ్వరి పక్ష్మసంకోచ మాతని వారించెను.

"ఈవిధముగా నెన్నాళ్లు సాగఁగలదు? కాంగ్రెసుగోల వలనఁగాదుగాని, ప్రజల నిట్లు నిరాకృతిసేయుటవలననే బ్రిటిషు ప్రభుత్వము కూలిపోవును."

ఫ్రాన్సిస్ అవసరమునుగ్రహించి ఉపన్యాస మారంభిం

"ఈ రైలుక్షోభ అప్పటి కెంతదుర్భరమైనను తొందరలోఁ దీఱిపోవును. విస్మృతమగును. కాని, నిరంతర మింకొక క్షోభ గలదు. ప్రభుత్వనిరాదరణకు లక్ష్యము, ప్రజలదౌర్భాగ్యమున కుదాహరణము, వారిదారిద్ర్యము. రేపటికన్న మెట్లు వచ్చునని భార్యాబిడ్డలు ప్రతిదినమును పరితపించుచున్నారు. కష్టపడి పనిచేయఁగలవారికి పనిలేదుగదా. సూర్యోదయము మొదలు సూర్యాస్తమయమువఱకుఁ గష్టించినను పొట్టనిండదాయె. పశువులు, చెట్లు మేలుగదా. భూమి వాటినిఁ బోషించును. భారతజనమునకు జన్మసిద్ధము దారిద్ర్యము. ఆమరణాంతము కాయకష్టము. బిడ్డలపరిదేవనకుఁ దల్లుల నిస్సహాయతకుం గడగానరాదు. కోట్లప్రజల యీఘోషతగిలి, బ్రిటిషుప్రభుత్వము కూలిపోక తప్పదు."

పొన్నకా రంగస్వామికన్న రాజేశ్వరి నుద్దేశించియే యీయుపన్యాసముం గావించెను. ఇరువురును వీనిమాటలు విని విస్మయభరితులైరి. బీదజనమునెడ నితనిసానుభూతిం గని రాజేశ్వరిహృదయము కరఁగెను.

అపూర్వహర్షముతో "అయ్యా మీ పేరేమి? వయస్సునకు మించిన శేముషీమతులు. చక్కఁగాఁ జెప్పితిరి మనకడగండ్లను" అని అడిగెను.

"దారిద్ర్యముచే మట్టింపఁబడిన కోట్లకొలఁదిజనములో నేనొకండను."

"పేరండీ?"

"పొన్ను స్వామి. పెద్దలు 'పొన్ను' అని పిలిచెదరు. మాది తంజావూరుజిల్లా. పూర్వీకులు సంపన్నులట. ఇప్పుడు దరిద్రులము. నేను బాల్యముననే మదరాసునకుఁ బాఱిపోతిని. పట్టణపుపాట్లు కొన్నాళ్లుపడితిని. చివరకు మహాత్మునియుప దేశము నాలకించితిని. మదరాసు వదలితిని. ట్రాంక్విబారున కేఁగుచున్నాను."

"ట్రాంక్విబారునకా? రాజేశ్వరి రంగను లిర్వురు నొక్కటిగ నడిగిరి.

"అవును, ట్రాంక్విబారునకు. మఱి మదరాసుముఖము పెట్టను."

"అయ్యా, క్షమింపుడు. మిమ్మొదినము ఉదయమున నడయారునదిదగ్గఱఁ జూచినట్లున్నది."

"మీరక్కడుంటిరా? ఉదయమున నేను బహిఃప్రపంచమును మఱచియుంటిని. అడయారునుచూచి, కావేరీతీరమున నాబాల్యమును స్మరింపుచుంటిని.

ఈపదేండ్లుగా నాకప్పుడప్పు డూఱటగఱపుచుండిన అడయారునొద్ద వీడ్కోలుగై కొంటిని. అందువలననే కొబ్బరిచెట్ల మధ్యఁ బాడుకొనుచుంటిని."

"ఇపుడు మీరు ట్రాంక్విబారున కేఁగుచున్నారా?"

"అవును. మహాత్ముని ఆదేశమునను సరించితిని. నాకక్కడ బంధువొకఁడు కలఁడు. ఉత్కృష్టపురుషుఁడు. త్యాగధనుఁడు. కలెక్టరుపదవినిఁ గాలఁదన్ని దేశీయుల కాళ్లమడుగు లొత్తు చున్నాఁడు. గ్రామోద్ధరణ మతనికిఁ బ్రియము. ట్రాంక్విబారులో మద్యపాననిషేధ ప్రచారము సేయుచున్నాఁడట. నే నాతనికడ కేఁగుచున్నాను."

"అతని పేరు?" రాజేశ్వరి యడిగెను.

"కందర్"

"అహో కందర్!"

"అమ్మా, మీ కాతని నెట్లు తెలియును ? నే నాతని నింతవఱకు చూచియుండలేదు. అంద ఱతనిఁ గొనియాడు దురు. మాబంధుత్వము గర్వకారణము"

"కందర్ మాకుఁ జిరపరిచితుఁడు. ఆక్స్ఫర్డునఁ గలిసి చదివితిమి. అతనికడకు మమ్ముఁ దీసికొనిపొమ్ము. మేమును ట్రాంక్విబారుపోవుచున్నాము."

"మీరును ట్రాంక్విబారునకా? అదృష్టము. రేపటినుండి నేను క్రొత్తదారిని ద్రొక్కెదను."

రాజేశ్వరి తనసంశయములు నిరాధారములని నిష్కర్ష జేసికొనెను. ఆరాత్రియంతయు వారుముువ్వురు కనుమూయ లేదు. దేశసేవనుగూర్చి యెన్నియోసంగతులు ముచ్చటించు

కొనిరి. సి. ఐ. డి. స్మరంతియే లేదు. సివిలియను మెల్లఁగా మూలు చుండెను.

బోటుమెయిలు అతివేగముగా పరువెత్తుచు, పొగ నెగఁజిమ్ముచుండెను. బొగ్గురేణు వొకటి గాలికివచ్చి రాజేశ్వరికంటఁబడియెను. అశ్రుబిందువులు ముత్తెములభాతి గండస్థలముల జాలువాఱెను. రంగఁడు, పొన్ననులు విభ్రాంతులైరి. రాజేశ్వరి మాటలుడక్కి మేనువ్రాల్చెను.



# తొమ్మిదవ ప్రకరణము.



## రైలుసంఘట్టనము.

ఆకూర్కురుస్టేషనులో మొదటిచెక్క కివతల నెం 13 రు రైలు నిలిచి కూతవేయుచుండెను. సుందరము ఒక్కగెంతు వేసి ఆఫీసుగది చేరెను. ఇంజినుదీపపు వెలుతురుపడి కమ్ములు ధగధగ మెఱయుచుండెను. కాడవంచి, చెక్కవాల్చుటకు సుందరము తానే పరుగెత్తిపోఁబోఁగా, కరియన్న తనవలెనే చిత్తఱపోయి పరుగెత్తుకొనివచ్చెను. సుందరము మండిపోయెను. "ఏమిరా గాడిదెకొడుకా, ఇంతవఱ కెక్కడ నిద్రపోవుచున్నావు?"

"గాడిదెకొడుకును గావచ్చుగాని నిద్రమాత్రము పోలేదు. ఇంటిదగ్గఱ కొంచెము తిండినిఁగూర్చి తగవువచ్చెను. మగఁడు పెండ్లామనినఁ దగవు రాకుండునా? తిండిఁబెట్టుమని దానిని నాలుగుతిట్టి కొట్టితిని. అందుకు కొంచెము తడవైనది. ఈలోపుగా నేమో మునిఁగిపోయినట్లు, గంటకాకపూర్వమే నెం 13 రు రైలు పరుగెత్తుకొనివచ్చినది. తప్పత్రాఁగినగాడిదెకొడుకు లీయింజినుడ్రైవర్లు, మసిబొగ్గుస్వరూపములు, గంట తెలియక గడబిడచేసెదరు. వీరికి బుద్ధిరావలె."

కరియప్ప త్రాగియున్నందునను, ఇతరపోకడలవలన నుడుకెత్తియున్నందునను మాటలమఱా చూపించెను.

సుందరమునకుమాత్ర మొకవిషయమునఁ గుతూహలము గల్గెను.

ఆప్రమాదావస్థలోసైతమీ ప్రశ్న అతనినోట వెలువడెను. "తిండిఁబెట్టుమని పెండ్లామునుకొట్టుటా? అది సాధ్యమేనా, కరియా!" రైలోకమూల చెవులు గింగురువోవునట్లు కూతవేయుచుండెను. అందువలన నన్నమును తొందరగా పెట్టించుకొనుటకు కరియప్ప మంత్ర మేమిటో కన్గొనుటకు పూర్ణావకాశము లేకపోయెను.

"కరియా, కాడవంచి, పాయింట్లు సరిగానున్నవో చూడు." రెండవ లైనుమీద ఖాళీపెట్టెల మట్టిబండి యొకటి నిలిచియుండెను.

కరియప్ప తూలుచు, వ్రాలుచు, కాడవంచుటకుఁ బోవుచుండెను. స్టేషనుమాస్టరిదిచూచి, "కరియా, కరియా, త్రాగినట్లున్నావు. జాగ్రత్త, రైలుక్రిందపడి చచ్చేవు. ముందఱపోయి పాయింట్లు సరిగానున్నవో చూడు."

"త్రాగినదెవరు? కరియప్ప గాఁడు. ఇంజినుడ్రైవరు. నిజము." అని కరియప్ప గట్టిగా నఱచుచు చెక్కకాడల సమీపించెను. "పాయింట్లు—పాయింట్లకేమి, యీస్టేషనులో లోపములేదు" అనుచు, కాడను చేతఁబట్టెను. "రావే లంజా,

దానితలవిఱుగఁగొట్టినట్లే నీపండ్లూడఁగొట్టెదను. ఈరైలులో చావు చాకిరి, క్షణమైన నింటిసుఖము లేదు."

చెక్కవ్రాలఁగానే, నెం 13 రు రైలు కీచుమని కూత వేసి సతసర రానారంభించెను.

సుందర మింకను గదితాళమైనఁ దీలేదు. ఇంకను తన కోటు, జెండా అందుకొననైన లేదు. ఢమ్మని ఇంజినులు కొట్టుకొన్న ధ్వనియాయెను. నెం 13 రు రైలు రెండవలైనుమీఁద నున్న మట్టిబండిని డీకొట్టెను.

సుందరము నిర్వాఁజబోయెను.

దైవవశాత్తునఁ, బ్రాణనష్టముగల్గలేదు. ఒక్కమాఱు, ఆచలివేళ నందఱికిఁ గదలికకల్గెను. నెం 13 రు రైలులో ప్రయాణీకు లట్టేలేరు. చొక్కలింగము మొదలియారు, అతని పరివారమే ప్రధానము. మొదలియారు కేవలము ప్రయాణీకుఁడేగాదు. తాను వేయించినలైనుగదా, రైలు నొకమాఱు నడపఁగూడదా యని, డ్రైవరును ప్రక్కన నిలువఁబెట్టి తానే ఇంజిను నడిపించెను. అంతటికిని పర్యవసానము ఈ డీకొట్టుకొనుట.

సరస్వతి ఆచారమును తొలఁగఁద్రోసి, వెంటనే స్టేషనునకు పరుగెత్తుకొనివచ్చెను. గృహమున నెన్నిసంఘర్షణాలనైన నోర్చినదిగాని, యీరైళ్లసంఘర్షణ కదలిపోయెను. ప్లాటు

ఘారముమీఁదికివచ్చిన సరస్వతి ముఖమున చంద్రునందుకళంకమువలె దిగులు ప్రత్యక్షమగుచుండెను.

సంఘర్షణ ఆసాయంత్రమందంతర్లీనమైయుండెను. ఇంట బయలుదేరిన సుడిగాలి బయలు నెగఁజిమ్ముకొనిపోయినదిగదా యని సుందరము సమాశ్వసిల్లెను. జీవితమును భగ్నముసేయ వచ్చినసుడి ఉక్కుబండి నడలించిపోయినదిగదా యని హర్షించెను. అప్పుడప్పుడే రేకిడుచున్న యువజీవనములకుగాక పనికి మాలిన రైలుబండ్లకుమాత్రమే పాటుదప్పినది. ఆహా దైవానుగ్రహము!

సుందరము సరస్వతు లిర్వురు మొదటిసారి తమహృదయముల, నేకముఖమొనర్చిరి. ప్రమాదముఁ దప్పించిన భగవానునకు భక్తిపూర్వకముగా మ్రొక్కులిడిరి.

## 2

క్రొత్తలైనుమీఁద రైళ్లు డీకొనుట కిదియే మొదటిసారి. సుందరమునకును మొదటి అనుభవమే. దీనినిజూచిన సరస్వతి కొక్కమాఱుగా భయభక్తు లుప్పతిల్లెను.

నూతనజీవనమున కిది శుభోదయావసరముగా గన్పట్టెను. పరిసరావస్థలం దామె కాసక్తి పొడసూపెను. భూగర్భమును వీడి వెలికివచ్చునంతస్రోతసివలె నామె తనయేకాంతవాసము నుండి నిర్గమించెను. లోకానుభవమువలనఁ బ్రేమకుఁ బరిపూర్ణత్వము నాపాదింపఁగోరెను.

చొక్కలింగము మొదలియారు విస్మయపూరితుఁడై సరస్వతీసౌందర్య మవలోకించుచుండెను.

కరియన్ తానొక ప్రయాణీకుఁడై నటుల బిక్కమొగము వేసెను. ఈచెక్కవ్రాల్చు నిర్భాగ్యతకుతోడుగా, రైలు ప్రమాదమునకై తనపై కేసువచ్చునేమోనని అడలసాగెను. తన పిన తండ్రివలెనే, తానును దేశమునుండి పాఱిపోదునా యని మొదట నాలోచించెను. అతనికిని విషమవయస్సు ఇరువది నాల్గవయేడు దఱియుచుండెను. రైలువిషయమై యేత్రిప్పలు వచ్చినను బాధ్యత తనదని యెవరో యితనికి బోధించియుండిరి.

కందన్ గూడ అచ్చటి కేతెంచెను. అతఁడు మామూలుగా ఆరుబయటనే యిసుకతిప్పలమీఁదఁ గొబ్బరిచెట్లనీడను శయనించువాఁడు. ప్రక్కన చిన్న కాలువ మర్మరధ్వనియు, నిరాతంకముగా వాయుసంచారమును అతనికి హాయినిద్ర నొడఁగూర్చును. పగలంతయు దేశమునకై పడుకష్టమునకిదియే స్వార్థమాపరమావధి.

కామాక్షియు, మార్గమధ్యమున కరియన్ వికారములఁ గని విభీతరాలై దారిపొడుగునఁ జెమర్చుచు, పరువెత్తుకొని వచ్చినదగుట స్టేషనునందు ప్రత్యక్షమాయెను. సరస్వతి ప్రక్కనఁ జేరి, రక్షితరాలైన ట్లుపశాంతిఁ గనుచుండెను. అందఱిను రక్షించువాఁడువలె నుద్దండుఁడు చొక్కలింగ మక్కడనేయుండెను.

ఈలోపల గ్రామమంతయు స్టేషనునకు లేచివచ్చెను. రైల్వే డీకొట్టినవన్న నావింతనుజూచుట కెల్లరును గుతూహలులే. కరియప్పె పెండ్లామును సగము స్మృతిదప్పినదానినిఁ గూడ నచ్చటికిఁ దెచ్చిరి. వెంటనే ప్రథమచికిత్సచేయవలసియుండెను. ఆపనికి సరస్వతి పూనుకొనెను.

ఈగగ్గోలునుండి వెలికిఁబడి తెలివిఁదెచ్చుకొనుటకు మొదటివాఁడు సుందరమే. మొదలియారు నెం 13 రు బండిలో వచ్చు టాతనికాశ్చర్యము గల్గించెను.

"ఏమండీ, మీరు నెం 9 రు రైలులో మాయవరం బోతిరిగదా, ఇపు డీరైలులో నెట్లువచ్చితిరి?"

"అవును, నేనుపోయినమనిషి అచ్చట లేకుండుటచే నతఁడున్న కారయికాలునకుఁ దిన్నగా కారులోఁబోతిని. నేను రైలులోఁ బ్రయాణముసేయుచున్నను, నాకారు ప్రక్కన రోడ్డుపై ననుసరించివచ్చుచుండును. కారయికాలులో నొక గంటవినోదించి, ట్రాంక్విబారునకు కారు నడపితిని. నేనక్కడకు వచ్చుసరికి నెం 13 రు రైలు బయలుదేరఁబోవుచుండెను."

"మీరు రైలునడపితిరా?"

"అవును, కాని డ్రైవరు ప్రక్కనేయుండెను. ఐదు నిమిషములలో నైదుమైళ్లుదాటితిమి. ఆపరుగుమజా యేమి చెప్పను! చివర కిట్లగునని ఊహింపలేదు. వెధవ కరియప్పెలోప మిది. మట్టిబుద్ధిగాఁడు. ఎప్పుడో వానిఁ జావమోదెదను. ఈ

విషయమై మీ కేమి ప్రమాదముండదనుకొనెదను. ఇంజిను త్రుప్పుకొంత ఊరకే వదలినది. సుందరముగారూ, యెట్లో దీనిని సర్ది వేయండి."

"మీరింత చెప్పవలెనా? మీగొప్పబుద్ధి నింతస్వల్పవిషయములంగూర్చి శ్రమ పెట్టనక్కఱలేదు. చక్రములున్న చోట సంఘర్షణ లేకుండునా? ప్రకృతిసిద్ధ మది." చొక్కలింగము చెవులలో సుందర మీకలువాయి వేదాంతమును సందడించెను.

మొదలియారు తనపరివారము చేతులందున్న రూపాయలసంచులవైపు వ్రేలుసూపెను. సుందరము కన్నులు గోరగించెను.

"మీకెందుకు శ్రమ. నేను దీనిని భద్రపెట్టెదను. ఉదయమువఱకు ఫరవాలేదు."

సుందరము డబ్బుచూడఁగానే తనదైనట్లు పొంగిపోయి, సగర్వముగా సరస్వతివైపు మరలెను.

చొక్కలింగము సరస్వతింగూర్చి చకచకలాడుచుండెను. ఇంద్రియలోలుఁడు మనిషి. ఇంత చక్కనిస్త్రీ ఇహామందేయుండెనుగదా, దొరకకపోదని ఆశ. తప్పని లోలోపల సద్బుద్ధి గొణుఁగుచుండెను.

ఆపదలో సర్వము నిట్టనిలుచుకొనునట్లు సరస్వతి పూర్ణద్రాఘిష్ఠసౌందర్యశాలినియై చెలువారుచుండెను. వరియన్నము

దిను మానవాంగన యనుటకన్న, బీయూషాస్వాదిని దివ్యాంగనయో యనునట్లుండెను.

సుందరము పరిస్థితి గ్రహించెను. మహాకసంఘర్షణను మొదటనే మట్టువెట్టెను. స్టేషనుగదిలోనికి మొదలియారునకు దారిచూపెను. "మొదలియారుగారూ, రండి లోపలికి. బయట చాల చలిగానున్నది. అందులో మీకు ప్రయాణపుబడలిక, ఈరైలు అఘోరము. మనము గదిలో మాట్లాడవచ్చును. మీరు మేజామీఁదనే పరుండినను సరే. నేను మాయవరమునకు టెలిఫోను చేసి, సర్వము చక్కఁజేసెదను. కరియా సంచులు ఇనుపపెట్టెఁజేర్చు."

మొదలియారునకు నిజముగా నిద్రవచ్చుచుండెను. సాయంత్రపువినోదములమహిమ, పూర్ణముగా తలకెక్కెను. కారయికాలు ఫ్రెంచిభూమి. అచ్చట మద్యములు చాలచవుక. తనసీడను కారులో మొదలియారు వాయువేగమునఁ బరువెత్తుచున్నప్పుడే, అక్కడ కొంచెముసేవించవచ్చుననియు లోన భావమంకురించెను. బ్రిటిషుఇండియా గొడవలను విస్మరింపవచ్చును. నిజమునకు మొదలియారు ఒక్కగంటకాల మక్కడ హాయిగాంచెను. మార్వారీవాఁడితనికిఁ గోరిన మూడువేల కెక్కుడుగా నైదువేలు అప్పిచ్చెను. పానమత్తుఁడగు నితనిచేఁ బదివేలకు ప్రోనోటు వ్రాయించుకొనెను.

ఇంతకుఁ బర్యవసానము చొక్కలింగ మిప్పుడు అక్కూరుస్టేషనుగదిలో మేజాపై సుఖముగా శయనించెను.

వెంటనే నిద్రించి, గుఱకవెట్టనారంభించెను. అవును, ధనముచే మదించినవారును ఉక్కిరిబిక్కిరిమని నిద్రవోవుదురా! సుందరము గదికి బయటఁ దాళమువేసి మఱింతభద్రముసేసికొని సరస్వతినిఁ గలిసికొనెను. సరస్వతి కామాక్షిసాహాయ్యముతో కరియర్ పెండ్లామున కింకనుఁ జికిత్సనేయుచుండెను. స్టేషను ఆవరణములో గుమిగూడినజనమును తిన్నగా సుందరము బయటికిఁ బంపివేసి రైళ్లసంఘర్షణోదంతమునుఁ గడిగివైచునుపాయ మాలోచింపసాగెను.

# పదియవ ప్రకరణము

---

## పరశురామప్రీతి

### 1

సరస్వతి భర్తను సమీపించి, "మీరు భోజనముసేయ లేదనుసంగతి మఱచినారా?" యనెను.

"మఱువలేదు. మన కీరోజు ఉపవాసము. నేను దేశ దేశములుదిరిగితిని. కాని యింతచలి, యింతగగ్గోలు యే రాత్రియు ననుభవించియుండలేదు."

"ఈరోజున నేదో గొప్పమార్పు మనకుఁ గల్గనున్నదని నాకంతర్వాణి చెప్పుచున్నది."

సరస్వతికంఠమున నపూర్వమగుమధురిమ తొలుకుచుండెను. ఆమెమూర్తి ఐహికసంసక్తత డిందువడిన దివ్యజ్యోతివలె నొప్పారెను.

అచటి కనతిదూరమునఁ గొబ్బరిచెట్లమధ్య శయనించియున్న కందనునకు నిద్ర రాలేదు. స్టేషనునకువచ్చి కరియన భార్య కుపచారములొనర్చుచున్న యాతని సరస్వతి తిలకించెను.

"ఎవరండీ అతఁడు, కరియర్ పెండ్లామున కుపచరించుచున్నాఁడు. ఉన్నతవంశజుఁడుగా చూపట్టును. కరియర్ బంధువుగా తోఁపఁడు" అని సరస్వతి భర్త నడిగెను.

"అతఁడు కరియర్ దాయాది. పోర్ట్రెయినను కరియర్ గొప్పవంశమువాఁడు. కందర్ జీవితము విచిత్రము. నవలలందును ఇట్టిది చదివియుండవు. అతఁడు నేటాలులో పుట్టెను. బెలియోలులోఁ జదివెను."

"బెలియోలు! ఆక్సుఫర్డులోనా?"

"అవును ఐ. సి. యస్. పరీక్షయిచ్చెను. కాని ఉద్యోగము నిరాకరించెను. మాతృదేశ మతని వేఁటాకందుకు త్వరగొల్పెను. నీకును ఆఘోరణి కొంతకలదుగదా, వార్తాపత్రికల పుణ్యమన. అతఁ డిక్కడకువచ్చి యీమూర్ఖజనము నేదో గొప్పవారిజేయ నుద్యమించియున్నాఁడు. ఎంతతోమినను కుక్క గుఱ్ఱమగునా?"

"కాని కుక్కయైనను శుభ్రపడవచ్చునుగదా."

"ఏమి ప్రయోజనము! తిరిగి పెంటకుప్పలోఁ దొర్లాడుచు పరుంటకా?"

"అయినను కందర్ తలపెట్టినకార్యము మహత్తరమైనది. అతనిముఖమును చూడుము. ఔదార్యము మూర్తీభవించియున్నది."

"గ్రామజనులకొఱ కాతఁడు డబ్బును నీటివలె వ్యయ మొనర్చుచున్నాఁడు. అకార్యులలోఁ గల్లంగడి నెత్తివేయించ వలెనని అతనిసంకల్పము. ప్రచారమువలనను, పికెటింగువల నను నెలరోజులుగా బ్రయత్నించుచున్నాఁడు. తప్పద్రాఁగువారి కీహితోక్తులు నచ్చునా?"

సుందరము కొంచెము గొంతుక సవరించుకొని యింకను యిట్లనెను.—"మొదలియారు ఇతని ముక్కలుసేయ నిశ్చ యించినాఁడు. తనయేలుబడిలో శాంతికి భంగముకల్గించుద్రోహి యని అతనివాదన. మొదలియారు సామాన్యుఁడా? రెండు వేలయెకరములు గలభూస్వామి. నెలరోజులలో మనయెదుట నే చరిత్ర జరుగనున్నది. కందన్ చెఱకంపఁబడును. పాపము. మొదలియా రీసాయంత్రము మాయవరములో డిప్టీకలెక్ట రుతో మాట్లాడినాఁడఁట. అతనిమాట కీడబ్బుసంచులసాహా య్యముగూడ కలదుగదా. ఈరోజులలో డబ్బునకున్న ఆత్మశక్తి మఱి దేనికున్నది?" మొదలియారు టిక్కెటుగదిలో గుఱక పెట్టుచు నిద్రపోవుచుండెను. ఆమంజుఘోష బయటికిని విన వచ్చుచుండెను. 300 పుట్ల ధాన్యస్వామి యని, సుందరము శ్రద్ధతో నాధ్వని నాలకించెను.

సరస్వతిమనసున కందన్ మహానుభావత తిరముగా పద మిడెను. ఆదేశభక్తుని, త్యాగరూపునిఁ బలుకరింపవలెనని బుద్ధి పుట్టెను.

"అతని నొక్కమారు పిలువండి. మీకుఁ దెలిసినవాఁడే గదా."

"కొద్దిగా తెలియును. ఈదినము ఉదయమే ఒకఖద్దరు పార్సెలు, డజను రాట్నములు రైలులో వచ్చియుండఁగా, గైకొనుటకు నాకడకువచ్చెను. బీదలకుఁ బంచిపెట్టుట కవి. ఈతప్పుద్రాఁగుసోమరివెధవలను దొంగగాడిదెకొడుకులను మనుష్యులఁ జేయవలెనని అతనియాశయము. వీరందఱు మొదలి యారుపనివాండ్రు. యుగములతరబడి బురదలోఁ గూరుకొని పోయియున్నారు."

"అవును, ఎవరో యొకరీపని నారంభింపవలదా? ఈ గ్రామజనము నుద్ధరించుట కేమహానుభావుఁడో సమకట్టనియెడ దీనికంతేది? మనకాలమున మనము చేయఁగలమహాత్కార్య మిదియనియే నాతలంపు. కందనుగారినిఁ బిలువుఁడు. ఈనాటి సంఘట్టనకు వారియెఱుకకన్న శుభమైనపర్యవసాన మొండు లేదు. నేనాతని కార్యములకుఁ దోడ్పడెద. ఇచట నాయస్వతంత్ర జీవనమును, కొలువుదుకత్తెతనమును మట్టగించెద. అయినను మీకు సాంబారునకుఁ గొదువయుండదు లెండి!" సరస్వతి చిఱునవ్వునవ్వెను.

సుందరము కందనును సమీపించెను.

"కందన్, ఎందుల కూరక పచారుచేయుచుఁ బరితపించెదవు? నా కీరైలుసంఘట్టన, నీ కీకరియన్ భార్యతలపగుబుట—

దీటుగా నేయున్నవి. రేపుదయము బండిలో ట్రాంక్విబారున కామెనుగొంపోయి, ఆసుపత్రిలోఁ జేర్పుము."

"అవసరమైన నేను వెంటఁబోయి, ఉపచరించెదను. పాప మింకను స్మృతిరాలేదు. కరియర్ పశువై నాఁడు. ఇంతఘోర కార్యము నేయుట కెంత త్రాఁగియుండెనో!" అని సరస్వతి అందు కొని తిన్ననిగొంతుకతోఁ దనసహజభావమును బ్రకటించెను.

"ఈకల్లుంగడిపోవలెను. బీదజనుల నిది నాశము నేయు చున్నది. భార్యాబిడ్డ లింటిలో మలమలమాడుట, పురుషు లిక్కడ పశువులుగా పరిణమించుట. ఏమిఘోరము!" అని కందర్ బయటికి వితర్కించెను.

"అయ్యా, మీామహత్సేవంగూర్చి వింటిని. ఎట్టిత్యా గము! మీాకీదీనురాలును తోడ్పడఁగలదు. దేశమునకై పాటు పడుట కిదియే యదను. నన్ను నుగ్రహింపుఁడు. కల్లుంగడిపోవలసి నదే. దానితోకూడ మొదలియారునైతము. ఆతని యామఖ వికారము, పశుప్రవృత్తి నాకుఁ బరమాసహ్యముంగొల్పు చున్నవి. అతనిభాగ్యము పాడగుఁగాక. అతనిధాన్యపుకుప్పలు తగులఁబడిపోవుగాక. బీదలకు పట్టెడన్నమిడనిభాగ్య మేమి భాగ్యము?"

సరస్వతి యుద్రేకము మనోహరముగా నుండెను. ఆమె ముఖమును అతిలోకసౌందర్యమువహించెను. కందర్ చకి తుఁడై విస్మయుఁడై ఆమెను తిలకించెను. నూత్న దేశసేవిక.

భారతమాతృనవీనసంతానము. కందర్ కలఁగినునట్లాయెను. తనకృషి కెల్ల నామె సమ్మతితోఁ దలయూఁచుటకన్న నాశింపఁ దగినప్రతిఫలమేమి? వైరాగ్యమున కీమెవాక్కేగదా ప్రతిక్రియ.

## 2

సరస్వతి భావోద్రేకమును డాఁగువఱచుటకు ముఖము నావలిప్రక్కకుఁ ద్రిప్పుకొనెను. అంబరతలమున నెఱ్ఱనికాంతి గన్పట్టెను. "ఇదేమి ప్రభాతమా? కాఁజాలదు. రాత్రి 11 గంటలవేళకదా!" అని వితర్కించెను. తటాలున నిజమా మెకు స్ఫురించెను.

"కందా, తూర్పుదెసఁ జూడుము. ఏమి టాయెఱ్ఱఁదనము? నాకన్నుల మసకగప్పినదా? లేక నావాక్కు లింత త్వరలో సత్యమైనవా?" అని బిగ్గఱగా పల్కరించెను.

సుందరము, సరస్వతి, కందనులు ముగ్గురును విస్మయభరితులై యెక్కువగుచున్న యాయెఱ్ఱదనము నాలోకించిరి. పొగయు, నిప్పురవలునుగూడ దృశ్యమాయెను. అంతటితో సందేహానివర్తియాయెను.

కందర్ మైమఱచినట్లాయెను. "అయ్యో నందా, మూఖా, కాశేరి, ఇరుల్లా, కరుప్పా, ఇరుల్లప్పర్, అయ్యో నల్లా మీరందఱు నాకొంపముంచితిరే! దాహము, దాహము!

పంటకుప్పలు, గడ్డివాములు తగులుచున్నవి. నామంచిపేరు మంటఁగలిపితిరే! నల్లా, ఒక్కసంవత్సరముగా నాజేసినసేవ నొక్కక్షణములో, త్రాఁగివచ్చిన ఉద్రేకమువలన నాశముచేసితిరే!"

"అక్కడేగాదిటుచూడుము. కల్లంగడియు తగులఁబడుచున్నది." అని సరస్వతి మఱొకవంక పొగ రేఁగుచుండుటఁ జూపించెను.

"దీనికంతటికి నన్నుత్తరవాదిఁజేయుదురే! ఏమిచేయుదును! అదనుదాటినది. అయినను ప్రయత్నించూచెద. స్టేషను మాస్టరుగారూ, మొదలియారును లేవఁగొట్టుడు. ఈరాత్రి యాతనికిఁ గల్గినదౌర్భాగ్యదశ నెఱింగింపుడు." కందర్ప యిట్లు విన్నపించి, కుప్పలు తగులబడుచున్నవంక కతిత్వరితముగాఁ బరువెత్తెను.

"ఇరువదివేలకలములవరిధాన్యము యేబదివేలరూప్యములుసేయునే! కొండలవంటి గట్టివాములు—భస్మమైపోవుచున్నవి. మొదలియారు నాశనమైనాఁడు. ఇఁక రెక్కొనఁగలఁడా!" ఇట్లనుచు సుందరము విభ్రాంతినుండి మేల్కొనెను.

అరగంటలో నక్కారుదైర్లైస్టేషను కిటకిటయాయెను. ఊరిలోఁ బ్రతివారు నచటికి మూఁగిరి. ఎత్తుగానున్న ప్రదేశమగుటచేఁ దగులఁబడుచున్నకుప్పలను దూరమునుండి భద్రముగాఁ జూడవచ్చునని. అగ్నివిజృంభణ కంతరువులన్నియు

వరుసగాఁ గన్పట్టుచుండెను. ముందఱ వంటయింటినుండి వచ్చు నట్లుగా సన్ననిపొగ, తరువాత మెండుకొనికార్కొనినపొగ, నిప్పురవలు చెదరుట, ధగధగమని మంటలు——వస్తువులు తగులఁ బడుచున్నపు డొకవిషాదోన్నతి గలదు. ఎల్లర నాకర్షించు భయంకరదృశ్యము. శ్రీమంతులు, నిఱుపేదలు, భద్రముగా నున్నవారు, ఆపదలోనున్నినవారు అందఱు నొక్కపెట్టున సాహాయ్యమునకు కుయ్యిడెదరు. నామరూపాదివ్యవస్థలు క్షయించి, తిరిగి వస్తుజాలము మూలవస్తువునం దైక్యమగు నామహాదృశ్యమున కేవారైనను లోనఁ గరఁగుచుందురు. "రక్షింపుడు, రక్షింపు" డను కేకల వెదఁజల్లు నావాయువే అగ్నిని మఱింత ప్రజ్వరిల్లఁజేయుచు వీచుచుండును.

## 3

సుందరము నిర్ఘాంతపోయి చూచుచుండెను. కాని మధ్య మాయవరమునుండి టెలిఫోను పిలువువచ్చెను. "తంజా వూరు క్రొత్తఅసిస్టాంటుకలెక్టరు బోటుమెయిలులో మదరాసు నుండి వచ్చుచున్నాఁడు. ఒకవారమురోజులు ట్రాంక్విబారులో నుండును. వారికి వేకువ కాఫీ అక్కారులో సిద్ధముగానుండ వలెను. వెంటనే సిద్ధపఱుపవలసినది."

"అయితే సంఘట్టనంగూర్చి యేమిచేసితిరి? గంటక్రింద నేను ఫోనుచేసితి నావిషయం."

"ఏముంది! విచారణజరిపి, మిమ్ములనీడ్చి పాఱవేసెదరు. కాని కొన్నాళ్లిట్లనే పనిఁ గానిచ్చుచుండవచ్చును మీరే. రైల్వేకూటికిఁ గోటికడగండ్లు."

సుందరము ప్రాణములు కంఠగతమయ్యెను. కాని యెట్లో శ్రమపడి వాటినిఁ జిక్కఁబట్టెను. ఆటుతిరిగిచూడఁగా మొదలియారింకను గుఱకవెట్టుచు నిద్రపోవుచుండెను. తన యిల్లు తగులఁబడుచున్నను పాప మాతఁడు మంచిసారాయిని, చక్కనిపిల్లలనుగూర్చి కలలు గనుచుండెను.

సుందరము తనజెండాతో నాతని గ్రుచ్చి లేవఁగొట్టెను.



# పదునొకండవ ప్రకరణము



దో ష్మి

## 1

చొక్కలింగమువంశ మీనాటిదికాదు. పదునొకండు తరములుగా వారిపూర్వీకు లీయింటనే కాపురముసేయుచుండిరి. నాయకరాజులకాలమున నిక్కడ కాలరూనుకనుమల కాపుదారులై చిన్నసేనాపతులుగా వారు విడిసిరి. మొదటినుండియు కష్టమెఱుఁగని యాశ్రీమంతులకుటుంబమున కిన్నాళ్లకు చొక్కలింగము క్షయికారణుఁడై సముద్భవిల్లెను. యౌవనోత్సాహము, ఆధునికనాగరికతాసమ్మోహము పూర్వులు కూడఁబెట్టినధనమునెల్లఁ గొల్లఁబెట్టసాగెను.

చొక్కలింగము పూర్వీకులు పరులకొఱకు కిసుమంతయైన వెచ్చింపక, తమపాలముల వృద్ధిబొందించుకొనుటయందే తదేకదీక్షవహించిరి. అందువలననే అవిచ్ఛిన్నసంపద వారికి లభించెను. దీనికిఁ బ్రతిద్వంద్వముగా చొక్కలింగ మిప్పుడు ఎన్నికలలో మున్గిపోవుట తటస్థించెను. ఇన్నాళ్లెడతెగక సంపద యొకచోటనే నెలకొనియుండుటకు చంచలయగులక్ష్మి యిచ్ఛ

గించునా? దశాచక్రమును క్రిందుమీదుసేయు ధనలక్ష్మి తన ప్రభావము చూపించెను.

## 2

అక్కూరు రైలుసంఘట్టనమువార్త తుపానువలె వ్యాపించెను. చొక్కలింగముతల్లి నిద్రపోవుటకుఁ బడకవేసి కొనుచుండఁగా నామె కిది తెలిసెను. ఆముసలితల్లికి వెంటనే ఆవేగ ముదయించెను.

“రామలింగం, స్టేషనునకుఁబోయి చూడు, నాయనా, చొక్కలింగమున కేమయినదో!” రామలింగము ఆమెసోదరుఁడు.

“భయములేదు, పోరోఁడి, చొక్కలింగము మాయవరముపోయినాఁడు. ఢీకొట్టుకొన్నది ట్రాంక్వెబారునుండివచ్చిన బండి. మన అబ్బాయి ఒకగంటలో కారులో నింటికివచ్చును.”

“రైళ్లు ఢీకొట్టినవఁట. ఎట్టిభీభత్సమోగదా. అందువలననే, అబ్బాయిని యెప్పుడుగ్గాని యీరైళ్లకు, యీకంకరరోడ్లకొలకు ప్రయాసపడవలదని నేఁజెప్పుచుందును. మనయొద్దు పనిలేక పడియున్నవి చూడు. ఈమోటార్లు రైళ్లు డబ్బుఖర్చు సేయించుచున్నవి. రామలింగం, స్టేషనుచాయ పోయివచ్చిన మేలుగదా. పోయిచూచిరా, అబ్బాయి క్షేమముగానున్నాఁడో.”

"వానికి భయమేమమ్మా! అరగంటలో నీకంటియెదుటికి వచ్చునో, రాఁడో చూడు."

"నాయనా, చొక్కలింగ మీవిధముగా నర్ధరాత్రి వఱకు బయటిసంచారముసేయుచు, నిత్యము మమ్ము దిగులు పెట్టుచున్నాఁడు. నీవు కొంచెము మందలింపరాదా! ఈ యెన్ని కలగొడవ మన కెందుకు? మనపొలములు శ్రద్ధగా సాగుబడియగుటలేదు. లేకపోతే, కూరగాయలు మనము బజారు నుండి తెచ్చుకోవలసినదా ? వాడినాయన బ్రదికియుండి, చూచినఁ గడుపుమండిపోవునే. ఎంతపొలము బీడువడియున్నది! ఈయేడైనను చొక్కనునకుఁ బెండ్లిసేసి, వాని నొక చోటఁ గుదురుపరుపవలెను."

"అవును, పోరోక్కడీ, అదే మంచిమాట. తల్లిమనసు తప్పగునా? మంచిపిల్లనిచ్చి పెండ్లిసేయుము. తరువాత నంతయుఁ గుదురుపడును." రామలింగమున కీపెండ్లివిషయము చాలా సమ్మతమైనది. ఏలననఁగా నితనికిఁ బెండ్లియీడుగల కుమార్తె యుండెను. దానిని చొక్కలింగమునకిచ్చి పెండ్లిసేయవలయునని యితనిసంకల్పము. సంవత్సరముగా, తనసోదరియొద్ద నుప్పచప్పనిమాటలాడుచు, నోపికపట్టి కాలముబుచ్చుచున్న దందులకే.

"చొక్కని తండ్రిదినములలో మనపొలముల నితరులందఱుచూచి మెచ్చుకొనుచుండువారు. ఇపుడు మనపొల

ములు అశ్రద్ధకుఁ బెట్టినవేరైనవి. కూలివాండ్రకు మూఁడువారములుగా కూలిముట్టలేదఁట. పగలనక రాత్రియనక, కష్టమనక సుఖమనక పొలములందు కష్టించు నీబీదజనమునకుఁ దిండికి లేనిచో గతియేమి? చొక్కనుతండ్రి కాలములో నిట్లుండెనా? మనయింటిలోఁ బండుగపర్వము వారికిని పండుగపర్వముగా నుండెనుగదా. అపుడు మన ధాన్యపుకొట్లు, రాసులు రాసులుగా పోసియుంచినకూరగాయలు, కొబ్బరికాయలకుప్పలు అవన్నియు నిపుడు నామావశేషములైనవి. ఈకల్లంగడివచ్చి, వినాయకునకుఁ గొట్టుటకైన టెంకాయ లేకుండఁ జేసివైచినది."

"అవును, పోరోక్డీ. కల్లంగడివలనఁ గష్టపడి పనిజేయుచుండిన పనివాండ్రు సోమరులైనారు. పొదుపుగానున్న కాపురములు పాడైనవి." రామలింగము అరువదేండ్లు సమీపించుచున్న ముదుసలి. పూర్వకాలపు హిందూసాంప్రదాయములు, దయాధర్మము లింకను మఱచిపోలేదు.

"రామలింగం, నేనెఱిఁగి క్షామమురాలేదు. ఇపుడు చొక్కన్ నామాట వినకుండవచ్చినాఁడు. గారాబముతోఁ బెరిగినబిడ్డ. నీవైనను వానిని మందలించి చక్కఁజేయనిచో సెంబరంబాకమున మన దాయాదికిఁబట్టినగతియే మనకుటుంబమునకుఁబట్టును."

"నేనతనికి బుద్ధిచెప్పుట నాకున్న మర్యాదఁ బోఁగొట్టుకొనుటకే. వానికి మనమేస్త్రీ నల్లన్ మంత్రి. పోరోక్డీ, యీ

విషయము లొకరుచెప్పి నేర్చుకొనవలసినవిగావు. నాలుగుపాట్లు పడి అనుభవముమీఁదఁ దలకెక్కవలసినవి. అతనికి మంచిపిల్ల నిచ్చి పెండ్లి సేయుము. తరువాతచూడుము, మనపాలము లెంత చక్కఁబడునో. నీవు వెదకిచేయు పిల్లపైనున్నది భారము."

"నేనువెదకుపిల్ల! నీవేమి మేనల్లునిపెండ్లిసమయమునకు కాశీకిఁబోయి కూర్చుందువా? నీవే వెదకిపెట్టవలెఁ బిల్లను." పోరోక్కడి ఒక్కక్షణము నిదానించి యిట్లనెను. "అవును. మన కుట్టి నీలం, నీకూతురు, తగినపిల్ల యని అప్పుడప్పు డనుకొను చుందును. కాని పిల్ల చాలాచిన్నది. బాగా యెదుగలేదు."

"నీలం యెదుగకపోవలసినదే! వయసువచ్చినపుడు, అరటి మోగువలె నమ్మాయి యెదిగిరాదూ? దానితల్లిగూడ నాలాగే. కాని, అదిగాదులే నీమనసులోనున్నది. మేము బీదవారము. నిజమే. కాని పిల్లకుఁ బెండ్లిగాకపోదులేవమ్మా. పుట్టించిన దేవుఁడు పెండ్లికి మనువుగూడ చూపించఁగలఁడు." రామ లింగము యుక్తిగా పాచికపాఱించెను.

"అదిగాదు రామలింగం. ఊరకే యెందుకు రోషపడె దవు? నీలమునకన్న నాకుఁ గావలసినదెవరు? కాని నీవు చొక్కను నెట్లో యొప్పించవలె. ఈకాలపుపిల్లకాయలు మన మాట వినరు. పెండ్లియనిన వారికేవేవో విపరీతపుటాలోచ నలు. దేవునియనుగ్రహ మున్నచో, వచ్చునెలలోనే నీల మును కోడలుగా నింటికిఁ బరిగ్రహింపఁగలను."

"అవును, అక్కయ్యా, చొక్కడు సరదాయైనకుఱ్ఱ వాఁడు. నీమాటకు మిాఱిపోవు ననుకొనను. మాటల కేమి వేయియనవచ్చును. కాని కార్యము విషయమున నిన్నుఁ గాదనఁడు. వెండ్లితో మరల మనసాంప్రదాయము నలవఱచుకొనును. నాలుగుచోట్లుతిరిగి, అతనినే తెలిసికొననిమ్ము, లోకములోఁగల కడగండ్లు, అదే మంచిది."

"కాని రామలింగం, పట్నమాసములలో నెక్కడ నేమిచెడిపోవునో యని నాభయము. మనదాయాది సేంబరంబాకములో నేగతియైనాఁడో మనకుఁ దెలిసియున్నదిగదా. ఎప్పుడు పరిస్థితులువిషమించునో యెవరికెఱుక!"

పారోకిడి, పాపము, కుమారునింగూర్చి యెంతయో దిగులువడుచుండెను. రామలింగము తనయెత్తు నెగ్గునా లేదా యనియే యోజించుచుండెను. అంతయు సరిగానున్నచోఁ దనతో వియ్యమందుటకు పారోకిడీ ఉత్సహింపదని అతని నిశ్చయము.

"సేంబరంబాకమునకు మనకు నెక్కడిసాటియమ్మా! ఆఱు తరములచొక్కలింగములైనను మనయాస్తి నేమిసేయఁగలరు. అక్కారుపొల మెట్టిదనుకొంటివి? సేంబరంబాకం చవటభూమి. ఆవంశమున కొకప్పుడుమాత్రము గౌరవము మిన్నంటి యుండెనా? చొక్కనుగూర్చి భయపడవలదు. వాఁడు నామాట కొంచెమువినునట్లు నీవుసేయవలె. నాకు కొంచెము అధికార

మియ్యనిమ్ము. అప్పు డాపనివాండ్రను నేను సరిజేసెదను చూడు."

"నీకధికారము చొక్కను యీవలెనా, నాయనా? నా తమ్ముడవు, నీమాట కడ్డమేమి? ఎవరు నిన్నుఁ గాదనువారు?"

"అట్లయినయెడల నే నీనల్లగా అమవసులకు బుద్ధిచెప్పెదను. కూట్లదొంగలు వీరు. మూఁడేండ్లుగా మనపంట జబ్బుతగులుటకు వీరే కారణము. వీరిచెడుమాటలు వినియే చొక్కలింగము మోసపోయినాఁడు."

"రామలింగా, చొక్కగా మూఁడేండ్లలో మూఁడులక్షలు యెన్నికలకొఱకు వ్యర్థముచేసినాఁడు. నీవే పెత్తనమువహింపుము. అబ్బాయి యింకొకనెలలోఁ గుదుటపడవలెను. నేనూరకుండఁజాలను. ఏమి యీదేహము శాశ్వతమా? నేను కన్నులు మూసుకొనులోపల, చొక్కగా పెండ్లిఁ గాంచవలెను."

ఇరువదిరోజులుగా చేరువ నొకపాడువడినశివాలయమున రెండుగుడ్లగూబలు రాత్రులం దఱచుచుండెను. ఏదో కీడురానున్నదని, ఆయఱపు విన్నపుడెల్లను పొరోర్కడీ భయమందుచుండెను. చొక్కగా పెండ్లిమాట నీమె యిప్పుడనఁగానే గుడ్లగూబలయఱపు వినంబడియెను. పొరోర్కడీగుండె ఝల్లుమనెను. ఏదో వంశహాని శంకించెను. ఒక్కనిముసమంతయు నిశ్శబ్దముగా నుండెను. రామలింగముమాత్రము తనకూతురి

పెండ్లి, ముందురానున్నసంపదయుఁ దలపోసి యుప్పొంగు చుండెను.

పోరోక్కడీ తిరిగి పల్కరించెను. "రామలింగమూ, యీ గుడ్లగూబలయఱపునకు నాకు భయముగుచున్నది. నీవొక్క మాఱు స్టేషనునకుపోయి ఆసంఘట్టనమేమో కన్గొనుము. మన అబ్బాయి క్షేమముగానున్నఁగదా పై శుభములు."

రామలింగ మీమెకు ధైర్యము చెప్పులోపలనే, యింటి చుట్టునూ పెద్దసందడియాయెను. ధాన్యపుకూట్లు, గడ్డివాములు నున్న ఆవరణములో వారు వీరు కేకలువేయుచు, కోలాహ లము సేయుచుండిరి.

## 3

"ఎవరురా వెధవలు, అర్ధరాత్రియప్పు డీఅల్లరిసేయు చున్నారు. ఏఁడీ, ఆకుప్పదొంగ నల్లక? ఇంకా కల్లంగడిలో నేనా? తలయారి అమవసి యేఁడీ? ఈదొంగవెధవల నొక్క మాఱు చావఁదన్నుటకు?" అప్పుడే రామలింగము అధికారము చలాయింపవలయు ననుసంతోషముతో గట్టిగా నఱచెను. తన సోదరివంకఁదిరిగి "ప్రాతపందికొక్కుల నొకరిద్దఱినిఁ జిదుగఁ బొడువనిదే యీమనభూములు బాగుపడవు. నల్లక తలయారీ లకు బుద్ధిచెప్పవలె. తొందరలోనే కంజీతో వారికి తెలివి దెప్పించెదను. అనెను,

కాని, పోర్కోడీ తనకొడుకు క్షేమమునుగూర్చి అట్లే ఆలోచించుచుండెను. కుప్పలదగ్గఱ నల్లరి అధికమాయెను. తటాలున నామె కొకటితోఁచెను. కొన్ని యేండ్లక్రిందటఁ దన భర్త ప్రక్కగ్రామములో దొమ్మీసేయించినసంగతి స్మరణకు వచ్చెను. ఆదొమ్మీలోనే నందన్ మూఖన్ కాటేరీలకు శాశ్వతమైనపించను దొరికినది.

"రామలింగా, ఇరువదిరాత్రులుగా గుడ్లగూబయఱచుచుంట వృథాగాదు. ఇట్టిదేదో వంశహాని రానున్నదని భయపడుచునేయుంటిని. వీరా సొరక్కి తేవన్ మనుష్యులు గావలయు. చొక్కన్ ఊఁరిలో లేఁడుగదా యని దొంగప్రొద్దున దొమ్మీ సేయవచ్చినారు. తొందరపడు. మనలో మొనగాండ్ర నందఱినిఁ బిలుచుకొనిరమ్ము. నందన్ మూఖన్ కాటేరీ లింకను బ్రదికి యున్నారు, వీరికి బుద్ధిచెప్పుటకు. ఈయేబదియేండ్లలో మఱచిపోయినారుగాఁబోలు పూర్వపుపాతము. పడకచుట్టిపెట్టి లెమ్ము. దొడ్డిద్రోవనుపోయి మనపల్లీలను, పడయాచీలను దోడ్కొనిరమ్ము. మాలవాండ్రు, నందన్, మూఖన్, కాటేరీలు, ఇరుల్లన్, కరుప్పన్, ఇరుల్లప్పనులను లేవగొట్టుము. వారిపేర్లు వినియే వీరు కాలికి బుద్ధిచెప్పెదరు. నల్లన్ అముపనీలుకూడ యెక్కడనే యెక్కడనో యుందురు."

పోర్కోడీ యీకష్టసమయమునఁ జాలాధైర్యోత్సాహములఁ గన్పఱచెను. డెబ్బదిరెండేండ్లు చెల్లినదయ్యును

రామలింగమునకన్న నెంతో ధైర్యశాలిని. పేరుకుఁదగిన తేజము గలది.

కాని ప్రక్కయూరివారు దొమ్మీసేయవచ్చిరనుభ్రమ తొందరలోనే తొలఁగెను. నల్లక అమవసు లిద్దఱును కుప్పల గేటునొద్ద నిలిచి గట్టిగా నఱచిరి.

రామలింగము దొడ్డితోవను మాలపల్లెకు పరుగెత్తవలసినయవస్థ తప్పెను.

"మేమమ్మా మహాతల్లీ, నల్లక అమవసులము మామను ష్యులందఱు యేనూరుమందివచ్చియున్నారు. వారికిఁ గూలీ ముట్టవలసియున్నది. ఇరువదియొక్క రోజులుగా మాడిపోవు చున్నారు. యజమానిలేఁడు. తల్లీ! మీరు మాకూలిడబ్బు లిప్పింపుడు. మాయాజ్ఞ మీఱిపోవుచున్నారు జనము. మీ యిష్టము."

"అర్ధరాత్రియప్పుడు కూలి నడుగమనిన దెవరురా మిమ్ములను? కాదుకాదు. మేము నిద్రపోవుచున్నామని దొమ్మీ సేయవచ్చినారు మీరు. కానీ, మఱి మఱచిపోకుండునట్లు మీకు బుద్ధిచెప్పెదను. అమవశీ, నీవురా దీనికంతటికిని మూల కందము. నల్లక నీవు నీపని సరిగా జేయుట లేదు. అర్ధరాత్రి వేళ కూలినడుగు తలయారీ, మేస్త్రీలను నాజన్మములోఁ జూడలేదు. చొక్కక యిక్కడున్నట్లయితే, పట్టలూడఁదీసి యుండును మీకు. ఇపుడు నేఁజెప్పవలె మీకు తగినబుద్ధి."

రామలింగ మొకకంజీనిదీసికొని అమవశినిఁగొట్టుటకుఁ గోపోద్రేకముతో బయటికిఁ బరువెత్తెను. అమవశి ఉద్దండుఁడై ముందునిలిచియుండెను. రామలింగము కంజీనెత్తి దించులోపల, కరుప్పఁ వెనుకమళ్లుగా కంజీని లాఁగికొనెను. రామలింగము నేలకొఱగి, కొబ్బరిచెట్టు మొదలునకుఁ దలఁగొట్టుకొని స్మృతి దప్పెను. తనవంశమునకుఁ గల్గినయీమహాపచారముం గాంచి పోర్కోడీ ఆగ్రహపరవశయై గొంతెత్తి మందలించెను. కాని, యాసందడిలో నది లీనమయ్యెను. ఇంటిజనమే నిర్ఘాంతపోయి మిన్నకుండిరి.

కాశేరీ తనయజమానిందప్ప మిగిలినయొందఱినో దోచిన వాఁడు. దొమ్మీలందు వానికనుభవము. ఇపుడు యజమాని కుప్పలను భేదజ్ఞానము కృశించుచుండెను. తండ్రియెడ భక్తి కొడుకునెడ నుండవలయు ననుకట్టడి లేదు. అందునను కొడుకు దుబారామనిషి. మూఁడునెలలనుండి పించను వెనుకఁబడ వేసినవాఁడు. ఇక న్యాయబుద్ధి కవకాశమేది!

కాశేరి గొంతెత్తి మనుష్యుల కాజ్ఞ చేసెను. “వచ్చినది మాలవానికి మంచికాలము. దొరికినది అవకాశము. రండి, రండి, అందఱును రండి, అఱువదేండ్లకొకసారిగాని రాదిట్టి సుముహూర్తము. మనము కోసి కుప్ప వేసినపంట యిది. మనయాలుబిడ్డలు ఆఁకటిచే మాడుచున్నారు. మూఁడువారములుగా మనయజమాని యూఁర లేఁడు. ఎవరి కిష్టమువచ్చినంత వా రింటికిఁ గొని

పొండు," నందక్ మూకనులు—"సెబాషు! సెబాషు! రండి, మన మొనగాని ఆజ్ఞయైనది. పోలేరమ్మకు అంకాళమ్మకు జై! మనకాటేరికిజై" తమనాయకులే దొమ్మీకి తమకాజ్ఞయిచ్చిరి. ఏపాపమెఱుఁగని యీరైతుజనమున కదియే దైవాజ్ఞ.

ఇరుల్లక్ కరుప్పక్ ఇరుల్లప్పనులు, మఱింతసాహసులు మఱొకహెచ్చరికఁజేసిరి. "గడ్డివాములకు నిప్పంటింపుఁడు. మన కైన అన్యాయము మంటగా మిన్నంటుగాక. మనయాలు బిడ్డలు మలమలమాడుచుండఁగా మనయజమానిపట్నమూసపు పందికొక్కుల మేపుచున్నాఁడు."

దొమ్మీ కైక్యమైన యా సన్నజనము కోలాహలము తరతరములుగా పేర్చిన ద్వేషప్రభావము. ఆఁకలివలన నడ్డు త్రెంపులేక విఱుచుకొనిపడిన యాజనసంచయము వర్షాకాలమున గట్టుతెగిన చెఱువువంటిది.

నల్లక్ తనమాటను మీఱి జనము తప్పుదారిఁద్రొక్కుటఁ జూచెను. ఒక్కమారు మేస్త్రీఅధికార ముట్టిపడునట్లుగా గద్దించెను. "మీకు వెట్టియెత్తినది. మీయిష్టమువచ్చినట్లు కూట్లను దోచుకొనుఁడు. కాని గడ్డివాములకు నిప్పంటింపరాదు. నోరులేనిపశువులయాహారమది. కాటేరిచెప్పిన మేరకు, ధాన్యముదోచినను, గడ్డిపోచను ముట్టుకొనకుడు." కాని యతనిమాట ముగియకముందే, గడ్డివామిపై మెఱుమువలె

నిప్పురవ చెదరెను. ఉన్నతమైన యావాములు చిటపటమనఁ జొచ్చెను. అలఁతితడవున నగ్నివిజృంభించి, నిరాతంకప్రభావముం జూపసాగెను.

రామలింగము తనయింటనే యిట్టివిషాదదృశ్యమును చూడవలసినవాఁడాయెను. కాని యాతని లేచి నిలుచుకొననీకుండ కరువ్వుఁ అదిమిపట్టియుండెను. కరువ్వునకతనిపైఁ బ్రత్యేకముగా ద్వేషముండెను. "నీవును మాయజమాని ఉప్పుఁదినవచ్చినవాఁడవేగదా! మాపై నీదాష్టీకమేమి?" అని వాఁడు గొంతునొక్కి చెవిలో ఘూర్ణిల్లుచుండెను.

చొక్కలింగముపొలములందు సుమారు యేనూరు కుటుంబము లాధారపడియుండెను. చిన్న పెద్దలుచేరి రెండు వేలకుందురు. చొక్కలింగము చెర్లాటము వీరికందఱకుఁ బ్రాణసంకటము. ఈవిషమవేళ నీరెండువేలమందియు చేతికిదొరికినంత చిన్న, పెద్ద, స్త్రీ, పురుషభేదములేక సంగ్రహించుచుండిరి. ఆఁకలిగొన్న బూచులవలె నెల్లవారును రాక్షసశక్తినిఁ బ్రకటించుచుండిరి. నల్లఁ దిక్కుదోఁచక దీనినంతటినిఁ జూచుచుండెను. తటాలున నతని కొకటితోఁచెను. "ఎవరైన నాకల్లంగడికి నిప్పుబెట్టరా? మనయజమాని నిట్లు చేసినదికూడ నదియే. మనపాపము దానితో శమించును. రేపటినుండి క్రొత్తవారమయ్యెదము." పవడాయి మఱికొందఱుయువకులతో నావంకఁ

బరుగెత్తుకొనిపోయి, కల్లంగడికి నిప్పంటించెను. వెంటనే దూర మున మఱొకదివ్వెను నల్లన్ తిలకించెను.

కందన్ ఊపిరిద్రిప్పుకొనక పర్వెత్తుకొనివచ్చెను. కాని జరుగవలసినది చాలవఱకు జరిగిపోయియుండెను. కుప్పల చుట్టును, వాములచుట్టును తిరిగెను. ఇంక నేమికుప్పలు, యేమి వాములు! కందన్ విషాదపూరితుఁడాయెను. చేయునది లేక వెనుమరలెను. నల్లన్ కందన్ కాళ్లకు మ్రొక్కి యిట్లనెను. "మహానుభావా! ఇది మనచేత కాదు. దైవాజ్ఞ. దేవుడుపంపిన అగ్నికణము, వాయుసాహాయ్యము. మేము నిప్పంటింపవలె నని, దొమ్మిసేయవలయునని తలంచియుండలేదు. మాకూలి డబ్బు లడుగుటకువచ్చితిమి. చివర కిట్లైనది. ఎవరో యెట్లో, యెందులకో—మా కెఱుకలేదు."

కందన్ మఱుమాటాడలేదు.

అక్కూరురై ల్వేస్టేషనువైపు కాలుసాగించెను. నల్లన్ కొంతదూర మాతని ననుసరించెను. తనకు ముందు రానున్న విప త్తును కందన్ గ్రహించెను.

ఇచట దొమ్మి నిరాతంకముగా సాగెను. అజ్ఞానదారిద్ర్య జంబాలమునఁ గూరుకొన్న సీకర్షకజనము పగటివేళ పెద్దపులి వలె సామాన్యముగా మణఁగియుండువారయ్యును, దొమ్మి యనుదోషావసరమున విజృంభించినపుడు, వారిభీభత్స మేమని చెప్పవచ్చును!

అమవశి, నల్లనులు రెండుబండలమధ్యఁ దగుల్కొన్న నావ వలె, నిరువంకల సంసక్తతగలవారై మిన్నకుండిరి.

నందన్ మూర్ఖన్ కాటేరి ఇరుల్లన్ కరుప్పన్ ఇరుల్లప్పనులు తమతమమనుష్యులకు హెచ్చరికలఁగావించుచు, సంగీతముదీయుచు ప్రహర్షులై, ప్రమత్తులై విజృంభించిరి.



# పండ్రెండవప్రకరణము.

## ప్రొద్దుపొడుపు.

విషాదసంభరితమగు నాక్షపాతిమిర మంతరించుచుండెను. పూర్వాద్రిపై నుషఃకాంత తొంగిచూచెను. జగజ్జాలమునం దేమూలనో యొదిగియున్న భూమండలమున నేకోననో అకృత్య మొకటిజరిగినదని లెక్కసేయఁడుగదా సూర్యుఁడు. జలదసంఛాదనపటంబులఁ దొలఁగఁద్రోసికొనుచు శయ్యవీడి మెల్లఁగాఁ జనుదెంచెను. తరములఁబడి సంపదల కాలవాలమైన చొక్కలింగమొదలియారువంశమునకు వాటిల్లిననష్టమునకు సూర్యున కేటిసంతాపము! ప్రాతఃసూర్యకిరణములఁ దొలుదొల్త తమమూర్ధముల ధరించుధాన్యపురాసులుగాని గడ్డివాములుగాని యిపుడు లేవు. మొదలియారుని సంపదున్నతి భస్మీభూతమైయుండెను. ఉల్లాసకరుఁడు సమీరుఁ డావెలిమిడిని విరజిమ్ముచుండెను.

పదునొకండుతరములుగా హర్షసంభరితమై, గర్వసంకాశంబై యలరారిన చొక్కలింగనియుద్యానగృహ మిపుడు చిచ్చుఁబిడుగుపడి నాశనమైనట్లు చూపట్టెను. కాని చుట్టుపట్లనున్న గుడిసెల కన్నింటి కది సంతోషావసరము. ఆఱునెలల

వఱకు క్షుద్బాధతీఱిన దీనిహర్షారావము. కాని భయస్వరమం దంతర్లీనమైయుండెను. అపహరించినఆస్తింగూర్చి ఆపరాని దిగులు. ఫలసాయము ప్రకృతిసిద్ధమయ్యెను, క్షుద్బాధ అనివార్యమయ్యెను, వేఱొకనియధీనమున నైమిత్తికముగా నున్న దానిని గ్రహించుటయు పురాతనము ప్రసిద్ధమునగు 'ఆస్తి' అనుసాంప్రదాయమునకు భంగకారణము నేరము నగుచున్నది. జంతుకోటికి ప్రధానగుణము మానవశాసనముంబడి మొదటి పాపమగుచున్నది.

## 2

ప్రొద్దుపొడువకపూర్వమే అక్కూరురైల్వేస్టేషను ఆవరణమున జనము క్రిక్కిఱిసెను. రైళ్లసంఘట్టనము, కుప్పలదహనము, రాత్రి యెల్లరకును భీభత్సముం గల్గించెను. ఒక్కరికేనియు నిద్రలేదు. రైల్వేస్టేషను గ్రామమునకును బహిః ప్రపంచమునకును లంకెయగుటవలనఁ దూరపు తెల్లవాఱఁగానే అశేషజన మచ్చటికి మూఁగెను. జాగారమువలనను ఆవేగమువలనను డస్సిన వారినయనములకుఁ బ్రభాతవాయు వుపశాంతిఁగూర్చెను.

కొంచెముసేపులోనే రైలుకమ్ములు శబ్దించెను. నెం 5 రు రైలు క్రొత్తయింజను తగిలించుకొని స్టేషనులోనికి తీవిగా నరుదెంచెను. బోటుమెయిలు ప్రయాణీకుల నందుకొనుటవలననే గాఁబోలు నాతీవి.

మాయవరం డిప్టీకలెక్టరు ఆరైలులోనే వచ్చెను. క్రొత్త కలెక్టరును మాయవరమునుండియే అనుసరించుట వివేకమని ఆతఁడెంచెను. అవును, పాపము! తొందరలో నాతనిప్రమోషనువిషయము పరిష్కారముగావలసియుండెను.

రంగరాజేశ్వరు లాబండిలోనే వచ్చిరి. అక్కారులో రైలునిలువవలసిన దొక్కనిముసముమాత్రమే. ఐనను, రైళ్ల సంఘట్టనము, కుప్పలదహనము, అసిస్టాంటుకలెక్టరురాక— యివి అపూర్వములుగదా. ఆలస్యము తప్పునా! అందునను కలెక్టరు అక్కారులో కాఫీ నారగించవలసియుండెను. ఎక్కారులో నెవ్వఁడుంగాని రంగరు అక్కారులో సర్వము తానే యైయుండెను. తెలివితో ముందుగా మదరాసునుండి మాయవరము డిప్టీకలెక్టరునకు తనరాకను తంతెమూలకమునఁ దెలియఁజేసియుండెను.

## 3

"మొదలియారుగారూ, ఇంతప్రొద్దుననే మీరు స్టేషనుకు వచ్చినకారణమేమో? రైళ్లసంఘట్టనవార్త మీనిద్రకు భంగముకల్గించినదా?" అని డిప్టీకలెక్టరు సంగతితెలియక చొక్కలింగని హెచ్చరించుకొనెను. "మీరు చాల డస్సినట్లున్నది. రాత్రి నిద్ర లేదాయేమి?"

"అదికాదండీ, నేను లేనిసమయమున నిచట కొంత ద్రోహముజరిగినది. నేను శంకించినట్లైనది. ఎఱుఁగుదురు

గదా కందన్. అతఁడే దీనికిఁ గారణము. రాజద్రోహి. నాకు వైరి. ఈరైతుజనము నతఁడు రెచ్చఁగొట్టుచున్నాఁడు. యుగ యుగములుగావచ్చు సాంప్రదాయముల కడ్డువచ్చుచున్నాఁడు. శాంతిరంగమునఁ జిచ్చువెట్టుచున్నాఁడు. ఇఁక నాతనియాటలు సాగవు. సమయమునకు మీరును వచ్చినారు. అవే చూడుడు. నాధాన్యపుకుప్ప లెట్లు రాత్రి తగులఁబెట్టఁబడినవో! ఇరువదివేల కలములధాన్యము కొల్లగొట్టఁబడినది. నాపాపములకంతయుఁ దగులఁబడినను నాకుఁ జింతలేదు. కాని నాయుప్పుఁదినిన యీక్షుద్రజనము దానిని కొల్లగొట్టుట సహింపఁజాలను. మీ సాయముతో వారు దానినెల్ల వెడలఁగ్రక్కువఱకు సాధించెదను. కడుపులోనున్నను, గుడిసెలోనున్నను ప్రతిగింజయు వారు క్రక్కవలె."

మొదలియారు తనసోదె ముగించువఱకు డిప్టీకలెక్టరు మాటాడలేదు. ఎగఁబడిచూచుచున్నజనము నవలోకించుచుండెను.

"కుప్పలదహనమా? అందుకేగాఁబోలు నీజనసమ్మర్దము. పీనలుకోడులో నది ప్రమాదకరమైన నేరమే? ఎవరు చేసియుందు రీయకార్యము? కందన్ యిట్టిదిసేయునా? మొదలియారుగారూ, మీమాట నిజమా? కందన్ వివేకి. శాంతి, అహింస యని చెప్పుచుండువాఁడు. పేదలకు శ్రీమంతుల యాస్తిలో హక్కున్నదని యేమైన క్రొత్తక్రొత్తసిద్ధాంత

ములు బోధించియుండవచ్చును. కాని మనుష్యులకును, పశువులకునుగూడ నోటికడకూటిని మంటఁగలుపునా? ఆకూట్లను, వాములను దహింపఁజేయ నుత్సహించునా? దౌష్ట్యా యెంతటి ప్రమాదము! అతని ప్రసంగము రాజద్రోహాకరమనుట నిస్సంశయము. మాటలలో రగిలింపు చాలగలదు. అందునను దృఢనిశ్చయుఁడు."

మొదలియారు పట్టలేకపోయెను. "కందర్ పైకి శాంతమూర్తివలెఁ గన్పట్టినను వెదురువలె లోపల నగ్గి. ఏమాత్రము రాచుకొనినను ఫెళ్లుమని బయటపడును."

"కాని మొదలియారుగారూ, నమ్మలేకున్నాను. అబ్బా! ఎంతదౌష్ట్యా. నేను ఉద్యోగములోఁ జేరినప్పటినుండియు నింతటి దౌష్ట్యా నెఱుఁగను. ఇరువదివేలకలముల ధాన్యమా? ఒక్కరాత్రిలో!"

"నాకుమాత్రము సందేహాము లేదండీ. నిన్నసాయంత్రముగూడ కందర్ కల్లంగడికిఁబోయి, తరతరములుగాఁ గూడఁబెట్టఁబడిన ఋణపాపమును తుడిచివేయవలసినదని ప్రతీకారము సలుపవలసినదని రెచ్చఁగొట్టుచుండెనఁట."

"ఏమైననేమి, అందునను మీ కావిషయమున నంత నమ్మకమున్నప్పుడు, ట్రాంక్విబారున కీబండిలోనే పోవుచున్న కలెక్టరుదొరగారిని మీగృహామునకుఁ దీసికొనిపోవుట మంచిది గాదా? ఒక్కగంట వారక్కడ విశ్రాంతి గైకొనవచ్చును.

ఫలాహారము సేయవచ్చును. జరిగిన అకృత్యమును, అపారనష్టమును వారే స్వయముగా జూచెదరుగాక. తరువాత నేను కందర్‌పై దృఢచర్యఁ గైకొనుటయు సులభమగును."

డిష్ట్రిక లెక్టరు ఒక్కక్షణము నిదానించి మఱియు నిట్లనెను. "మొదలియారుగారూ, కందర్ బలవంతుఁడని మీరు మఱచిపోకుడు. అతనికి బలవత్తరులైనమిత్రులు మదరాసు, ఢిల్లీ, లండనులందుఁగూడ కలరఁట. మహాత్ముఁ డతనిపైని కూరిమివహించును. ఐనను కలెక్టరుదొరగారిని మీయింటికిఁ గొనిపోయినవెనుక ప్రతిక్రియ లాలోచించెదము."

"అంతకన్నఁ గావలసినదేమి! కలెక్టరుగా రొకగంట గాదు, ఒకసంవత్సరముండినను నేను వారికి సర్వమును నా గృహమున సమకూర్చెదను."

"మంచిమాట. మీసీడన్ కారు సిద్ధముగా నున్నదా?"

"అదే, మీయిష్టము నెదురుసూచుచున్నది."

స్టేషనున కనఁతిదూరమున నొకకొబ్బరిచెట్టునీడను మొదలియారుగారిసీడన్ కారు లేయెండలో మెఱయుచు వేచియుండెను. ఒకకుఱ్ఱవాఁడు కేవలము తమాషాకొఱకు బుర్ బుర్ మని రబ్బరు నొత్తుచుండెను.

డిష్ట్రికలెక్టరు, లేకలేక యీఅపరవయస్సులో నధికారుల యనుగ్రహముకొఱకు ధరించినసూటులో సర్కసుయేనుఁగు వలె నడయాడుచు రంగన్ రాజేశ్వరు లున్నబండిని సమీపిం

చెను. "దొరవారికి క్షమాపణ. ట్రాంక్విబారులోఁ దమరును అమ్మగారును విడియుట కింకను సర్వము సిద్ధపఱుపఁబడలేదఁట. అక్కాఁరులోఁ దమరు ఫలాహారముసేయ ననుగ్రహింతురా? వీరు చొక్కలింగమొదలియారుగారు, తాలూకాబోర్డుఅధ్యక్షులు, జిల్లాబోర్డుసభ్యులు, తాలూకాలోనెల్ల గొప్పమిరాశీదారులు, సుమారు రెండువేలయెకరములభూమిగలవారు. ప్రభుత్వమునకు వీరిచ్చుశిస్తుమొత్తము మీజిల్లాలోనెల్ల గణనీయము. చేరువనే వీరియుద్యానగృహము గలదు. తమరును, అమ్మగారును ప్రయాణపుబడలిక కచట నేడదేరవచ్చును. సాయంత్రము ట్రాంక్విబారున కందఱముగలిసి సీడన్ కారులోఁ బోవచ్చును."

"డిప్టీకలెక్టరుగారూ, యేర్పాటుభారమంతయు మీదే." అని రంగన్ ఆవులించుచు జవాబుచెప్పెను.

డిప్టీకలెక్టరు ప్రక్కనున్న సుందరమువంకఁదిరిగి, "స్టేషనుమాస్టరుగారూ, ఇఁక మీరు రైలును పంపించివేయవచ్చును. మేము ట్రాంక్విబారునకు కారులోఁ బోయెదము." అనెను.

రంగన్‌రాజేశ్వరులు బండిదిగి నిష్క్రమణద్వారమునకు దారివట్టిరి. జవానులు హాజావిడిగా ముందేఁగుచుండిరి. స్టేషనులో మూగియున్నజనము తనకు స్వాగతమిచ్చుటకై వచ్చియున్నదని రంగన్ భావించెను. డిప్టీకలెక్టరు పైకి చురుకుగా

గన్పట్టకపోయినను, కార్యసాధకుఁడనియు, తెలివిగలవాఁడనియు కలెక్టరున కప్పుడే సదభిప్రాయ ముదయించెను.

## 4

"కందా, నీవా! ఎట్టిసుముహూర్తము! దిగి దిగకముందే దర్శనమిచ్చినావు. బోటు మెయిలులో నిన్నుఁగూర్చియే తలంచుకొనుచుంటిమి. మాతలంపులే నిన్నిక్కడికిఁ దెచ్చినవిగావలయు." అని రాజేశ్వరి నాలుగడుగులు వెట్టఁగనే, కందన్ను గుర్తించి హెచ్చరించుకొనెను.

"నీవా, రాజీ! నాకన్నుల నమ్మలేకున్నాను" అని కందన్ చుట్టునున్న జనమును తప్పించుకొని ముందుకువచ్చెను.

కందన్ ప్రశాంతమూర్తి. రాజేశ్వరి ఆతనియెదుట నిలిచినంతనే, ఆమెహృదయమునఁ బూర్వముప్పొంగినప్రణయ ఝరి వెండియు విజృంభించెను.

"కందా, అపూర్వదర్శనము! ఇట్లు తలవనితలంపుగా నిన్నుఁ గలిసికొనుట." అని రంగన్‌గూడ కందనును హెచ్చరించుకొనెను. అతనికిని ఆక్సుఫర్డురోజులసాంగత్యము విస్మృతముగాలేదు. రంగన్ కందన్‌తోఁ గరస్పర్శగావించెను. స్టేషనులోనిజనము నిర్ఘాంతపోయెను. మొదలియారు ఆశలు చల్లవడెను.

సుందరము సందిగ్ధావస్థలో నుండెను. రంగస్వామి నెక్కడనో యెట్లో చూచినట్లుండెను. తనకుటీరమునకుఁ బరువిడిపోయి భార్యను పిలిచెను. "సరసూ, చూడుచూడు, నీయన్నలాగున్నది క్రొత్తకలెక్టరు! నేనెప్పుడో ఒక్కసారి మాత్రమే చూచియుంట. బయటికివచ్చి నీవు చూడుము."

సరస్వతి హృదయసంభ్రమముతో బయటికివచ్చెను. సోదరునిఁజూచి పేఁడేండ్లకుఁబైబడెను. మూఁడేండ్లుగా జాబైన లేదు. స్టేషను ఆవరణములోనికి సరస్వతి రాఁగానే రంగస్వామి చెల్లెలిని గుర్తించెను. క్షణమునేపు కలెక్టరునుగదా యని అభిజాత్యముకొట్టుకొనెను. మరునిమిషమున సోదరప్రేమయే పైచేయియయ్యెను. అందునను ఫుల్లకమలమువలె విరాజిల్లుసరస్వతిని సంభావింపకుండు టెట్లు!

"సరసూ, నన్ను క్షమింపుము. కొన్నియేండ్లుగా నీకు జాబైన వ్రాయనైతిని. అపచారమునాది."

"జాబుకేమిలే రంగా, సోదరప్రేమకు కలము సీరా లనావశ్యకము. నన్ను జ్ఞప్తియందుంచుకొంటివి. అదియే చాలును. నిన్నుఁ దలఁచుకొననిరోజే లేదు నాకు. నీవింత యున్నతికి వచ్చిన యీవేళ నిన్నుఁజూచుటకు మనతల్లి లేకపోయెను గదా."

"మనదురదృష్టమది. పోనీ, నీవిక్కడ రైలుకొఱకు వేచియున్నావా?"

"నేనెప్పుడు రైళ్లకొఱకు వేచియుండు తే."

"అ దేమి?"

"అకస్మారుస్టేషనుమాస్టరుభార్యను."

ఇట్లనుటకు సరస్వతి సిగ్గుపడ లేదు. కనుతెప్పలప్రాల్చ లేదు. నిశ్శంకముగా, నిరభిమానముగా నిజావస్థ నెఱుక పఱిచెను.

ఒక్కక్షణము రంగన్ కలఁతజెందెను. కాని మఱుక్షణమునఁ గలఁకదేఱి యి ట్లనెను.

"సరసూ, నీకిఁక సత్వరాభ్యుదయము గల్గును. ఇట్టిచెల్లెలిని నిన్నుఁగని నేను గర్వించుచున్నాను. మనవంశము కృతార్థమైనది. అమ్మయే యిపుడు నిన్నుఁజూచిన నెట్లుండునోగదా!"

రంగన్ సరస్వతులు చేతిలోఁ జేయివేసి ముందునడచిరి. కందన్ రాజేశ్వరు లనుసరించిరి. వీరిరువురును భావపరంపరాపరవశులై పరస్పరము భాషింపలేదు. తిన్నగా నందఱును తమకై వేచియున్న సీడన్ కారును సమీపించిరి. అక్కడనే పొన్నన్ కూడ నిలిచియుండెను. రాజేశ్వరి యచ్చెరువందెను. సరస్వతి ననుసరించి కామాక్షియు నేతెంచెను. సరస్వతియు నాశ్చర్యపడెను.

"ఏమి పొన్నన్, నీవును అకస్మారులో దిగితివా? ట్రాంక్విబారున కేలబోలేదు?" అని రాజేశ్వరి ప్రశ్నించెను.

"అమ్మా, ఇఁకముందు నేను మీయనుచరుఁడను. జాతీయోద్యమమున మీదాసుఁడ. మీరు వలదన్నను మీచరణముల నాశ్రయించియే ప్రాణములఁ గోల్పోయెద."

కావున, పొన్నన్ కామాక్షీలును కారులో నెక్కిరి. అర్ధరును మొదలియారుగారిగృహమునకు వాయువేగముతో వెడలిపోయిరి. రోడ్డు చక్కగా నుండెను. అవును, తాలూకాబోర్డు అధ్యక్షు నింటికైనను దారి సరిగా నుండవలదా, సంవత్సరమున కొకలక్షరూపాయలు రోడ్లకొఱకై ఆతని యధీనమైనపుడు.

డిప్టీకలెక్టరు మొదలియారుగార్లు అతిథులను కారువఱకు ననుసరించివచ్చి, ఈసారి కారులో వచ్చెదమని చెప్పి సెలవు దీసికొనిరి. తిరిగి కారువచ్చువఱకు వారు కందన్ అదృష్టమును, రాజేశ్వరిసౌందర్యమును తలపోయుచు, విచిత్రసంఘటనకు విస్మయమందుచుండిరి.

సుందరము కొంతకుఁగొంత కథను విప్పఁదొడఁగెను. క్రొత్తకలెక్టరు తనబావమఱఁది యని సగర్వముగాఁ జెప్పుకొనెను. వినువారు విభ్రాంతులైరి. కందన్ విషయమునఁ దన కల్పనాశక్తి నొక్కింత వినియోగించి, అతఁడు లండనులోనేకాలేజీలోనో వీరికిఁ బరిచయుఁడై యుండవచ్చునని కథను ముడివేసెను.

కందక్ క్రొత్తకలెక్టరునకు విహితుఁడని తెలియుట తోడనే, మొదలియారు ఆశలు చల్లవడెను. ప్రతిక్రియారంభ ముడిగెను. కాని డిప్టీకలెక్టరుమాత్రము నిష్ప్రహాజెందవలదనియు, శాంతిశాసనములవిషయమునఁ దొలిచర్యఁ గైకొనవలసినది తానని యు, బ్రిటిషున్యాయశాస్త్రము ననుసరించి మనిషికి మనిషికి భేదము పాటింప వీలులేదనియు, తప్పక దోషి శిక్షితుఁడగుననియు నోదార్పుమాటలఁ జెప్పసాగెను. రెండు వేలయెకరములుగలిగి ప్రభుత్వమునకు శిస్తుఁజెల్లించువారిలో మేటిగ్గైన మొదలియారునకు న్యాయముగల్గక తప్పదని యుబ్బించెను.

డిప్టీకలెక్టరునకు మొదలియారునెడల నవ్యాజానురాగము కాదు. త్వరలోఁ దనకూతురిపెండ్లి జరుగవలసియుండెను. అందులకు మొదలియారువంటిభూస్వాములసాయ మమూల్యము. ఏవస్తువునకుఁ గొఱఁతయుండదు. తనయింటిపెండ్లి వైభవము నెల్లవారును మెచ్చుకొనఁగలరు.

ఇట్టి యన్యోన్యాశ్రయముననేగదా జీవితపురహస్యాఖ్యములు పర్వతోత్సంగశిలాగృహంబులఁ దేనెతెట్టువలట్ల శోభాయమానమగును.

నిరంతరము పొలములం దడుసు బురదలఁ బరిశ్రమించి తనరైతుజనము భద్రముగా సమకూర్చినభాగ్యరాశిని మొదలియారు తనకు గౌరవనీయులగువారిపై నతిమాత్రముగ వెద

జిల్లును. ప్రకృతియవస్థయు నిట్టిదేగదా! తుమ్మెదలు మేలు పువ్వులపొమ్మఁదిరిగి, దేవతలకు నెఱుకవడనివిధమున నవి మంచు నుండి వడదేర్చినమకరందమును బొట్టుబొట్టుగా నాకర్షించి, భానుమయూఖసంస్పృశితంబును సమీరసంచారసమాహ్లాదితంబును, నిర్ఝరిణీపరిష్వంగసమ్మోహితంబును, నక్షత్రచుంబితంబునై యలరారుపర్వతపంక్తులకుం గొనితెచ్చి, పరిశ్రమించి, తెట్టువలఁగట్టి, కడకు నిర్దాక్షిణ్యుండును, అపహర్తయు నగు మానవునకు సమర్పించుకొని, దిక్కుమాలి, జుంజుమ్మని ఘోష పెట్టుచున్నవి.



# పదమూడవ ప్రకరణము.



## ట్రాంక్విబారు

ట్రాంక్విబారుపట్టణ మొకప్పుడు తూర్పుతీరమున కెల్ల రాణివంటిది. ఇప్పుడు వృద్ధనారి. కాలశైథిల్య మాపురముఖ మున విస్పష్టముగా లిఖితమైయున్నది. కాని యౌవనమున సుందరియని యిప్పటికిని తోపించుచిన్నెలు కొన్ని గలవు.

సముద్రము నానుకొని, వీరషోలకానదీముఖమునకు సమీపముగా నెత్తైన యిసుకతిన్నెలపై నీపట్టణము నిర్మితము. కొబ్బరి, మామిడి, నారింజతోపులు విస్తారముగా గలవు. మట్ట మధ్యాహ్నమున సూర్యకిరణములు సాగరజలంబుల నుడికించు నప్పుడును, ఛాయాదేవి వృక్షసీమ నాశ్రయించి శోభిల్లును.

ట్రాంక్విబారునకు పూర్వచరిత కొంతకలదు. రెండువేల యేండ్లక్రిందట కరికాలచోళుఁడు రాజ్యమునేయు కాలములో, ప్రధాననగరమైన పుహారున కిది దక్షిణపుటెల్లగా నుండెను. పుహారు పదిమైళ్లవిస్తీర్ణముగలిగి, సర్వసంపదల కాలవాలమై చెలువారినది. ఱెక్కలుపఱచుకొని, భూమిపై నేదదేరిన విహంగముభాతి, కాలాంబరములోని కెగసిపోయినది.

మూడువందలయేండ్లక్రిందట డేనులీదేశమునకు వచ్చి నపుడు, ఇచటనే మంచికోట నొకదాని గట్టుకొనిరి. కోట యిపుడు శిథిలమైయున్నది. బ్రిటిషుప్రభుత్వమువారు దాని నొకపాంథశాలగా మార్చినారు. ప్రభుత్వోద్యోగు లిచ్చట విడియుచుందురు. ఆడేనిషుసైనికులకన్న ధైర్యమునఁ దీసిపో వచ్చునుగాని ప్రకృతోద్యోగులు జీతముల నధికులే. ఇప్పు డీకోటగృహమును అసిస్టాంటుకలెక్టరు రంగస్వామికి వాస యోగ్యముగా సిద్ధపఱచిరి.

## 2

వారంద ఱిచటికివచ్చి యైదురోజులాయెను. ఇక రెండు రోజులలో రంగస్వామి తంజావూరు అసిస్టాంటుకలెక్టరుగా నుద్యోగస్వీకారము సేయవలసియుండెను. కాని అతనిసందిగ్ధా వస్థ వర్ణనాతీతము. రాజేశ్వరీబాయి త్యాగపథము ననుసరింప దృఢనిశ్చయయైయుండెను. రంగస్వామి బ్రతిమాలి విఫలుఁ డయ్యెను. అతనిహృదయమును ఊటాడిపోవుచుండెను.

కాని కలెక్టరుపనిఁ ద్యజించుట యన సామాన్యమా? అందునను రెండేండ్లు ఉద్యోగవైభవ మనుభవించినాఁడు. జీవితాంతమునకు గవర్నరుపదవికూడ లభ్యపడవచ్చునే. సిరి నెట్లు కాలఁదన్నుటి? అయినను రాజేశ్వరిప్రేమ బలీయము. తనచెలియలు సరస్వతికిని రాజేశ్వరికినికూడ అత్యంతము

చెలిమికుదిరెను. వారిరువురును అబలలయ్యును దేశసేవయనిన బొంగిపోవుచుండిరి. తాను వారిని విడనాడుకొనుటెట్లు?

ఆదినము మధ్యాహ్నము రెండుగంటలకే తూర్పుగాలి తిరిగెను. జాఫ్నా, సింహళద్వీపములనుండి యాపధలతాపరిమళములను గొనితెచ్చి సమీరుఁ డాహ్లాదముం గూర్చుచుండెను. శిథిలమైనకోట చెవియొగ్గి సాగరసంగీతమునఁ గ్రొత్త సంగతికై వేచియున్నట్లుండెను. కర్కాటకములు జలరేఖప్రక్కన సరసర పరువులెత్తుచుండెను. అలలు విధివిరామములేక తీరమును కడగి మెఱుఁగువెట్టుచుండెను. అలఁతిదూరముననే వీరపోలఁ నదిలో సన్ననినీటిపాయ సముద్రమునుండి పాఱుచుండెను. మిగతయేఱు సైకతమయము.

సముద్రపుగాలి పొరలుపొరలుగా వీతెంచెను. కోట తలుపులు గవాక్షములు గణగణ మ్రోయుచుండెను. గాజుతలుపులు గడగడలాడెను. కోటలో ముందుభాగము నిరాచ్ఛాదమైన నలుచదరము. దీనివలన నింకను ఆప్రాంతభవనమునకు గొంత శోభ. మిగిలినకోటయంతయుఁ దలతగులుకొట్లతోఁ గూడియున్నది. కాని ఉన్నతమైన బురుజొకటిమాత్రము గలదు. దానికి చుట్టుయెక్కువలెను. అక్కడనుండి నదీసాగరసరసోల్లాసంబులఁ దనివితీఱఁ జూడవచ్చును.

## 3

సాయంత్ర మైదుగంటలు. సూర్యుఁ డప్పుడప్పుడే పశ్చిమాద్రి నాశ్రయించుచుండెను. సరస్వతీరంగస్వాములు కోట

బురుజుపై నుండిరి. రాజేశ్వరీకందనులు సముద్రతీరమున భూజల సమాగమఘట్టమున నాసీనులై యుండిరి.

కందన్ సంభాషణ నుపక్రమించెను. "రాజీ, విధివిపర్యాసము విచిత్రము. భగవానుఁ డెవఁడో కర్మలపరిణామమునకుఁ గర్తయనుట నిశ్చయము. చూడుము. నాకు మహాపద సమకూడెను. కర్మయు కీర్తియు స్వేచ్ఛయు క్షయించునట్లు తోఁచెను. నేను మృతప్రాయుఁడ నై పోవుసమయ మది. కాని సమయమునకు నీదర్శనభాగ్య మొదవెను. రంగస్వామి నా దేహమును రక్షించినాఁడు. నీవు నా——"

"కుప్పలదహనము నీతలకుఁ జుట్టఁబడుననిగదా యాశంకించితివి. అది యిప్పటికిని అట్లే జరుగవచ్చును—అవును, రంగస్వామి రాజీనామానిచ్చినచో!"

"రంగస్వామి రాజీనామానిచ్చుటా! ఏమి వేళాకోళమా?"

"అతనికి నాయుపదేశ మది. మనలనుఁజేరి, దేశకార్యనిర్మగ్నుఁడగుట కాతఁడు స్వతంత్రుఁడుగావలయుఁగదా. కందా, లండనురోజులు జ్ఞప్తికిఁదెచ్చుకొమ్ము. నిన్నప్పుడు నేను సరిగా గుర్తింపనైతిని. వేఱొకవ్యామోహము నన్నావరించియుండెను. నీసద్భక్తి నాపిదప ననేకమార్లు తలపోసి నమ్రనైతిని. ఉద్యోగత్యాగివై నీవు దేశమున కుపకారివిగా లేదా."

"రాజీ, నాదొకగొప్పగాదు. దేశమున వేనకువే లట్టి త్యాగధీరులు కలరు. పేరుప్రశస్తిలేని వలంటీరు లేమిసేయ

లేదు! కాని నీయట్టివారిది త్యాగము. భోగమున కాటుపట్టయిన స్త్రీజనము విరాగులగుట. దేశమాతకు మీసేవ అమోఘము."

"నేనట్లు తలంపను. మాపని స్వల్పము; ప్రశస్తి ఘనము. పట్టణముల ప్రాగల్భ్యము మాది. నీవంటివారు ప్రశస్తి రోసి, పల్లెలంజేరి యాయువుపట్టున నతిమాత్రముగఁ బరిశ్రమించు చున్నవారు. నీది త్యాగము. నీబానిసగా నన్ను గ్రహింపుము. నిన్ననుసరించియే నాజీవితమును ధన్యముసేసికొనెదను."

కందర్ప హర్షపులకితుఁడాయెను. "రాజీ, నేనొకమాట నిప్పుడనక తప్పదు. ఇంతవఱకు నది నాకును భగవానునకే యెఱుక. ఇపు డది హృదయమునుండి పొర్లివచ్చుచున్నది. నీవు మెచ్చుకొనుచున్న యీనాసేవయంతయును త్వదనుగ్రహమే."

"నాయనుగ్రహమా!"

"అవును. ఊరకజనించునా సార్వజనీకసమారాధనా సంసక్తత? దానికి వలయుహృదయపరిపాక మెట్టిదో యెఱుంగవా? రాజీ, ఆరోజులు జ్ఞప్తియున్నవా——"

సముద్రతరంగ మొకటి పొరలి యురలి త్రుళ్లుచు వచ్చి రాజేశ్వరిపాదముల ముద్దుగొనెను. ఆమె చెక్కు లెఱ్ఱవాఱెను.

"రాజీ, నేను నిన్నుఁ దలమునుకలుగా ప్రేమించితిని. నారక్తము కుములుచుండెను. నరములందు దివ్యనాద ముద

యుంచెను. సృష్టికౌతుకము నన్నావహించెను. కాని నీవు నన్నుఁ దిరిగి ప్రేమింపఁజాలవైతివి. నాగుణములు నీకు జాలిగొలిపెను. స్త్రీని ప్రేమాధీన మొనర్చుగుణములు కావవి. నే నావిషయమున నిజముగా మందాదృష్టుఁడను. నీవు రంగస్వామిపై నెలమి వహించితివి. అతనివాగ్ధాటి నిన్నానందపారవశ్యగాఁజేసెను. అప్పటి నాదురవస్థ నేమనిచెప్పుదు! వెఱ్ఱియెత్తునట్లుండెను. ఒక దినము నిజముగా స్వవశుఁడనుగాకయుంటిని."

కందన్ వాక్యముల వినుటయందే రాజేశ్వరి నిమగ్నయై యుండెను. పెద్దయల యొకటి వారిరువురినిఁ దడిపివైచినను వారెఱుంగరైరి.

"కాని నాపూర్వీకులకర్మవిపాకమువలనను, నీయుదాత్త శీలమువలనను, నేను నామోహామును వేఱొకస్వరూపముం బొరయించితిని ఒక్కరాత్రిలో నది దేశప్రేమగా మాఱెను. వెంటనే నేటాలుమీదుగా భారతభూమికి బయలుదేరితిని. ఐ.సి.యస్. ఉద్యోగమును తృణముగా త్యజించితిని. నీవు లేక యది కడుంగడు నిస్సారముగా గన్పట్టెను. నిన్నుంగూర్చియే సుమా నేనును రంగస్వామియు ఐ. సి. యస్. నకై పోటీ సల్పితిమి. నేనట్లు నూతనాధ్యాయము నుపక్రమించితిని. జీవితము వెండియు నవమును మధురము నయ్యెను. అనుదినము నిర్మలాంబరము నవలోకించుచు, నారికేళవృక్షచ్ఛాయ నే శయనించునపుడు నీతలఁపులే నాకు నిద్దురంగూర్చెను."

కందర్ హృదయప్రకటనావేగమున డస్సి సైకతమున కొందుగఁబడెను.

"కందా, నీభావములకుఁ బ్రతిబింబములు నాహృదయముననూ గలవు. లేనిచో నింతదూరము బొంబాయినుండి వచ్చియుండను. రంగస్వామి యిప్పటికిని నన్ను నుసరించుచున్నాఁడు. ఒకవిధముగా నేనును అతని వదలుటలేదు——"

"ఏమి యింకను రంగర్ నిన్ననుసరించుటయేనా?"

రాజేశ్వరి యింకను వివాహితగా లేదని, ఆమెనోటనే వినుటవలన కందర్ సమ్మోహితాంతరంగుఁడయ్యెను. అందుచేఁ దన్నామె పెండ్లియాడునని ప్రత్యాశ దృఢమగుటవలనఁగాదు. కాని యామె తనయిష్టమువచ్చినచొప్పునఁ బ్రవర్తింపఁగలదు గదా యని సంతోషము.

"కందా, దేశభక్తి నాహృదయమును ముంచెత్తుచున్నది. దేశస్వాతంత్ర్యసంపాదనమునకై నేను స్వతంత్రనై యుండవలయును. శుభసమయ మిదియే. దీనిని వృథాసేయ రాదు."

"రాజీ నాభావము నట్టిదే. ఇదే సాగరసన్నిధానమున, సాయంసూర్యునిసమక్షమున నేను ప్రమాణముసేయుచున్నాను. నాజీవితము మాతృదేశసేవాధీనము."

కందర్ క్షణముసేపు భగవానునిస్మరించి, పశ్చిమమునకు ముఖము ద్రిప్పెను. సరస్వతీరంగస్వాములు కోటబురుజుపైఁ జూపట్టిరి.

"రాజీ, వారిఁ గన్గొనుము. సరస్వతి నక్షత్రమువలె శోభిల్లుచున్నది."

"కాదు కాదు. చంద్రునివలె. రంగర్ చంద్రునిలో మచ్చ."

"అక్కచెల్లెండ్రయ్యు నెంత తారతమ్యము!"

"చల్లగా జెప్పితివి. సరస్వతి నిజముగా నద్భుతమైన నారి. స్త్రీసౌభాగ్యమునకుఁ బరాకాష్ఠ. ఆమెప్రకృతి దేదీప్యమానమైనది. ఒక్కచూపుననె యెట్టికార్యమునకైన నుదాత్తత నాపాదించఁగలదు. ఆవిడవలన నాచిత్తము స్వాస్థ్యముం గనినది. నూత్నశక్తి నన్నావాదించినది."

ఆధ్యాత్మికసాహచర్యము కందర్ రాజేశ్వరుల నొక్కటి గావించెను. ఈసమ్మేళనము భౌతికబంధమునకన్నఁ దక్కువైనది కాదు. అంతకన్న బలీయమైనదే.

"సరస్వతినిఁగూర్చి యెక్కువచెప్పనేల. నీయభిప్రాయమే నాయభిప్రాయము. అట్టిస్త్రీని నేనెప్పుడునుఁ బూర్వము గని యుండలేదు. మృత్తికను మనుష్యులఁజేయఁగలదు. నీవును సరస్వతియుఁగలిసి పనిసేయుచో, దేశస్వాతంత్ర్యసంపాదనమ్మున కేదియడ్డు?"

"నీవుకూడ."

రాజీ చిఱునవ్వునవ్వెను. కందన్ 'ధన్యోస్మి' అనుకొనె

## 4

ఈయవస్థలో పొన్నన్ నిలిచినిలిచి యడుగులువెట్టు కందన్ రాజేశ్వరులను సమీపించెను. పొన్నన్ వారి కిపు ప్రియమైనఅనుచరుఁడు. కందన్‌తో నతనిబాంధవ్యము ద పడినవెనుక వానింగూర్చినసంశయములన్నియు వారితమయ్యె

పొన్నన్ తనజేబునుండి తంతివార్తను వెలికిఁ "అమ్మా, కలెక్టరుదొరగారేరీ?" యనిప్రశ్నించెను.

"దొరగారు అంబరతలముననున్నారు. ఏదీ ఆ తము?"

రాజేశ్వరి కవరుఁజించి, తంతెఁ జదివెను. కందన్ కేవల సముద్రఘోష నాలకించుచు, భంగభంగురములఁ దిలకిం చుండెను.

తంతెలో నిట్లుండెను.

"రంగస్వామి. ఐ. సి. యస్. ట్రాంక్విబారు.

పాల్ని కొండలకు అసిస్టాంటు సెటిల్మెంటుఆఫీసరు బదలాయించడమైనది. వెంటనే పనిలోఁ జేరవలసినది."

రాజేశ్వరీబాయి సంతోషముతో బొంగిపోయెను.

"కందా, నాజోస్యము సత్యమైనది. రంగన్ సెటిల్మెంటు ఆఫీసరుగా కొండలుకొలుచుటకుఁ బోవుననుకొనను. స్నేహితులతో రంగన్ వాగాడంబరుఁడుగానున్నను, సమరమున దిగెనేని బ్రిటిషు ప్రభుత్వ మాతని కార్యధీరతను రుచిచూచునుగాక."

కందన్ నిర్ఘాంతపోయెను. "ఇదేమి! ఈతంతె నిజమగునా? నిర్నిమిత్తముగా రంగస్వామి కుద్యోగమునఁదీసి కట్టు! ఏమి, యెవరేని మనసంభాషణల ననుదినము ప్రభుత్వమున కెఱుకపఱచుచుండిరా?"

పొన్నన్ చేతులు నలుపుకొనుచు, అధోముఖుఁడై ముందునిలిచియుండెను.

"అమ్మా, దొరగారెక్కడ?" అని మెల్లగా నడిగెను.

"పొన్నా, అదే బురుజుపైనున్నాఁడు. ఇఁకనేమి కలెక్టరుదొర!"

రాజేశ్వరి సంతోషించెను. పొన్నన్ వెడలిపోయెను. కందన్ సంశయాత్మకుఁడై, "రాజీ, యీపొన్నన్ విశ్వాసపాత్రుఁడేనా? మదరాసునుండి చారుఁడుగాదుగదా" యని ప్రశ్నించెను.

"కందా, నీతో బంధుత్వముసరియేనని నీవంగీకరించితివే. అందువలన నతని నమ్మితిమి."

"కాని, నాకాతనిపై ననుమానము. చూపులలో నేదో కౌటిల్యమున్నది. శ్రద్ధగా నాతనిఁ బరిశీలింపవలెను."

"తొలుదొల్త నింకనుఁ గుటిలుఁడుగా గన్పట్టెను. సరస్వతీసన్నిధానమున నిప్పుడు మెలఁగెక్కుచున్నాఁడు."

"ఐనను జాగరూకత మంచిది."

"మంచిదాయాదివే నీవు!"

# 5

పొన్నర్ త్వరత్వరగా కోటవైపు నడిచెను. అతని జేబులో మఱొకతంతివార్త గూఢాక్షరములతో నుండెను. దానిని వెంటనే రూపుమాపవలసియుండెను. అందలిశుభవార్తను వెండియుం జదువ నుత్సహించెను అందిట్లుండెను. "అద్భుత ప్రయోగమునకు నీకేబదిరూపాయలు జీత మెక్కుడుసేయఁబడినది. ఇంకను వారివర్తనలఁ గనిపెట్టుచు కబురుసేయుచుండవలసినది. మొదలియారును వారితోఁ జేరునని నీవు వ్రాయునది సత్యమేని, రంగస్వామి బదలాయింపు నిచ్ఛగింపక రాజీనామా నిచ్చునేని, వెంటనే ఆవిషయము తంతెఁగొట్టవలసినది."

రహస్యాక్షరములైనను, తనయొద్ద నదియుండుట భద్రముకాదని పొన్నర్ భావించి, చేరువనున్న మంచినీళ్లబావిని సమీపించెను. అప్పుడచట నెవ్వరును లేరు. ఆతంతెను ముక్కలుముక్కలుగా చింపి నీళ్లలోఁ బడవైచెను. వెనుదిరిగి, సరస్వతీరంగస్వాములు తన్నవలోకించిరో యని సంశయాత్ముఁడయ్యెను. లలాటమునఁ జిఱుచెమరుగ్రమ్మెను. పొన్నర్ మెట్లఁ

బడి బురుజు నెక్కఁ బరువెత్తెను. మెల్లెక్కుచుండఁగా నాతనికి మంచినీళ్ల బావి వెండియుఁ దలఁపునకువచ్చెను.

సముద్రమున కంత చేరువనుండియు నాబావిలోనిజలము లెంతమధురములు! దుష్టులు చుట్టియున్నను సజ్జనునిభావము లిట్టివని యాదేశించునా? ఎన్నినదుల తియ్యనీరుకలిసియు సముద్రము ఉప్పనయేగదా! ఏమి తనవర్తన కుదాహరణమా?

ఇట్లాలోచించుచుండఁ దటాలునఁ గామాక్షి హెచ్చరించుకొనెను. "పొన్నా, యేమి టాబావిలోఁ బారవైచితివి? మంచినీళ్ల కదొకటేగదా శరణ్యము. ఏమివేసితివో నాతోఁ జెప్పవా?"

అనూకారులైరి ల్వేస్టేషనులోఁ బరస్పరము చూచుకొన్నది మొదలు పొన్నుఁ కామాక్షీ లొకరినొక రభిమానించుకొనిరి. పొన్నుఁ రంగస్వామి కనుయాయిగాఁగాఁ, గామాక్షి సరస్వతి యందఁ జేరుకొనెను.

"నీళ్లకుఁ జెడుపైన దేమియు లేదు, పిల్లా. జెప్పుమనెదవా చెప్పెదను. రహస్యముగా నీచేతిలో జార్చవలసినప్రేమలేఖ. ధైర్యముచాలక బావిలోవేసితిని. అందువలన నాజలములు ప్రేమమధురములై, నీవు త్రాఁగినంతట నీయాత్మలో నా ప్రేమగీతమును వినిపించుఁగాకయని."

పొన్నుᴇ సాహసించి కవితసెప్పెను. కాని కామాక్షి యెడఁ గన్పఱచిన ప్రేమభావముమాత్రము కల్పనగాదు. వాని చిత్త మాపిల్లంగూర్చి చాల మెత్తపడియుండెను.

కామాక్షి కనులవ్రాల్చి, సిగ్గుతోఁ బ్రియమైె చూపట్టెను. ఆసందిగ్ధావస్థనుండి వెలివడుటకై "చేతిలోనితంతె యెవరికి? కలెక్టరుదొరగారికా?" అని ప్రశ్న వేసెను.

"అవును. వారికే. ఇదే పరువునఁబోయివచ్చెదను. క్షణము తారసిల్లుము." అని పొన్నుᴇ వడి వెడలెను.

అక్కడ, కందᴇ రాజేశ్వరులు తంతెవిషయమును రంగస్వామి యెట్లు గ్రహించునో యని వితర్కించుచుండిరి.

"ఊరక తొందరపడి రంగᴇ ఐ. సి. యస్. ఉద్యోగమును కాలఁదన్నునా? ఒకమండలమునకు రాజుగాగదా యుండవచ్చును! సామాన్యులకష్టనష్టములు వారిని స్పృశింపనైన వెఱచునే!" అని కందᴇ సంశయమును వెల్లడించెను.

"మఱి రంగᴇ పాల్నికొండలలోఁ దపస్సుసేయునా? నీయంత త్యాగిగాకపోవచ్చును. కాని రంగᴇ పందగాఁడు. ఎగ్మూరుస్టేషను టికెట్టువ్యవహార మతనిఁ గలఁచివైచియున్నది. చిఱుతవిషయములే గురుపరివర్తనలకుఁ గారణము. అంతేగాదు. అతనిచెలియలు సరస్వతి యూరకొనునా? తెలివిగలతనసోదరుని రిత్తపుచ్చదు. మఱి నేనుమాత్ర మతని వదలుదునా—ఇంకను నాయెడ నతని కభిమాన లేశమున్న?"

"అవును, నిన్నుఁగూర్చియే అతఁడు పదవినిఁ గాలఁదన్ను ననుకొందును. అదిగో, రాజీ, వారిచే దిగివచ్చుచున్నారు. శృంఖలములు తెగిపోయినట్లున్నది. అదేమి పొన్నన్ అట్లు పర్వెత్తుచున్నాఁడు?"

పొన్నన్ చేత నొక కాగితముపట్టుకొని దగ్గఱ తపాలా కచేరీకి వాయువేగమునఁ బర్వెత్తుచుండెను.

"రంగన్ తన రాజీనామా నంపుచున్నాఁడు గావలయు."

ఇంతలోనే రంగన్ వారిం జేరెను. హర్షముతో నతఁడు- "రాజీ, ఆపాడుఉద్యోగమున కిపుడే స్వస్తిజెప్పితిని. నీవు నిజముగా జోస్యముపల్కితివి. పాల్నికొండలలో సెటిల్మెంటుఆఫీసరా? పొన్నన్ గాదు, నీవు సి. ఐ. డి. గా నున్నావు. ప్రభుత్వ రహస్యములు నీహృదయములోనున్నవి." అనెను.

"అవునవును. మేజిస్ట్రేట్లను దేశభక్తులఁజేయురహస్యములుగూడా." అని రాజేశ్వరి నవ్వెను.

అప్పుడే సీడన్ మోటారుధ్వని విననయ్యెను. కోటకుత్తరముననున్న మైదానమున నది దృశ్యమైనిలిచెను. చొక్కలింగము ముందుదిగెను. వెనుకనే సుందరము కరియనులు.

రంగస్వామినిసమీపించి మొదలియా రిట్లనెను. "దొరగారూ, ఒకచిన్నసహాయము. రైల్వేఅధికారులతోఁ జిక్కు వచ్చినది. ఈసుందరముకరియనులు నాకు మిత్రులు. రైళ్లసంఘట్టనమునకై వీరి నుద్యోగమునుండి తొలఁగించిరి. ఆసంఘట్టనకు

నేనే కారణము. గంటకుముందుగా నేను రైలును నడిపితిని. మీరు కొంచెము మీపలుకుబడి నుపయోగించి, వీరినిఁ గాపాడవలెను. యావజ్జీవము కృతజ్ఞుఁడను."

"ఒక్కటేచిక్కు. నేనిప్పుడు కలెక్టరునుగాదు. మొదలి యారుగారూ, ఇపుడు మీరెంతో నేను నంతియే. దేశము కొఱకు నే నుద్యోగముఁ ద్యజించితిని. మీవంటిమిరాశీదారులు దేశశ్శ్రేయమున కీవిషమతరుణమునఁ దోడ్పడనిచో వేఱెవ రుద్ధారకులయ్యెదరు?" అని రంగఁడు వెంటనే ప్రచారమారంభించెను.

"ప్రశస్తవంశజులు, ఈచుట్టుపట్లకు సహజముగా నాయకులు. మీరు తప్పక మాయుద్యమమునఁ జేరవలయును." అని రాజేశ్వరియు నుత్సాహము వెల్లిగొల్పెను. సరస్వతి నిశ్శబ్దముగా దేవళమున నమ్మవారివిగ్రహమువలె నిలిచియుండెను. ఆమెచూపులుమాత్రము మొదలియారుహృదయము నుదాత్త సేవాశృంగముల కెగురవేయుచుండెను. ఆసంధ్యావసరమున చొక్కలింగమొదలియారునకు జీవితపరివర్తనారంభమయ్యెను. సాగరతరంగాంబువు లతనిపాదములఁ గడుగునట్లు, ఉదారజీవన పారావారవీచీసముదాయ మాతనిహృదయమును ఝాళిత మొనర్చెను.



# పదునాల్గవ ప్రకరణము.

---

## వాక్కర్మలవ్యత్యాసము.

“రంగా, నీవింకను వాఙ్మోహితుండవై యున్నావు. వాక్సంరంభమునఁ గర్మలు డిందువడును. దీనితత్వము నీకు లెస్సగా తెలియును. ఐనను చాపల్యము నిన్ను వీడకున్నది.” అని కందర్ శుద్ధమనస్కుఁడై రంగస్వామిని హెచ్చరించెను. మాటలపటాటోపము కందనునకు గిట్టదు.

కోటడాబాపై కందర్ సరస్వతులును రంగర్ రాజేశ్వరులును వలయముగా గూర్చొనియుండిరి. సముద్రపుగాలి చల్లగా వీచుచుండెను. క్రుంకుమెట్టఁ జేరిన సూర్యభగవానునికిరణశబలత త్రుళ్లియాడుసాగరతరంగములకు వింతసొగసు గూర్చుచుండెను.

“కందా, నీకింకనుఁ బూర్వాభిప్రాయములు మాఱినట్లు లేదు. వాక్కున కెంత మహిమగలదు! శాంతిరస మొలుకు నీవచనముల ప్రభావమే నీవెలుంగవుగాఁబోలు. నాకుమాత్రము శ్రోత్రప్రియములు. చేత కసాధ్యము చెప్పుట కసాధ్యము గాదుగదా! వాక్ప్రభావమునఁగదా మానవచారిత్ర మింత మహోన్నతింగనినది. వాక్స్ఫురణ లేనిజీవనముత మోపరివృతము.

సృష్టికిని లయమునకుంగూడ వాక్కే సాధనము. ఎట్లైనను వాక్కే రమణీయము. మృగమానవభేద మందుననే గలఁదు."

"దేవులవలెఁజెప్పుట, మృగములవలెఁ జేయుట. ఇదియే మానవుని మొదటిదౌర్బల్యము. వాచాలురు దేశస్వాతంత్ర్య సంపాదకులుగాఁజాలరు. పరిశుద్ధకర్మయే యోగము. హిందూ దేశము ప్రాచీనకాలమునుండియు సత్యోదారతత్వముఁ బ్రక టించినది. కాని కార్యరూపమున సార్థకపఱచలేదు. అందువల ననే మనము పతితులమైతిమి. జాతులందు మనజాతికి గౌర వముపోయినది. చలనములేదు. సాధనలేదు. భారతజీవనము మహాప్రవాహముగా నుండుటకుబదులు ముఱికిగుంటయై నిలిచిపోయినది."

"ఈ నీఉపన్యాసమే వాక్ప్రభావమునకుఁ దార్కాణ. నాహృదయము చలించినది."

రంగా, కర్మసేయక మన మక్కఱకురాము. వాక్కులు మిణుగురుబురువులవంటివి. చుట్టుప్రక్కఁ జిమ్మచీఁకటిలోఁదళుక్కు మనును. తేజఃపుంజమును కర్మ యొసఁగుగాక. అపరిణతాశయు నకే వాక్చాపల్యము."

తన కీవిషయమై సందేహమే లేనట్లు కందర్ప తలయూఁచి, యింకను యిట్లు చెప్పఁదొడంగెను. "కర్మయే అగ్ని. కర్మ ప్రజ్వ లింపఁగనే వాక్కులనురవలు సమసిపోవును. మనము కార్య దక్షులమయ్యెదము. ఆశయసిద్ధికై పాటుపడుదము. భారత

దేశమునకు విజ్ఞానములేకగాదు నిస్సారమైయుండుట. కార్య దీక్ష నుజ్జగించుటయే కారణము."

"ఐనను కందా, వాక్కు నట్లలక్ష్యముసేయఁదగదు. యోగులు వాక్కు మానుదురుగాక. కాని రాజకీయోద్యమములకు వాక్సంరంభమవసరము. త్రాడులేక బావినుండి నీరు చేదవచ్చునా?"

"రంగా, నీఉపమానము లటుండనిమ్ము. వస్తుతత్వమును విస్మరించుట కవి సహాయకారులు."

"అట్లుకాదు. వస్తువును మఱింత వెలిగించును. కర్మల వలన జీవనము ఛిన్నమగును. వాక్కులవలన నైక్యముం బొరయును. మన కాంగ్రెసుసంస్థకును వాక్ప్రభావము దెలియును. ముప్పదేండ్లుగా నిది వృద్ధినంది, మహోన్నతమైన వాక్సౌధమైనది. జాతీయోద్యమమున వాక్కు మహోపకరణము. హృదయము పొంగిపోవునపు డిది కలుజువంటిది. ఇంతకును నా సలహా యిది. ఈజిల్లాలో మన మొకమహాసభ జరుపవలెను. దానితో నుద్యమమున కంకురార్పణము."

"దానివలనఁ బ్రయోజన మేమి? అనవసరముగా చిక్కులుగొనితెచ్చుకొనుట. ఈకాలమున నుపన్యాసముల కెవరు మోహపడెదరు? కార్యము ప్రధానము" అని కందఁడు శాంతముగా బదులుసెప్పెను.

"అట్లుకాదు. ఏమూలనో జీవితపర్యంతము పరిశ్రమించి భౌతికప్రయోగ మొకటి సాధించితినని వెల్లడించుటగాదు రాజకీయము. బహిరంగముగా విచ్చలవిడిగా మాట్లాడవలె. హృదయములం దుత్సాహ ముదయింపఁజేయవలె. కర్మ దీని ననుసరించివచ్చును. వాక్కులు మెఱసినవెనుక, కర్మ యుఱుమును. వీటి కవినాభావసంబంధము. మహాసభాప్రయత్నమున కడ్డు రాకుము. ఇదే చూడుము మైదానము, అట్టిసమావేశమునకై కనిపెట్టుకొనియున్నది. ఇట శంఖారావముం బూరింతము. ప్రపంచమంతయు వినుఁగాక."

"ఏమి, డప్పుఁ గొట్టి సభ చాటింతురా?"

"ఇంకను ఆప్రాతపద్ధతియేనా? మదరాసుపత్రికలకు తంతెకబు రంపెదము. సంపాదకులను దీనికిఁ బ్రఖ్యాతినిమ్మని కోరుదము."

"ఆహా! నీయుద్దేశ్యము నాకు స్ఫురించినది. రాజీనామా వార్తను విఖ్యాతమొనర్చి, సంపాదకీయముగా పొగడ్తఁ గనవలె ననియున్నదిగాబోలు!" అని రాజేశ్వరి అందుకొనెను. రంగస్వామి కొంచెము చిఱుక్కుమనెను.

"రాజీ, నా దేశభక్తిని నీవు గేలిసేయవచ్చును కాని, యీజానపదులకు సభకన్న నాకర్షణీయము, ఉత్తేజకరమునగు విధ మొండులేదు. ఇంత పెద్ద దేశములో సభలవలనఁగాని ప్రబో

థము జరుగనేరదు. వాక్కర్మలేకము, అభిన్నము, ఏకోదర జన్యము."

ఎవ్వరు నడ్డుమాటాడకుండుటవలన రంగఁడు మఱింత యుత్సాహముతో నిట్లనెను.

"కందా, సభను జరుపనిమ్ము. ప్రాతట్రాంక్విబారునకు నూత్నశోభవచ్చును. మదరాసుపత్రికలందుఁ బ్రఖ్యాతమగును. రాజీ నడుగుము. నామాట నామె అంగీకరించు నను కొందును."

రాజీ యిట్లనెను. "కందా నీమాటయందు నాకు గురుత్వము. రంగస్వామితోఁ గొంతకుకొంత యేకీభవింతును. పోనీ, ఈసభనుమాత్రము జరుపుదము. రంగస్వామిలోఁగల్గినమార్పు ప్రపంచమునఁ జాటింపఁబడుఁగాక. అతనిజన్మస్థలమగు నీమండలము ధన్య మగుఁగాక. ఏమో, వానివాగ్జృంభణ మొకఅరగంటసాగనిమ్ము. తరువాత నిమ్మళముగా కార్యభారము వహించుఁగాక. సోదరదేశీయులకు సందేశ మొసఁగక జైలుకుఁ బోవువాక్కూరుఁడుండునా? మానవప్రకృతి అట్టిది. సమ్మతింపుము కందా."

"కాని రంగా, నీసోదరియే నీవాద మంగీకరించుట లేదు. వాక్కులు వృథ యనుచున్న దామె" అని కందఁడు పల్కెను.

"కందా, ఆమెకు రాజకీయము లేమి తెలియును? ఆమె శీలమున కీర్యైహికలాంఛనములు నిమ్నాతినిమ్నములు."

"రంగస్వామికి నేనడ్డము రాను. ఉపన్యాస మతనికి వినోదము. ప్రయోజనముతో నతనికినిమిత్తము లేదు. అదిగో, ఆబాలురు సముద్రములోనికి గవ్వలువిసరుచున్నారే, దాని వలన సముద్రమునకుఁ జలనమున్నదా? కాని అది వారివినోదము. అట్లే రంగస్వామియు. ఈసభ జరుగనిండు. నేనును మాఅన్న ఉపన్యసింపఁగా వినలేదు. విని ధన్యనయ్యెదను. తరువాత నతనికి జైలుప్రాప్తి గల్గినఁగల్గుఁగాక. కాని నాకొకసంశయము. కలెక్టరు సభను నిషేధించునేమోగదా?"

"నేను నట్లే ఆశంకింతును. సరస్వతిమాటలో సత్యమున్నది." అని కందన్ తోడ్పడెను. కాని రంగస్వామి ఒక్కసారి మాటలదొర్లించెను.

"అదేమి! అసాధ్యము. ముప్పూటి కట్లు జరుగనేరదు. లాన్సుదొర నన్నెఱుఁగఁడా? నిన్నటివఱకు నేను కలెక్టరునకుఁ గుడిభుజమనుగదా. నాస్థానముననున్న నటరాజన్ గూడ నన్నంతచులకననేయునా? నామాటలసత్యము రూపించుటకు నాప్రభావముచూపుటకునైన నీసభను జరుపవలెను."

ఇంతవఱకు మౌనమువహించి, వీరిసంభాషణల నాలకించుచున్న చొక్కలింగమొదలియారును పలుకుట కిది యదనుగా భావించి యిట్లనెను.

"నేను మీలోఁజేరితినని కలెక్టరునకుఁ దెలియును. సభను వారు నిషేధింప సాహసింపరు. అందులకు నేను జవాబు

దారి. సభ జరిపి చూతముగాక. తాలూకాజనము నందఱి నిచ్చటకుఁ జేర్చెదను. కందఁ మాటను నేనిపుడు శిరసావహింప సంసిద్ధుఁడను."

ఇట్లు పలికి చొక్కలింగము సరస్వతివంక మరలెను. ప్రక్కనే కామాక్షియు చెలువారుచుండెను.

చొక్కలింగ మిపుడు పూర్వపుమనిషిగాఁడు. సుడివడిన జలములు చివరకు సరిగా ప్రవాహముంగలిసిపాఱురీతి, నతఁడు విషయలౌల్యమును వదలించుకొని త్యాగాసక్తుఁడై శుద్ధజీవనుఁ డాయెను.

సభను జరుపవలసినదని చివరకు నిశ్చయించిరి. చొక్క లింగ మిట్లు చాటెను.

"శుక్రవారము సరిగా నాల్గుగంటలకు తాలూకాజన మెల్ల నిట నుండున ట్లొనర్చెదను. నారైతుజనము నందఁ, మూఖఁ, కాశేరీలు, ఇరుల్లఁ, కరుప్పఁ, ఇరుల్లప్పనులు, గోవిందఁ, పవడాయి, నల్లనులు అశేషజన మిచట సమావేశ మయ్యెదరు. నామనుష్యులందఱిని మీాకధీనముసేయుచున్నాను. వారిసాహస మద్భుతము."

ఈలోపుగా రంగస్వామి నాలుగుపంక్తు లొకకాగితముపై లిఖించి పొన్నుస్వామినిఁ బిలిచెను. "పొన్నా, యిదిగో దీనిని తపాలాఫీసునకుఁగొంపోయి, తంతెఁగొట్టుము."

ఫౌన్ను సద్యః సిద్ధముగానుండెను. వెంటనే అతఁడు బయలు దేరెను.

"అదేమి మదరాసుపత్రికలకు తంతెయా?"

"అవును." అని రంగస్వామి మిన్నకుండెను.

ఇపుడు రంగస్వామి కార్యధీరుఁడాయెను.

## 2

ఇదేసమయమున మఱొకచోట మఱొకనాటకము. వల్లం తంజావూరు కలెక్టరునకు వాసస్థలము. అదొకచిన్నపల్లె. ఒకమిట్టపైనున్నది. పంటలకు లోటులేదు. సమశీతోష్ణము.

తంజావూరుజిల్లా దక్షిణరాజధానిలోనెల్లఁ బ్రశస్తమైనది. భూమి సారవంతమైనది. ధనధాన్యసంపత్తియు, నాగరికతయు, ప్రాచీనౌన్నత్యమును గర్వకారణము. ఈజిల్లాకలెక్టరు పదవి ననుభవించుట రాచఱికము ననుభవించుటయే. తమిళదేశమున ఐ. సి. యస్. ఉద్యోగు లెప్పుడు దీని నాశించుకొని యుందురు.

లాన్సుదొర ఇరువదిమూడువత్సరము లుద్యోగముచేసి యీపదవినందెను. అతఁడు కార్యశూరుఁడు. తనశక్తికి కలెక్టరు పని చాలదని యతనిదృఢాభిప్రాయము. ఈసర్వీసులోఁ జిన్నప్పుడే చేరకయుండినచో, క్రోమరు, కర్జనులవలెఁ బ్రఖ్యాతుఁడై యుండ వలంతినని భావించును. చేరినదానిలోఁ జివర

మెట్టు తంజావూరుకలెక్టరే. అది యిప్పుడు లభించెను. కాని లాన్సుదొరకు సంతృప్తిలేదు. అందువలన సానుభూతియు నంత మాత్రమే.

జిల్లాలోని ప్రజలకందఱికిఁ దాను సంరక్షణకర్తయని లాన్సుభావము. కాని అందఱును తనయిష్టమును శిరసావహింప వలెను. ఇతరులకు స్వేచ్ఛాధికారము లుండరాదు. మనుష్యులేల, యేటినీరుసైతము వంకరలు దిరుగక నేఱుగా కాల్వలందుఁ బాఱవలెనని యాశించుమహానుభావుఁడు. క్రూరుఁడుకాదుగాని సంకుచితబుద్ధి.

దేశములో స్వాతంత్ర్యోద్యమము చెలరేఁగినదనియు, తనమండలమునను శాంతికి భంగముకలుగఁగలదనియు నితనికిఁ దెలియఁగానే, కఠినచర్యల నవలంబింప నిశ్చయించెను. అధికారత్రయమును సమావేశపఱచెను. అనగా జిల్లాపోలీసుసూపర్నెంటు, అసిస్టాంటుకలెక్టరు, సరే తాను.

అసిస్టాంటుకలెక్టరు నటరాజన్ కలెక్టరున కిట్లు సలహా నిచ్చెను. "లాన్సుగారు, భీతావహమున కవసరమేలేదు. గాంధీగారే సబర్మతినుండి లేచివచ్చి తంజావూరులో మకామువేసినను, ఇచ్చట కదలికయుండఁబోదు. నే నీజిల్లాలోఁ బుట్టి పెరిగినవాఁడను. వీరితత్వము నాకుఁ దెలియును. ఈజిల్లాలోఁ బూర్వము రాజకీయవేత్తలు, సేనానులు పుట్టిరట. ఇపుడు వకీలు

గుమాస్తాలు, కోర్టుపత్రములువ్రాయువారు, భీమాకంపెనీల యేజెంట్లుదప్ప, వేతెవ్వరు నుత్పన్నమగుట లేదు."

"ఎప్పుడైన నొక అసిస్టాంటుకలెక్టరు!"

నటరాజన్ చిఱునవ్వు నవ్వెను. "నేజెప్పునదిది. ట్రాంక్విబారునుగూర్చి మీరు ఆందోళనపడవలదు. ఏదో రంగస్వామి కొంతవాగినవెనుక నాయుత్సాహము చల్లారిపోవును. పోయిపోయి, పనికిమాలినప్రాతపట్టణము ట్రాంక్విబారులోనామహోదయము!"

"కాని, కందన్ సామాన్యుఁడుగాఁడు. నీవే అతనిఁగూర్చి జాగరూకతవహింపుమని యంటివి. నీమాటవిని, నే నింతవఱకు కతనివదలితిని. లేకున్న మొదలియారుమాట ననుసరించి, అతని బందిజేసియుందును."

"కందన్ నాకులెస్సగా దెలియును. అతఁడేదో కొందఱు జానపదుల నుద్ధరింపవచ్చును. అంతేగాని జనసముదాయమును రెచ్చగొట్టఁజాలఁడు. ప్రచార మతనికి వెలి. ఈకాలమునఁ బ్రచారములేక యేమగును?"

కాని, యిపుడు రంగస్వామి అతనిజేరినాఁడు. ఇరువురుం గలిసి సరిపోవుదురుగదా. నీపద్ధతినిఁ జూచినను ప్రమాదము నకుఁ గారణమున్నట్లు తోఁచును. వారినిద్దఱినిఁ గలియనీయ రాదు."

"వారినందఱి నేనెఱుఁగుదును. ఆక్స్ఫర్డులో మూడేండ్లు వారితోనుంటిని. రాజేశ్వరీబాయిలో మహత్తుగలదు. అందఱి నొకకట్టునకుఁ దేఁగలదావిడ. ఇపుడు రంగస్వామి రాజీనామా నిచ్చినాఁడుగదా. గుంటూరునకు నాబదలాయింపు రద్దుపడిన దనుకొందును."

"ఏమి గుంటూరనిన నీకయిష్టమా?"

"అవసరమైనఁదప్ప,అచటికిఁ బోనొల్లను. ఇప్పటి ప్రభుత్వ విధానమేమియు బాగులేదు. తియ్యమాటలలో నెంత ప్రభావ మున్నదో ప్రభుత్వ మెఱిఁగినట్లులేదు. మెగ్డొనాల్డువంటి వానిని రాజప్రతినిధిగా పంపుడు. మానవసౌభ్రాతృత్వము, సమత్వముంగూర్చి అతఁడు మధురముగా ప్రసంగించును. ఆ మాటలతో హిందూదేశము స్వస్థపడును. ప్రతిజిల్లాకును మెగ్డొనాల్డువంటివానిని బంపినచో మఱీమేలు. అతఁడు తెలివైనవాఁడు."

"ఏమి, నీకతనితోఁ బరిచయమున్నదా?"

"లేకేమి! మేమందఱము, రంగన్‌తోసహా, అతనికొఱకు బ్రిటిషుయెన్నికలందుఁ బాల్గొంటిమి. రంగన్‌కూడ అచేవాగ్ధోరణిఁగలవాఁడు. కాని కందన్ అట్టివాఁడుకాఁడు. కార్మికపక్షమునకు మెగ్డొనాల్డు యెప్పుడో ముప్పుదెచ్చునని అతనిభయము. ఉద్యమ మింకను ప్రథమావస్థలోనుండగా మెగ్డొనాల్డు దానికి మహోన్నతింగూర్చి ప్రఖ్యాతముసేయఁగలఁడు. కాని అధికార

ప్రాప్తిగల్గెనేని, మాటలను కార్యపరిణామ మొందించుటకు వెనుదీయఁగలఁడు. అవసరమున, నేదో కారణముచూపి తప్పించుకొనును."

"నటరాజా, ఆవిషయము లటుండనిమ్ము. సామ్రాజ్య సమస్యలు ప్రధానామాత్యులకు వదలుదము. నాజిల్లావిష యము నన్ను బాధించుచున్నది. రంగన్ కందన్ రాజేశ్వరి వీరందఱు ట్రాంక్విబారులో నేకమై యేదో కలవరముగల్గింపఁ గలరు. నీవేమో వారినిఁ దక్కువసేయుచున్నావు. మఱి మొదలి యారుకూడ వారిలోఁ జేరెనా తప్పక అల్లరిజరుగఁగలదు. శాంతికి భంగమువచ్చును. వానికి తాలూకాలో బలగము చాలగలదు."

"కాని మొదలియారు అట్లేలసేయును? భాగ్యనష్టము నకుఁ గారణమేగాని లాభములేదే? వానికేటి దేశభక్తి! తన మోటారుకారుకొఱకు మంచిరోడ్లువేయించవలెనని జిల్లాబోర్డు, తాలూకాబోర్డు యెన్నికలందుఁ దగులొని యున్నాఁడు. అతఁడు మాఱుట దుస్సాధ్యము.

"నీమాటలే నీవు మఱచిపోవుచున్నావు. ఆముగ్గురిలో మహాత్తుగలదంటివిగదా. మదరాసునుండి ప్రభుత్వవార్తయు నట్టిదిగానున్నది."

"అందువలననే, మనము నిర్బంధవిధానమునకుఁ గడంగ రాదని నాహితవు. వారు తమమహాత్తు నుపయోగించుట కవ

పరముగల్పింపరాదు. నిజమైనవార్తలు వచ్చువఱకు వేచియుండము. మనసూపర్నెంటు అభిప్రాయమేమో?"

"ఏమండీ మీయభిప్రాయము?" అని లాన్సు ప్రశ్నించెను.

"నేను ఖచితపుమనిషిని. వెంటనే అల్లరిజరుగకుండా, ప్రతిక్రియల గైకొననిచో నేనీమండలమున శాంతిసమర్థనమునకు బాధ్యుఁడనుగాను. వారందఱిని మూడునెలలు జైలుకుఁ గొట్టవలసినది. పల్లెలందంతయుఁ దిరిగి వారు తమనూత్నభావములఁ బ్రచారముసేయనీకుండఁ జేయవలెను. సంవత్సరము క్రిందటనే, కందను చర్యలమట్టువెట్టఁదగునని నేను సలహానిచ్చియుంటిని."

"ఇప్పుడే, యేమైన వార్తలువచ్చినవా?"

"మఱి పదినిమిషములలోవచ్చును." ఎవరిరాకనో సూపర్నెంటు యెదురుసూచుచున్నట్లుండెను.

పదినిమిషములలోఁ జారుఁడు తంతివార్తఁ దెచ్చెను.

"సరే, నేను చెప్పినట్లే జరుగుచున్నది. ఇదే కడవార్త. సర్వము కల్లోలమునకు సన్నాహముగానున్నది. మొదలియారు గూడ ఉద్యమములోఁ జేరినాఁడు. శుక్రవారముసాయంత్రము నాల్గుగంటలకు పెద్దసభ జరుగనున్నది. అల్లరులు తప్పవు. సభను నిషేధించుటే తరణోపాయము. సి. ఐ. డి. పొన్నన్ గూడ విశ్వ

సనీయుఁడుగా దోఁపఁడు. అతఁడును వారినిఁ జేరినట్లుతోఁచును. ఏతట్టుండునది స్పష్టముగా జెప్పలేము."

సూపర్నెంటు ముఖమందుదయమైన చెమ్మటఁదుడుచు కొని, మఱి యిట్లనెను. "నామనుష్యులలోనెల్ల విశ్వాసపాత్రుఁడగు వాఁడొసఁగినతంతె యిది. నాకర్తవ్యము స్పష్టమే. మొదలి యూరు వారినిఁ జేరినచో నచ్చటిపోలీసులు తుపాకీనెత్తరు. వెంటనే మలబారురిజర్వుపోలీసును పంపించవలెను. ఆకోట యింకను వారిచేతిలోనున్నది. ఖాళీచేయవలసినదని తంతేఁ గొట్టవలెను." సూపర్నెంటు దృఢనిశ్చయుఁడై పల్కుచుండెను.

"నేనుగూడ నీతో నేకీభవింతును. ఆలస్యముచేసి ప్రయోజనములేదు. గోటితోఁ జిదుమఁదగినది గొడ్డలితో నఱుకవలసి వచ్చును. పోలీసుయేర్పాట్లు మీాయిష్టమువచ్చినట్లు సేయుఁడు. కాని త్వరపడి తీవ్రచర్యఁ గైకొనవలదు. నేనును శుక్రవారం ఉదయం, చేరువనే అక్కూరులో మకాము వేసెదను."

అప్పుడే మఱొకజవాను తంతెవార్త నింకొకదానిఁ దెచ్చెను? సభకుఁ జాల చాటింపుసేయఁబడినది. రంగేరాజేశ్వరులు చాలచుఱుకుగనున్నారు. మదరాసుపత్రికలకు వార్త పోయినది. శుక్రవారమునాడు అల్లరి తప్పదు."

లాన్సు చాల చకితుఁడాయెను. ఇరువదిమూాడేండ్లు తన అనుభవములో నిట్టి ఉద్యమము, కల్లోలము యేమూాలను లేదు. సూపర్నెంటును నటరాజును పంపివేసెను. తనజిల్లావిషయమేమాాయని ఆలోచించుచు విశ్రాంతిగదిఁ బ్రవేశించెను.

# పదునేనవ ప్రకరణము

## తెప్పకొయ్య.

అప్పుడే తెల్లవాఱుచుండెను. ప్రభాతవాయువులు చుల కనైయుండెను. వేగుచుక్కయు ప్రొద్దుపొడుపుంగని వెల్లనగు చుండెను. ఆదినము శుక్రవారము. కార్యప్రసక్తికి శుభావసరము. లేయెండయందు శోభ తళ్కొత్తుచుండెను.

కందర్ యెల్లప్పుడును పెందలకడనే లేచువాఁడు. ఆ నాఁడును వేకువనే లేచి వాహ్యాళి వెడలివచ్చి, వీరపోలర్ నదీ ముఖమున నేకాంతముగఁ గూర్చొని, జలస్థలాకాశస్థిత ప్రశాంతి నవలోకించుచుండెను.

కందర్ తనముందున్న యిసుకను తోఁడ నారంభించెను. వెంటనే ఊటజలము భూగర్భప్రవాసమునుండి విముక్తిగాంచి వెలికివచ్చెను. ఈజలోద్భూతిం గని కందర్ స్వాతంత్ర్యసమ్మో హాంతరంగుండయ్యెను.

నేలలో జలములు ఖైదువడియున్నవి. సముద్రమున నేల ఖైదువడియున్నది. అవస్థాభేద మట్టిది. కాని నిగూఢసత్త్వాం తర మొండుగలదు. జీవితపరివర్తనయు నిట్టిదేగదా. మూల

సూత్రము నరసినవారికే శాంతి. తదితరులకు సంసారసాగర భంగతాడనమే. ఇట్లని తలపోయుచు కందర్ చెంతనున్న చిల్లి గవ్వలపై గోటితో నేదో లిఖించుచు సముద్రములోనికిఁ వాటినిఁ బాఱవైచుచుండెను.

ఫెళ్లుమని యెండ యెల్లెడల వ్యాపించెను. ప్రభాత ప్రశాంతి భంగమాయెను. సముద్రపుటలలు లేయెండలో మెఱయుచు, దరికి దూకులాడుచుండెను. పోటువచ్చి సముద్ర జలము నదిలోనికి సాగిపోయెను. నదీముఖముననున్న యొక కొయ్యమొద్దుపై కందర్ కూర్చొనియుండెను. సింహళముననే యడవిలోని తరుకాండమోయిది! ఈతూర్పుతీరమున వడ్రంగి చేతఁబడి తెప్పగా తీర్పునొంది సముద్రమున ననుదిన విహార మొనర్ప వేచియున్నది.

సముద్రపుపోటు నీరు మఱిమఱియెక్కువై నదిలో రెండువైపుల యిసుకను కోసివైచుకొని వ్యాపించుచు వచ్చుచుండెను. ఇఁక నాల్గునిమిషములలో నీకొయ్యమొద్దును జలాధీనమగును.

కందర్ గుడ్డలు తడుపుకొనుట కిష్టములేక కొయ్యను వదలి లేచివచ్చి ఆదృశ్యము నవలోకించుచుండెను. సముద్రజలములు పొరలుపొరలుగా వచ్చుచుండెను. చివర కొక యల కొయ్య కూచిగానున్న ప్రక్కను చుట్టుకొనెను. కొయ్య కొంచెము ఊఁగాడెను కాని తడియిసుకలో మఱింత కూరుకొనెను.

మఱియొకనీళ్లపొర పొంగివచ్చెను. అప్పటికిని మొద్దు కదల లేదు.

సరిగా నీరు తాఁకునప్పుడు నేను దీని కొక త్రోపు నిచ్చెదనుగాక యని కందర్ తలఁచెను. మఱియొకఅల రాఁగానే, కందర్ ప్రొద్దుననే తడియగుదునని శంకింపక, పోయి కొయ్యమొద్దును ద్రోసెను. దీనితోఁ గొయ్య తేలియాడ నారంభించెను. మఱియొకఅలవచ్చి త్రోపాడఁగానే అది యేటిమధ్యమునకుఁ దేలిపోయెను. దానిపై సూర్యకిరణములు స్వారిచేయుచుండెను.

కందర్ ఈదృశ్యముం గాంచి యిట్లు తలపోసెను. ఒక దేశములోని జనసముదాయమును ఈకొయ్య మొద్దువంటిదే యగునా? జాతీయోత్సాహంపు వెల్లువవచ్చి వారినిఁ గదలించు వఱకు నిశ్లే పాతుకొనియుందురా? కాని ఒక్కమాఱు సంచలనముకల్గెనేని వారివిజృంభణమునకు విహారమునకు సాటి యేది?

ఆసమయమునకు రంగర్, రాజేశ్వరి, సరస్వతి, కామాక్షి చొక్కలింగనులువచ్చి కందర్‌ను గలిసికొనిరి. కందర్ యిసుకతిన్నెపైఁ బ్రబోధమునసలుపవచ్చిన మహాప్రవక్తయో యన నొప్పారుచుండెను.

## 2

"కందా, ఆకొయ్యను నీటిలోనికిఁ ద్రోసినది నీవేనా?" అని సరస్వతి ప్రశ్నించెను.

"అవును. నీకెట్లు తెలిసెను?"

"దానికేమి? ఆమాత్ర మూహింపఁజాలనా? ఏమి దాని పై నీదృష్టి నట్లులగ్నము నేసితివి? అదేమైన గుణపాఠ మొసఁగు చున్నదా?"

"నాకును వినఁగుతూహలము." అని రాజీ కలుపుకొనెను.

"నిజమే ఉదయమున నేను దానిపైఁ గూర్చుని యుంటిని. స్థావరముగా నది నెలకొనియుండెను. కొంతసేపటికి పోటుప్రారంభమాయెను. అలలు వరుసగావచ్చి దానినిఁ జుట్టు ముట్టుచుండెను. కాని కొయ్యమొద్దు కదలలేదు. అలల కించుక దోడ్పడుద మనుబుద్ధి నాకుఁ బొడమెను. సరిగా సమయము జూచి అల రాఁగానే, త్రోపుఁద్రోసితిని. అంతట నది యేటిలోఁ దేలియాడ నారంభించెను. బహుశః నేను ద్రోయకపోయినను అది కదలియుండెడిదేమో."

"ఉండదేమో! పోటు తగ్గిపోవచ్చును. కొయ్యమొద్దు అచ్చటనే నిలిచిపోవచ్చును. నీత్రోపువలననే అది కదలినది." అని సరస్వతి పల్కెను.

"కావచ్చును" అని కందఁడు అంగీకరించెను.

"మఱి అందువలని గుణపాఠమేమి?" అని రాజేశ్వరి ప్రశ్నించెను.

"తెలియదా, ఆకొయ్యమొద్దే జనసముదాయము. పోటుజలములే జాతీయోద్యమము. కందన్ త్రోసినత్రోపే దేశభక్తునిత్యాగకర్మము" అని సరస్వతి చెప్పివైచెను.

"మఱి సాయంత్రము రంగస్వామిసభయో?" అని రాజీ చిఱునవ్వునవ్వుచు ప్రశ్నించెను. అందఱును గొల్లునవ్విరి.

"నాసభ నట్లు హేళనసేయకుడు. అది కేవలము చేతిత్రోపుడుగాదు. సముద్రపుపోటువలె నొక్కమారు జనసముదాయము నూటాడించఁగలదు. చూడుడు! సభ యెంతజయప్రదముగా జరుగునో!" అని రంగన్ బజాయించెను.

"రంగన్ మాటలు వినఁగా నాకు రాత్రి వచ్చినకల జ్ఞప్తికివచ్చుచున్నది. నాకు సామాన్యముగా నిద్రలోఁ గలలు రావు. రాత్రివచ్చిన దొకభయంకరస్వప్నము. సరిగా వేకువన నిద్రలేచుటకుఁ బూర్వము—"

"అవును. కందన్ గాఢముగా నిద్రపోవును. కొంచెము గుఱకదప్పు!" అని రంగన్ అనెను.

"మొదలియారులాగు. గొప్పపుట్టుకలక్షణ మది!" అని సరస్వతి నవ్వెను. అందఱును నవ్విరి. మొదలియారుగూడ నవ్వెను.

"కందా, ఏమిటాకల? రంగన్ సభనుగూర్చి కలఁ గంటివా? కలలొక్కొకప్పుడు భవిష్యత్సూచకములు." అని సరస్వతి యాతురతతోఁ బ్రశ్న వేసెను.

"సభను పోలీసులు చెదరగొట్టిరని కలగంటివా?" అని రాజీ నవ్వెను.

"అట్టికల రంగస్వామికి రావలయును." అని సరస్వతి తనసోదరుని మేలమాడెను.

"నిజమే, కాని రంగస్వామికి రాత్రంతయు నిద్రపట్ట లేదే! పాపము!" అని రాజీకూడ పరిహాసము సేసెను.

"పరిహాసింపవచ్చినవారు ప్రార్థింపనిలిచిరి" అని రంగస్వామి ఆంగ్లవేదము నుద్ధరించి మిన్నకుండెను.

కందన్ యీనవ్వులాటకు స్వస్తిజెప్పదలఁచి తనకల నారంభించెను.

"నాకలమాత్రము మీకెఱింగించెదను. దానియర్థ మును మీరే నిర్ణయింపుఁడు. అనేకవిధములుగా దానికి వ్యాఖ్యాన మొనర్పవచ్చును."

"అన్నికల లంతే." అని రంగస్వామి మాటజార్చెను. కందన్ నిశ్శంకముగా తనధోరణిని సాగించెను.

"సరిగా వేకువ నాలుగుగంట లై యుండును. నాకుఁ గలవచ్చెను. ఒడలంతయుఁ జెమర్చెను. గుండె కొట్టుకొనుట

నిలిచిపోయినట్లుండెను. మిన్నుమన్ను నేకమొనర్చుచు, మాన వాకృతిం దాల్చినపెనుభూత మొకటి దృశ్యమయ్యెను. అతని చేత నొకపెద్దకొరడా యుండెను. దివిటీలతో బూచులసహస్ర మాతనిఁ గొలుచుచుండెను."

"ఆభూతమునకు వాహనముండెనా?"

"అవును."

"మహిషమా?"

"కాదు. చాలా చిన్నఖడ్గమృగమొకటి ఆమహాకాయ మును మోయుచుండెను. ఆభూతము భూమికి దిగి రైలు స్టేషనువంకవచ్చెను. అతనిచేతికొరడా ఖంగుమని మ్రోఁగెను. దానికొస మాయవరమున నప్పుడే బయలుదేరనున్నరైలుఇంజి నునకుఁ దగిలెను. రైలు కమ్మలపైఁ దలక్రిందాయెను. నే నా స్టేషనుమాస్టరునైనట్లు భావించితిని. నాఉద్యోగ మూడిపోవు నని ఆమహాకాయుని బ్రతిమాలుకొంటిని. తిరిగి కొరడా నాతఁడు ఝుళిపించెను. రైలు సరిగా లేచి నిలుచుకొనెను. అంత నాభూతము మెల్లగా నదివైపు నడచివచ్చెను. తిరిగి అతనిచేత కొరడా ఖంగుమనెను. అప్పుడాస్థలమంతయు నద్భుతముగా గుబాళించెను. సముద్రమంతయు గులాబీఅత్తరుతో నిండినట్లుండెను. నే నాశ్చర్యపడితిని." కందర్పకలను వర్ణించుట వలననే అలసినవాఁడాయెను. ముఖమునఁ గ్రమ్మినస్వేదబిందువులఁ దుడిచివైచికొని యింకను యిట్లు చెప్పఁదొడఁగెను.

"ఆభూత మంత నదిని దాటెను. ఆఖడ్గమృగమున కీనది మోకాళ్లవఱకైన రాలేదు. ఆభూతముశిరము ఆకాశమంటి యుండెను. ఏదో ఒకటి రెండుమాటలు వెలువడెను. కాని నాకు వినరాలేదు. వచ్చి చివర కది నేనింతకుపూర్వము నీటిలోనికిఁ ద్రోసినకోయ్యమొద్దుపైఁ గూర్చొనెను. ఆభారమునకుఁ గొయ్య యిసుకలోఁ గూరుకొనెను. అంతట నాభూతము వాహన ముతోఁగూడ సముద్రములోనికుఱికి కొరడాతో నలలను పైకి లేవఁగొట్టెను. నిశ్చలముగానున్న సముద్రమున నలలు మిన్నం టుచులేచెను. ఆభూత మంతట సముద్రములో నొకఘర్జాంగు దూరమేఁగి, దరిని నిద్రపోవునాపై నొకనిశితవీక్షణముఁబఱపి కొరడాను తిరిగి ఝుళిపించెను. నాకెక్కడనో హృదయము నకు దగ్గఱ నది తగిలినట్లు బాధకల్గెను. ఆనొప్పికిఁ దటాలున మేల్కొంటిని. అంతయు నొకభయంకరస్వప్నమని తెలిసి కొంటిని. నాజన్మలో నిట్టికలఁగనియుండలేదు. పడకవదలి పరు వెత్తితిని. మీరందఱు నిద్రపోవుచుంటిరి. చంద్రుఁడు మైదా నమును వెన్నెలలో ముంచివేయుచుండెను. నాహృదయమున కించుక ఉపశాంతియయ్యెను."

"ఏదో విపత్తురానున్నదని నాకు భయముగుచున్నది. సాయంత్రపుసభను నిలిపివేయవలయును." అని సరస్వతి దీన ముగా వేఁడుకొనెను.

"కలనుగుఱించి అడలిపోవుటా? మనకార్యదీక్ష కది తగదు. నిజమునకు, తంజావూరుకలెక్టరు మనసభనుగూర్చి

కొందరపడునట్లులేదు. రంగన్ ఊహ సత్యమేగావచ్చును. సభ శాంతముగా జరిగిపోవు ననుకొందును. కాని తరువాతి కార్యక్రమ మాలోచించవలెను. సభలతోనే సిద్ధికల్గదుగదా!" అని కందన్ కలవలనివైకల్యమును విసర్జించిపల్కెను. అందఱును తప్పక కార్యక్రమ మాలోచించవలెననిరి.

రంగన్‌కూడ సరియే ననెను. ప్రొద్దెక్కుచుండుటచే వారందఱును చేరువనున్న యిసుకతిన్నె నీడఁజేరిరి.

## 4

"స్వరాజ్యమనగా దేశముననున్న ముప్పదిమూడుకోట్ల మందికి సుభిక్షగా నుండవలెను. ఎవరికి వలయుపని వారికి, దానికిఁదప్పని సరియైనప్రతిఫలము కల్గవలెను. బాహ్యాంతర్జీవనములందు సృష్టివైచిత్రిసఫలీకృతముగావలెను. అప్పుడే భరతవర్షము పుణ్యభూమియగును. అట్టి స్వరాజ్యమునకే మనము పాటుపడవలెను" అని కందన్. "అవును. దేశభక్తుల పరిశ్రమము వలన, స్వార్థత్యాగులరక్తపాతమువలన నీదేశభాగ్యము పండునప్పటికి సరిగా పైపైన పరిభ్రమించుజమీందారులు, వ్యాపారులు, కోటీశ్వరులు పంటనంతటి నపహరింపకుండునట్లు జాగ్రత్తపడవలెను. దేశము సాధించిన నూత్నాధికారమును వారు బీదజనసముదాయము నడంచివేయుట కుపయోగింపకుండఁ జూడవలెను. స్వరాజ్యమున నట్టి పరపీడనమున కవకాశముండరాదు." అని రంగన్‌కూడ అంగీకరించెను.

"ఈ దేశముననున్న దే జనము. ఇప్పుడు శీతకాలమునఁ జెట్లయాకులవలె వారు వృథాపతనముం బొందుచున్నారు. స్వరాజ్యము వారికి శక్తిసారముల నొసంగవలెను." అని రాజీ హెచ్చరించెను.

"ఈ దేశమున భూమిశిస్తు పద్ధతులవలన నూటికి యెనుబదిమంది అష్టదరిద్రులగుచున్నారు. రైతు లెంతపాటుపడినను, లాభము వారిది కాదు. వారినిఁ బీడించుకొనుతినువారిది. పుష్కలమైనపంటను బండించురైతున కాపూటకుఁ గూఁడు లేదు. నల్లగాపఱచుకొనియున్న ఆప్రత్తిచేలలలోఁ బ్రత్తినిఁ బండించురైతున కొడలినిండబట్టలేదు. ఇంటిదగ్గఱ బిడ్డలు శుష్కించుటం గాంచినకన్నులం గ్రమ్ముబాష్పములనుఁ దుడుచుకొనుటకు వలయుగుడ్డపేలికగూడ లేదు. మఱొకరి కభ్యుదయముంగూర్చుటకు మనము పాటుపడుట—ఇదియే ఈ దేశమునఁగల అనర్థము. లోపలను, బయటనుగూడ మనస్వాతంత్ర్యమును వమ్ముసేయుచున్నదిదియే." అని రంగస్వామి వివరణముం గావించెను.

"రంగా నీవుచెప్పినది నిజము. అప్పుడప్పుడు మనము హిమాలయశిఖరములవలె మహోన్నతులఁ గనుచుందుము. కాని మనసామాన్యస్థితిమాత్రము కడునీచము, దుర్భిక్షకాలవాలము." అని రాజేశ్వరియు మాటగలిపెను.

రంగఁడు తనధోరణి నిట్లు సాగించెను. "మన కాఅన్యోన్యత, సహృదయత లేవు. ప్రజాజీవనమును పవిత్రీకరించి సౌఖ్యా

వహా మొనర్పగల శక్తిసంపన్నత లేదు. యువకులకును వృద్ధుల కును మధ్యను దాటరానియెడమున్నది. సర్వజనసేవాసుమంబు లనుకూర్చి మాతృకంఠోపహారముగా రచింపగలప్రేమసూత్రము ఛిన్నమైయున్నది" అంతట కందర్ వంకఁదిరిగి యిట్లనెను. "నీవన్నమాట నిజము. కార్యమే సారము. మాట శుష్కము. మనము స్వార్థత్యాగులమై ఆత్మగౌరవసంపాదనార్థము పరి శ్రమింపవలెను. ఇకాలమున దేశము నొకమహాశక్తి ఆవ రించినది. దానిని వృథాపోనీయరాదు."

కందర్ హర్షించెను. "నిజము, నిజము. స్వరాజ్యనిర్మాణ మున మనము స్వార్థములఁ బరిహరింపవలెను. నిరంకుశాధి కారులకును, భీరులకును ఈపుణ్యభూమిలోఁ జోటుండరాదు. స్వరాజ్యసంపాదనమే మనకుఁ బరమావధిగాదు. ఎట్లనియు స్వరాజ్యము వచ్చుచున్నది. రాక తప్పదు. కాని వచ్చినవెనుక, దేశములోఁ బ్రతివానికిని, అంధభిక్షునకున్నైతము నాస్వాతం త్ర్యమును సమన్వయింపవలెను. దీనికి వలయుధైర్యత్యాగ ములు మనకుండవలెను."

"తేలికగా స్వరాజ్యమువచ్చునందువా?"

"తప్పక. మఱి మూఁడేండ్లలోఁ జూడుము. దేశమంతయు నొక్కమారు స్వాతంత్ర్యగాన మారంభించినయెడల, దానిని స్తంభింపఁజేయఁగలశక్తి దేనికిఁ గలదు? దేశీయోత్సాహము

సముద్రమువలె పొంగియున్నది. సాధనసామగ్రి సర్వ ముప పన్నము."

"వాయు వనుకూలించినగదా?"

"తప్పక అనుకూలించును. మన నౌకానాయకులు మెలకువతోఁ బ్రవర్తింపవలెను. స్థైర్యసహనములఁ బ్రకాశింపవలెను. అప్పు డెట్టిసుడులుగాని శిలలుగాని దీనిని భగ్నమొనర్పఁ జాలవు. మన దేశము విశాలమైనది. దీనిసమస్య లపూర్వములు. ఈ దేశమున మొదటినుండియు నాధ్యాత్మికసమాహారము గలదు. దాని నిపుడు భౌతికప్రయోజనముగా మార్చవలెను. అందులకు రాజకీయమే పూర్తిగా మారవలెను."

"అది యెట్లు?"

"ఉన్నతము, ఆధ్యాత్మికముగావలెను. ఇప్పటిరాజకీయము పాషండము. భాగ్యవంతులకు భాగ్యము, బీదలకు బీదతనము వృద్ధిఁబొందించుట యిప్పటిరాజకీయసాంప్రదాయము. సర్వజనీనాభ్యుదయమే రాజకీయమునకు మూలతత్వము. దానినే కార్యకలాపమున సంఘటింపవలెను."

"కందా నీవును, వాగ్ఝరింబడిపోవుచున్నావు. కార్యక్రమమును వివరింపుము." అని రాజేశ్వరి తిన్నగా మందలించెను.

"కార్యక్రమమును తయారుచేయుట తేలికపని. ఆదర్శప్రాయమైనరాజ్యాంగమును పూర్వు లెందరో రచించియు

న్నారు. కాని పరిస్థితు లెప్పటియట్లే యున్నవి. మనకు వలసినది మానవులు. వారు మహాసత్వులు, స్వార్థత్యాగులు, ప్రేమరూపులుగా నుండవలెను. ప్రజారాధనాసక్తి వారిహృదయాబ్జములందు మకరందమువలె సహజముగా సముత్పన్నముగావలయును. గాంధివంటివారు కోటికొకరుగా ప్రపంచపుకై మోడ్పు నందుచుండుట తగదు. అట్టివా రెల్లెడ సముద్భవింపవలెను. ప్రతిగ్రామమున నొక్కొక్కగాంధి పుట్టవలెను."

"కందకాలాగే." అని సరస్వతి మాటజార్చెను.

"ఏమి, స్వరాజ్య మప్పుడే నీయఱచేతిలోనున్నట్లు మాటలాడుచున్నావు?"

"స్వరాజ్య మెక్కడనున్నది? అది బహిర్గతముగాదు. నీలోనున్నది, నీతోనున్నది, అంతర్గతమైయున్నది."

"ఈమంత్రములకు మామిడికాయలు రాలునా? బ్రిటిషువా రంతసులువుగా నీదేశమును వదలుకొనరు."

"వదలుకొనక యేమిసేయుదురు? మనము చెప్పినదంతయుఁ జేయఁదలచియున్నామని వారు గుర్తింపవలె. తత్క్షణమే సంధికొడంబడుదురు. ఇచ్చటి అధికారులు తమమరఫిరంగులతో విమానములతో నెల్లకాల మీజనమును దొడ్డిలోఁ బెట్టియుండఁగలమని భ్రమింపవచ్చును. కాని ఇది కల్ల. ఈపశుబలమునకుఁ బ్రతిక్రియ ఆత్మబలము. హింసనడంపఁగలది అహింసయే. శాంతియే సమరమును జయింపఁగలదు. నే

నూహింపఁగలంతవఱకు స్వరాజ్యము సిద్ధమనియే తోఁచుచున్నది. ఇప్పుడున్న వర్ణవిద్వేషాదులన్నియు సమసి జనసముదాయ మైకమత్యముగాఁగలదు. అవును, వర్ష వేళ విడివిడిమబ్బులన్నియు నొక్కటియై గాలి యుఱుమును పూరింపఁగానే, జలములఁ గుమ్మరింపవా?"

కందర్ గొంతుసవరించుకొని యింకను ఇట్లు చెప్పెను. "బ్రిటిషు దేశమైనను హిందూదేశముతో సఖ్యముగానుండక తప్పదు. లెననాల్గుకోట్లజనమునకు భిక్షఁబెట్టవలెనా! ఆభూమిలో నొకకోటికిఁబైన పోషణలేదే! ఎన్నాళ్లు బట్టలు, బొగ్గు నితర దేశముల కమ్మి జీవింపఁగలదు? జనము తక్కువగానున్న భాగములకు వలసవచ్చుటే సదుపాయము. కాని రాజకీయవేత్త లావిధముగా విషయము లాలోచించుటలేదు. జాతీయదురహంకారము వారినిఁబట్టి పీడించుచున్నది. లోకమున భవిష్యత్పరిపాలనమునకు రెండేకర్తలు. నానాజాతిసంఘ మొకటి, గ్రామపంచాయతి లేక పురపాలకసంఘము రెండవది. ఆవిధముగా నధికారమంతయు విభక్తముగావలయు."

"నీఆదర్శము గభీరమైనది. మనమిపు డొకగ్రామముతోఁ బ్రారంభింతము. మనబృందమున నైఁదేండ్లు వేఱొకచింతయుండరాదు. ఆగ్రామము నాదర్శప్రాయమగునట్లు కృషించేసెదము. పాడుముఱికిగుంటను కమలాకరముగా మార్చవలయు. తరువాత నట్టిసరోవరము లశేషముగా వర్ధిల్లుఁగాక. నీవాలోచించి, యైఁదేండ్లవిధానము నొకదాని నాదేశింపుము. కంకణబద్ధులమై

దాని నెఱవేర్చెదము.” ఇట్లని సరస్వతిచర్చ నొకముఖమునకుఁ దెచ్చెను.

“కందా, నాగ్రామము నీదిగా భావింపుము. తొలుత దానితో నారంభింపుము.” అని చొక్కలింగము సవినయముగా వేఁడుకొనెను.

“చొక్కలింగా, నీసంకల్పము పవిత్రమైనది. ఆధునిక భారత దేశమున నీవంటివా రెక్కువగా లేరు. అవును, నీగ్రామముతోనే ఆరంభింతము. ఆకల్లంగడియుండిన కొబ్బరితోఁటనే ఆశ్రమముగా చేయుదము. పల్లీ సంస్కారమున కందు రార్పణమగుఁగాక. భౌతికశాస్త్ర మొసఁగుసాధనలు, ఆధ్యాత్మికశాస్త్ర మొసఁగుభావనలు, లలితకళలసౌందర్యము, మతమువలని మాంగల్యము అన్నింటినిఁ బ్రతికుటీరమునకు దానిమనసునకు వచ్చువాగ్రూపమున, దానికనుభవమునకు వచ్చుకార్యరూపమునఁ దెచ్చి సమర్పించెదము. నిజమైనస్వరాజ్యమువచ్చెనేనిఁ బ్రతిగ్రామమును, ప్రపంచమంతయును క్రోడీకరింపఁబడిన అణువువలె విరాజిల్లవలెను.”

“ప్రకృత రాజకీయపరిస్థితులను విస్మరించి, మన మీకార్యమును సాధించుకొనఁగలమా? అని రాజేశ్వరి ప్రశ్నించెను.

“సాధింపఁగలము. కాని దాని కత్యున్నతస్వభావులు పూనుకొనవలెను. స్వార్థలేశ ముండరాదు. హృదయ మట్లు

పరిశుద్ధమగు నేని పరిసరము లేమియుం జేయఁజాలవు. కాని యొక్కరైనను స్వలాభాపేక్షులై సముదాయసంపద నమ్ముకొను వారుగా నుండరాదు."

"నీవేదో ఊహాప్రపంచముంగూర్చి మాట్లాడుచున్నావు. మానవులందఱు నట్లు పరిశుద్ధులేని ప్రభుత్వమునకే ఆవశ్యకతయుండదు."

"అవును. ప్రభుత్వాదర్శ మట్టిదిగా నుండవలయును. కర్మబంధమునుండి విముక్తిఁగాంచుటేగదా మానవుని కర్మప్రసక్తికి మూలము. జీవన్ముక్తియే జీవనాశయము. ఈగూఢతత్త్వమే మానవుని భిన్నకార్యములను సమ్మేళన మొనర్చుచు జీవనము నేకముఖ మొనర్చుచున్నది."

"అవును" అని సరస్వతి అంగీకరించెను. రంగఁడు రాజేశ్వరులును సమ్మతితోఁ దలలూఁచిరి.

కందఁడు యిసుకలోఁ దనవ్రేళ్లుగ్రుచ్చి యింకను ఇట్లు చెప్పెను. "రాజీ, ఇట్టిపరిశుద్ధజీవనమునకు బ్రహ్మచర్యమే పునాది. నీవును నాతో నట్లే చెప్పియుంటివి. ఆదైహికశక్తి నాత్మతేజముగా మార్చవలెను. అప్పుడు కల్గునది ఆత్మజ్ఞానము. ఆవెలుఁగుముందు బుద్ధి, తెలివి, విచక్షణ సూర్యునిముందు దివిటీలు. రంగా, రాజీ, చొక్కలింగా, కామాక్షీ మిమ్ముల నేదో యేకసూత్రము బంధించుచున్నది. ఇఁక సరస్వతియా, మన కలితమైనది. సహజముగా నే ఉన్న తాశయ, మనమందఱమును

కార్యబద్ధులమగుదము. ఫలము దైవాధీనము. దానిచింత మనకువలదు."

ఒకక్షణ మందఱును నిశ్శబ్దముగా నాలోచనాపరవశు లై యుండిరి.

సముద్రపుపోటు తగ్గిపోవుచుండెను. ఉప్పునీరు తిరిగి యేటిలో వెనక్కుఁ బాఱుచుండెను. కొయ్యమొద్దుకూడ యిటునటుఁ గొట్టుకొనివచ్చి జలములు సుడివడుచున్నచోట చిక్కుపోయెను.

ఆసమయమున పొన్నుగ పరుగెత్తుకొనివచ్చుట కాంచ నయ్యెను. ఇసుకలోఁబడి అతఁ డట్లు పరుగెత్తుట కేదో విశే షము జరిగియుండవలెను.

## 5

"ఇక నేమున్నది! వచ్చినారు మూఁడువందలమంది మలబారు పోలీసులు, సన్నీలుదూసి, తుపాకీలతో. మనవస్తువులనన్నింటిని కోటలోనుండి బయటికి లాఁగివేసినారు. సాయంత్రము సభను నిషేధించెదరటగూడ."

"ఇంకను విశేషములేమి?" అని కందర్ ప్రశ్నించెను. రంగస్వామికి ఎగ్మూరుస్టేషను టికట్లుగదిదగ్గఱఁ గల్గినభావ ములే యిప్పుడును హృదయమును కలఁచివై చెను.

“ఇప్పటికే జిల్లా అన్ని చోట్లనుండి వేయిమందికిఁ బైగా జనమువచ్చియున్నారు. మన మొదలియారుగారిమనుష్యులు యేనూరుమంది చక్కఁగా తరిఫీదై ఖద్దరుదుస్తుధరించి విజయం చేసినారు. నల్లన్, కరియన్ వారలకు నాయకులు.”

“ఏదో ఇట్టి ప్రమాదము కల్గునని యే నేను మొదటి నుండి శంకించితిని. నిర్మాణకార్యక్రమమున కిది భంగము.” అని సరస్వతి యించుక దిగులుసూచించెను.

“మీకెందుకుభయము? నేను వారినిఁ జక్కఁబెట్టెదను. పోలీసులయొక్కటోపీలు నన్ను భయపెట్టఁజాలవు. వారికిఁ గొంచెము సముద్రపుచల్లగాలి కావలసివచ్చినారు, మంచిదే.” అని రంగస్వామి ధైర్యముతోఁ బల్కెను.

మొదలియారునకు రోషముగల్గెను. అతని శాంతముగా నుండుమని కందన్ హెచ్చరించెను. వెంటనే ఆబృంద మంతయు విడివడెను. అందఱిముఖములందును దిగులు రేక తీఱెను.

కందన్ చుట్టుపట్లఁ దేఱిపాఱఁజూచెను. ఎండలో సముద్రము తళతళలాడుచుండెను. ప్రొద్దుటికొయ్యమొద్దు తాను గూడ సాయంత్రపుసభకు రానిశ్చయించెనోయన, నదీతీరము నకుఁ గొట్టుకొనివచ్చుచుండెను.

---

# పదునాఱవ ప్రకరణము



## వేళా విశేషము.

కోటద్వారమున సన్నిధూసి పోలీసుభటుఁ డొకఁడు నిలువఁబడియుండెను. ఎంతకాలమో వైధవ్య మనుభవించు చుండిన యాప్రాతకోటకు వెండియుఁ గల్యాణవేళ యరుదెంచి నట్లుండెను.

తంజావూరునుండి ట్రాంక్విబారున కొక ఫోర్డుమోటారు కారులో నలువదిమైళ్లువచ్చుటచే నలసిపోయి జిల్లాపోలీసు సూపరెన్టెంటు కోటహాలులో నొకసోఫాపై వ్రాలెను. ఇక డిప్టీసూపరెన్టెంటులు, ఇన్‌స్పెక్టర్లు, సబ్ఇన్‌స్పెక్టర్లు అందఱును చుట్టును సవినయముగాఁ బరివేష్టించిరి.

వారిలో ఖాన్‌బహదూరు మీరాసాహే బొకఁడు. ఔరంగజీబుకాలములో జింజీకోట ముట్టడిసమయమున నద్భుతముగా ధైర్యసాహసములు ప్రకటించిన యొకానొకమధ్య ఆసియాయోధుఁడే ఖాన్‌బహదూరువంశమున కీదేశమున మూలపురుషుఁడు. అప్పుడు ఔరంగజీబిచ్చిన జాగీరుకూడ వీని వంశమునఁగాకపోయినను పేరుననైన నిలిచియున్నది.

మఱొకఁడు రావుబహదూరు వేదగిరి అయ్యరు. బ్రాహ్మణ ముఖము పోలీసుపనివలనఁ గొంత కలుషువాఱినది. తాను తిన్న యుప్పునకుఁ దప్పిపోనని ఋజువుచేయుటకు సిద్ధముగా నిలబడియుండెను.

ఇంకొకఁడు రావుసాహెబు రత్నంపిళ్లె. ఇతఁడు యువకుఁడు. డేఁగవంటికన్నులు. గుబురుగాఁ బెరిఁగినమీసములు. ఉద్యోగమువలన రూపమునకుఁగూడ కళఁదెచ్చినవాఁడు. రావుసాహెబు ఈకాలపుసంస్కరణములవలనఁ బైకివచ్చినవాఁడు. ఇతఁడు తొలుత పోలీసుకనిష్టేబుగానే ప్రవేశించెను. కాని శాసనసభయెన్నికలచిత్రవిచిత్రములలో నీతనిబావమఱఁది యొకఁడు మంత్రియాయెను. అతనిపరిపోషణక్రింద రత్నంపిళ్లె మెఱపుమెఱసినట్లు డిప్టీసూపర్నెంటు అయిపోయెను. అంతేగాక సంవత్సరాది బిరుదములలో రావుసాహెబుపట్టమును గూడ పొందెను.

ఖాన్‌బహదూరు మీరాసాహెబు తనపూర్వీకుని మహాపరాక్రమమును బ్రకటించియే పైకివచ్చెను. అంతేగాదు. దక్షిణదేశములో ముసల్మానుగాఁబుట్టుటయు మహాద్భాగ్యమే, ఉద్యోగప్రవేశముగాని, ప్రమోషన్‌గాని వానికనివార్యమే. ఈసారి ఖాళీరాఁగానే ఇతనికి జిల్లాసూపర్నెంటుపనిగూడ లభింపఁగలదని కింవదంతి.

మఱి వేదగిరిఅయ్యరువిషయమా—బ్రాహ్మణుఁడు లేనిదీ, యేశాఖయు సమగ్రము కాదుగదా. తనయజమానుల కతఁడొనర్చినసేవ నిరుపమానమైనది. అతనిఁ బైకిరానీకఁబోవుట సాధ్యముగానిపని.

## 2

ఏమి, ఖాన్ బహదూరు, పరిస్థితులంగూర్చి నీయభిప్రాయమేమి? ఆమొదలియారు తాలూకాజనమునంతయు ట్రాంక్విబారునకుఁ దెచ్చినటులున్నది. ఛాందసుఁడుగానున్నాఁడు. ఎందుకీగుంపు? రంగస్వామి కఱవమువచ్చునా! ఇంగ్లీషులో మాట్లాడఁబోవుననివింటిని. ఈజనములోఁ బదిమందికైన నర్థమగునా?" అని సూపర్నెంటు నెమ్మదిగా సంభాషణ నారంభించెను. అప్పుడే, అతఁడు భోజనముచేసి సుఖముగా నాసీనుఁడై యుండెను.

"ఏమున్నదండీ, ఇది స్వల్పవిషయము. తమరు తంజావూరునుండి యిక్కడికి రావలసినయవసరమేలేదు. ఈసభను జమకట్టకుండినచో సరిపోయియుండెడిది. నేను దీనిని సర్దివేసి యుందును. అంతయెందులకు ? హెడ్ కనిస్టేబు తాండవారాయన్ అరడజన్మందితో సర్వము చక్కఁబెట్టఁగల నను చున్నాఁడు" అని ఖాన్ బహదూరు యెట్టులో తడవుకొని యింగ్లీషులోఁ దనయభిప్రాయముం జెప్పివైచెను. ఇదియు సరిగా నేమున్నదని సూపర్నెంటు తలఁచెను.

"ఖాన్ బహదూరుగా రన్న దానితో నే నేకీభవింపఁజాలను. ఈతాలూకావాఁడనుగాబట్టి యిచ్చటివారు పూర్వము డేనులపరిపాలనమున కెన్ని కష్టములుగల్పించిరో నాకుఁ దెలియును. మొదలియారు మంచిసాహసుఁడు. అతని మనుష్యులు తుందుడుకుజనము. అతనిమాట వారికి వేదవాక్యము. ఇటీవల వీరు మొదలియారుధాన్యపుకుప్పలను దోచుకొనిరి. 20 వేల కలములధాన్యము! ఇంతకుఁ దమరిచ్చటికివచ్చుట లెస్సగానున్నది. మలబారు రిజర్వుపోలీసులువచ్చుట నిజముగా నెంతో సహాయము." అని వేదగిరిఅయ్యరు తనఅభిప్రాయమును వెల్లడించెను.

"వేదగిరిచెప్పునదే సరిగాఁ దోఁచుచున్నది. ఇప్పటివాఁడా యితఁడు!" అని సూపర్నెంటు రావుబహదూరు నొకింత భూషించెను.

రావుసాహెబు రత్నంపిళ్లె తాను ప్రత్యేకముగా నేమియుఁ జెప్పనవసరము లేదనుకొనెను. అతఁ డాజిల్లావాఁడు గాఁడు. మఱి ఇంగ్లీషులోఁ దనపాండిత్యము వెడలఁబోసుకొనఁదగినంతపాటిగాదు. కాని తనకన్నులమాత్రము జ్వలింపఁజేసెను. పోలీసులకోపమే వేఱు. ట్రాంక్విబారు నంతటినిఁ జూపుతోఁ దగులఁబెట్టునట్లుండెను. చేతితో మీసమునుదువ్వి, సూదులవలెఁ గొనల నిలువఁబెట్టెను. జిల్లాసూపర్నెంటు తన యుత్తరువుల నిట్లారంభించెను.

"ఖాన్ బహాదూర్, మనమిప్పుడు సర్వసన్నాహాముం జేసి యున్నాము. అసందర్భములేమియు జరుగవు. వేదగిరిచెప్పినట్లు యీచేరినజనమంతయు మాటకు బెదరుపాటిదిగాదు. మొదలియారుగూడ సాహసుఁడు. అతని నేనెఱుఁగుదును. ఎందుకు, పాప మీయడుసులో దిగఁబడినాఁడో! సభ 144 వ సెక్షన్ క్రింద నిషేధింపఁబడినదిగదా. అరగంటలో డివిజనల్ మేజిస్ట్రేటు యిచ్చటికివచ్చును. ప్రొద్దున మీరొకతప్పుచేసితిరి. మైదానమున నీజనమును జేరనీయవలసినదిగాదు. ఇప్పుడు మఱికొన్నివందలమంది చేరిపోయినారు. వారినందఱినిఁ జెదరఁగొట్టుట తేలికపనిగాదు."

"అవునండీ, ప్రొద్దున ఖాన్‌బహదూరుగారితో నేనామాటనేచెప్పితిని." అని వేదగిరి మాటగలిపెను. ఖాన్‌బహాదూరు నిరాసవీక్షణము నాతనిపైఁబఱపెను.

"సరే, అదిపోనీ, ఇపుడు పట్టణద్వారమునవే పోలీసులను కొందఱిని నిలువవేసి, యింకను తాలూకానుండి జనము రాకుండునట్లుచేయుము. నేను చాలా అలసియున్నాను. సభ సాయంత్రము ఐఁదుగంటలకుగదా? ఈరంగన్ 144 ఉత్తరువు నుల్లంఘించి మనము చర్యఁగైకొనవలసిన యవసరము దెచ్చిపెట్టఁడనుకొందును."

"మేమన్నియూ జూచుకొందుము. మీరు విశ్రమింపుడు. మోటారుప్రయాణము చాల నీరసమైనది." అని వేద

గిరిఅయ్యరు వెంటనే మాటమాత్రమున శిరసావహించెను. ఇతఁడును ఖాన్‌బహదూరు గ్రేడువాఁడే. ఖాళీదొరకఁగానే సూపర్నెంటుగావలెనని యాశపడుచుండెను.

ఖాన్‌బహదూరుగూడ సూపర్నెంటువలెనే విశ్రాంతికై వెడలిపోయెను. అతఁడుగూడ తుష్టిగా నుదయముననే విందారగించియుండెను.

వేదగిరిఅయ్యరు తనవిభాగముగాకపోయినను కార్యభారమువహించెను. తనతెలివినిఁజూపుట కవకాశమని యితనికి సంతోషము. సాధ్యాసాధ్యసందర్భములన్నింటి నాలోచించి, యన్నింటికిఁ బ్రతిక్రియ లేర్పఱచెను. ఇతనియెత్తులవలన, బయట సభకై చేరియున్న జనమునకు మఱింత వెఱ్ఱియెత్తుచుండెను. నందన్, మూర్ఖన్, కావేరి, ఇరుల్లన్, కరుప్పన్, ఇరుల్లప్పన్ తుడుము యెప్పుడెప్పుడు కొంచెము కనఁదీర్పుకొన వచ్చునా యని వేచియుండెను. చేరువనున్న శిథిలగృహమునఁ జిందరవందరగా రాళ్లువడియుండెను. వాటి నుపయోగించుటకు వీరికిఁ జేతులుతీయుచుండెను.

## 3

"పోనీ, ఎందుల కీపోలీసుసంరంభము? మున్నూరుమంది సన్నీలుదూసి తుపాకీలతో సిద్ధమైరి. ఏదో రంగన్ ప్రపంచవార్తలనన్నింటి నీజానపదులకుఁ గొంత తెలిపినందువలన

వచ్చిననష్టమేమి? నీవు పట్నమూసపుమనిషివి. నీకుఁ దెలిసి యుండవచ్చును అవసరానవసరములు. పల్లెటూరాఁడుదానికి నాకుఁ దెల్పుము." అని కామాక్షి తిన్నఁగా పొన్నుస్వామినిఁ బ్రశ్న వేసెను. పొన్నుని మనసు చాల కలఁతపడియుండెను. దిన మంతయు నతఁ డిటునటు తిరుగాడుచుండెను.

"కామాక్షీ, నీవు భయపడుట న్యాయమే. ఏదో ప్రమాదమురానున్నదని నేనును శంకించుచున్నాను. మొదలియారుమనుష్యులు తుందుడుకువారు. అతని సిపాయీలు లేమైనఁ గొంచెము కొంచెపఱచినచో, నీమూఖని కాశేరీ లూర కుండరు. మున్నూరుమందిపోలీసులమధ్య నేమిజరిగినను జరుగ వచ్చును. మొదలియారుమనుష్యులిప్రాతయిండ్లరాళ్లను వర్షము గురిపింపవచ్చును. సరే పోలీసుల దేమిపోయినది? వెంటనే తుపాకీలు కాల్పవచ్చును. రాళ్లకుబదులు గుండ్లు— రక్తము కాలువలుగట్టఁగలదు."

కామాక్షి అడలిపోయెను.

"పొన్నా, మనమిత్రులకేదో గొప్పవిపత్తు రానున్నదా?"

"అవును. నాభయ మదియే. ప్రొద్దుటినుండియుఁ బరిస్థితు లట్టివిషాదపరిణామమునకే కూడివచ్చునట్లున్నది. ఇఁక నర గంటలో మనము తప్పించుకొనుటకేనియు వీలుండదు. ఇప్ప టికే పోలీసులు దారినడ్డగించినారు. నిన్నుగుఱించి ముఖ్య ముగా నాకు భయముగుచున్నది."

"నన్ను గుఱించియేల?" అని మెల్లగాఁ గామాక్షి పృచ్ఛించెను. అతనిచూపులయర్థ మాబాలికకుఁ దెలియకపోలేదు.

"తెలియదాయేమి? నేను నిన్నుఁ బ్రేమించుచున్నాను. అతిగాఢముగా. నీమీఁద నాప్రాణము లొడ్డితిని. నిన్నుఁ బెండ్లి చేసికొనక, నాదాన వనిపించుకొనక నేను బ్రతికి యేమి ప్రయోజనము! అక్కూరులో మొదట నీచందముగాంచినప్పటి నుండియు నామనసు నీయెడనే తగుల్కొన్నది. ఇదిగో నా గుండె అవిసిపోవుచున్నది."

"ఏమాశ్చర్యము! నాయెడ నీకిట్టియభిప్రాయమా? నేనేదో బీదపిల్లను—"

"అందువలననే మఱింత గాఢముగా నిన్నుఁ బ్రేమించుచున్నాను."

"ఛానా్న, నాకింకనుఁ బెండ్లితొందర లేదు. ఆవిషయమే నామనస్సునుఁ బ్రవేశించినదిగాదు. నేనేదో పల్లెటూరిపిల్లను. మామచాటుదానను. అతఁడే నాకు రక్షకుఁడు. ఈవిషయమున నాతఁడే పరిష్కర్త. నీయెడ నాకు వేఱుభావములేదు. నిన్ను సోదరునిగాఁ బ్రేమించుచున్నాను. నీవు ప్రక్కనుండి మాటలాడునపుడు నాకెందుకో ధైర్యముగల్గును."

"కామాక్షీ, మాటమాత్రము సమ్మతింపుము. నీకై నా ప్రేమ అపారము. ఇఁక నరగంటలో మైదానము రక్తమయ

మగును. మనము తప్పించుకొనుట కొకటేమార్గము. నీకొఱకు నేను సాహసించెదను. ఆపాడువడిన బండలవెనుక నొకతెప్ప గలదు. ఇచ్చటివారు చూడకుండ, మనము దానిలో నెక్కి దాటుకొందము. పదిమైళ్లదూరముననే తిరుమలైవాసల్ గలదు. అచటఁజేరితిమా భద్రము, సౌఖ్యము దక్కును. కామాక్షీ నీవెక్కడికిరమ్మనిన నక్కడికివచ్చెదను. ఇదె నీదాసుఁడను."

కామాక్షి దద్దరిల్లిపోయెను. నోట మాటరాలేదు.

## 4

అదృష్టవశమ్మున నాసమయమున కచటికి చొక్కలింగ మొదలియారు కామాక్షిని వెదకికొనుచువచ్చెను. కామాక్షి అతనిఁ గాంచి కొంత తేఱుకొనెను.

"ఘాన్నా యేమిటి నీవును కామాక్షియు నీమూలఁజేరి గుసగుసలాడుచున్నారు? పోలీసులయెర్రటోపీలకే భయపడి పాఱివచ్చితివా? పట్నమానపుమనిషివి ధైర్యస్థుఁడ వనుకొంటిని."

"కాదు, కాదు, నేను భయపడలేదు. దురంతమేదైన సంభవింపవచ్చునని కామాక్షితోఁ జెప్పుచుంటిని. ఇంతమంది పోలీసు లొకచోటఁజేరినపుడు కయ్యమునకుఁ గాలుద్రవ్వక మానరు. మిమ్ముల నొకటివేఁడుకొనుచున్నాను. మనమనుష్యుల

నాఁకవెట్టియుంచుమని నల్లనున కాజ్ఞాపింపుడు. ఏచిన్నవిషయ మున కేనిఁ బ్రమాదము గల్గవచ్చును."

"ప్రమాదమేమిటి! నే నీపోలీసుల యెఱ్ఱటోపీలకు జంకువాఁడనుగాను. సూపర్నెంటు యెన్నిమారులు నాయిం టికివచ్చి విందారగించిపోయియుండలేదు! అతఁ డిపుడు బహి రంగముగా నావంకలేకపోవచ్చును. ప్రతికూలుఁడైనను నీవలె నేను పందనుగాను. ఈయెఱ్ఱటోపీలు, కాకీచొక్కాలు నన్ను దద్దరిల్లఁజేయుననుకొంటివా ? నాచూపు చలనములో నా మనుష్యులు వీరినందఱిని కందకములోని కూడ్చివేయఁగలరు."

"అయ్యా, అయ్యా, అట్టి తొందరవలదు. పోలీసులు సాయుధులు. సూపర్నెంటు, ఖాన్ బహదూరు కటికవారు. వేదగిరికి ప్రమోషన్ మీఁదనే దృష్టి. పూర్వము మీకుస్నేహి తులు, మీయింట విందారగించినవారే గావచ్చును. ఇప్పు డట్టి దేమియుఁ జెల్లదు. నామాటవిని, ముందు మీఱకుడు. పొన్నన్ చిన్నవాఁడైనను, విషయము ముఖ్యముగా పోలీసువిషయము లెస్సగా తెలిసినవాఁడు."

"ఏమి, పొన్నా, కాపురుషునిసలహా నిచ్చుచున్నావు! మ నమిత్రులు సమరమధ్యముననున్నవారు."

కాని పొన్నన్ కామాక్షీ లిర్వురును మోకరించి మొదలియారును బ్రతిమాల నారంభించిరి. ఆసమయమున వారిముఖములందుఁ గలపోలిక ప్రస్ఫుటమాయెను. చొక్క

ంగము దీని నవలోకించెను. పూర్వమే పేరిపోలిక యొకించు కాతనికిఁ దోఁచియుండెను. ఇపుడు ప్రక్కప్రక్కనున్న యా రెండు మొగములంగని, ఆతఁడు నవ్వుచు, "ఏమి మీరిరువు రును యేకోదరులవలె నున్నారు! పొన్నా, నీవు కందనునకు జ్ఞాతినంటివిగదా— ఈతాలూకాలో నీ గ్రామమేదో జ్ఞప్తి యున్నదా?" అని అడిగెను.

"మెమడూరు."

"మెమడూరా?" అని యిర్వురు నొక్కటిగా మాట నందుకొనిరి.

"పొన్నా, నీతండ్రిపేరు?" అని చొక్కలింగము తిరిగి ప్రశ్నించెను.

"పెరియాపన్నాయి విత్తిలింగ మొదలియారు!"

"పెరియాపన్నాయి విత్తిలింగ మొదలియారా!"

హర్షాశ్చర్యసంభరితమైన రెండుకంఠము లొకటిగా మిళితమాయెను.

"నేను నీచెల్లెలిని" అని చెప్పుటతోఁ గామాక్షికి హృదయభావ ముప్పొంగిముంచివేసెను.

"అవును, కామాక్షీ, నీవు పొన్నని చెల్లెలివి." అని చొక్కలింగముకూడ దృఢపఱచెను. "నీవు నీమామ యింట నుండినపుడు నిన్ను నేజూచియుంటిని. నీతండ్రికూడ నాకుఁ

దెలిసినవాఁడే. ఒక్కఁడే కొడుకు చిన్నప్పుడే తప్పిపోయెను. ఏ లంబాడీలో యెత్తుకొనిపోయిరని యిక్కడివా రనుకొను చుండిరి. పొన్నకొడుకు, పాపము, దుఃఖముతోఁ దలిదండ్రులు తొందరలోనే చనిపోయిరి. నిన్నుఁ జిన్నపిల్లను మీమామ యెత్తిపెంచెను. పొన్నా నీకుఁ జిన్నప్పటిసంగతు లేమైన జ్ఞప్తి యున్నవా?"

"అయ్యా, నాకథ చాలగలదు. చిన్నప్పటియత్యాత విషయము లేవో కొన్ని మాత్రము నామనసున నిలిచియున్నవి. కాని నాకథజెప్పుటకుఁ గొన్ని దినములుపట్టును. ఇప్పుడు విపత్తును ముందుబెట్టుకొని కాలక్షేపము సేయఁజాలము. నాకు నా చెల్లెలు మరల దొరికినది. నాకున్న దీయొక్కబంధువే. ఈదినము సుదినము."

పొన్నగూడ సంతోషముతోఁ బొంగిపోయెను. కామాక్షి సౌందర్యము నిపుడు చూడఁగా, నాతనికి వేఱొక విధముగా తోఁచెను. కామాక్షియు ననురాగపూరితయై సోదరు నంకముం జేరెను.

## 5

"పొన్నా, బయటగలభా యెక్కువగానున్నది. పోయి చూచిరమ్ము."

పొన్న వెంటనే వెడలిపోయెను.

చొక్కలింగము కామాక్షితో నేకాంతముననుండెను. ఇదేసమయమనితనయను రాగము నిట్లుబ్రకటించెను." కామాక్షీ, నిన్నుఁ జూచినప్పటినుండియు నామనసు నీయధీనమైనది. నీ వొక్కమారు నన్నుఁ బ్రేమించియున్నానని చెప్పినఁజాలును. పెండ్లతరబడి నిదానింపుమనినను తొందరపడను. నీకొఱ కెంత తపింపుమన్నను, దేశముకొఱకు జైలుకుఁబొమ్మన్నను, తుదకుఁ బ్రాణములఁగోల్పోవుటకేని సిద్ధముగానున్నాను. నీయందు నా భావ మంత రూఢమైయున్నది."

కామాక్షి దిగ్భ్రాంతురాలాయెను. ఆకసముపై కెగసి, నిజస్థానమును విస్మరించిన శకుంతమువలె నామెమనసు నిష్క్రాంత మాయెను.

వెలుపల గలభా యెక్కువగుచుండెను. పొన్నక్ దద్దరిల్లినముఖముతోఁ బరుగెత్తుకొనివచ్చెను. "నేఁజెప్పినట్లయినది. ఇక్కడ మన మొకక్షణమైననుండరాదు. విపత్తు వెనుదఱుము చున్నది. రంగక్ రాజేశ్వరి కందక్ సరస్వతులు జనసమ్మర్దములోనున్నారు. జనమంతయు నుద్రేకముతో నుడికిపోవు చున్నది. ఏస్వల్పము సంఘర్షణగల్గినను ప్రమాదము ప్రజ్వరిల్లవచ్చును. నేనెన్నిసభలనో, యెన్నిగుంపులనో చూచియున్నాను. కాని యీపల్లెటూరిజనము ప్రోగై యుత్సాహాపూరితమై యున్నదృశ్యము అపూర్వము."

"ఏమిటి పొన్నా, యేమైనది?"

"రంగన్ ఉత్తరువు నుల్లంఘించి మాట్లాడఁగలఁడు. వారందఱుగూడ శాసనోల్లంఘనము సేయునట్లున్నది. పోలీసుల లాఠీప్రయోగము, సన్నీలతోఁబోడుచుట, తుదకు కాల్పులుగూడ తప్పవు. చేరియున్నది పట్నమాసపుజనము గాదు, సమయమెఱిఁగి జాఱుకొనుటకు. ఈపల్లెటూరివారికి ధైర్యమెక్కువ, యుక్తి తక్కువ. పదివేలమంది మైదానమునఁ గ్రిక్కిఱిసియున్నారు. మఱిపదివేలమంది యూఁరివెలుపలనున్నారు. పోలీసులు పట్టణద్వారములను కాపుగాయుచున్నారు ఈవిశాల మైదానమిక నరగంటలో రక్తప్లావముగాఁగలదు. సముద్రమునకు నెత్తురు వఱదఁగట్టును."

"అయితే, నీవు చెప్పునదేమి? తరణోపాయమును సూచింపుము."

"మనము నీటిమీఁదఁ దప్పించుకొనిపోవుదము. తీరమునఁ బాడుదేవాలయపు బండలచాటున నొకతెప్పగలదు. దానినెక్కి పరిస్థితులు విషమించకముందే దాటుకొందము. గాలియు ననుకూలముగా నున్నది. రండి మొదలియారుగారూ, కామాక్షీ నీవుగూడ."

"ఇదేమి పాన్నా, వి త్తిలింగనివంశమును మలినము సేయు సలహానిచ్చితివి! అతఁడీతాలూకాలోనెల్ల ధీరుఁడని ప్రసిద్ధి. నీయజమానులు, మిత్రులు విపత్తులోనుండఁగా వదలి పాఱిపోవుటా! పాన్నా, కందన్ నాకుఁ దరములు గడచిన

జ్ఞాతి. అతనిపై నాకిటీవల గాఢాభిమానమేగల్గినది. ఈసమయమున నేనెట్లో ఆపదను దప్పించవలెను. పోలీసుసూపర్నెంటు నాకుఁ దెలిసినవాఁడు. అతనిదగ్గఱకుఁబోయి మాట్లాడెదను. నిరుపద్రవముగా సభ జరుగఁగలదని హామీయిచ్చెదను. కామాక్షీ, నేనుపోయి యీజనమును శాంతపఱచెదను. పొన్నా, నీవు నీచెల్లెలిని సురక్షితముగా నుంచుము. రంగ... కందనులను గలిసికొనుడు—కాదు, ఇక్కడనే యుండుడు. ఇదే భద్రము."

"మొదలియారుగారూ, మెలకువగాబొండి. జనము మధ్యఁ బరవశులయ్యెదరేమో. ఏస్వల్పమునకేనియు నుపద్రవము గల్గును." అని పొన్నన్ దీనముగా విజ్ఞాపించెను. నిజమునకు, రానున్న నాపదను దప్పింపవలెననియే పొన్నన్ సంకల్పము.

చొక్కలింగము వెడలిపోఁగానే, "పొన్నా, నేనిక్కడ భద్రముగా నుండఁగలను. నీవు మొదలియారువెంటఁబోయి, ప్రమాదముగల్గకుండునట్లు సవరింపుము. ఈసమయమున నీవే తెలివితోఁ బ్రవర్తింపఁగలవాఁడవు." అని కామాక్షి సోదరి బ్రతిమాలెను.

చొక్కలింగ మెంత శ్రీమంతుఁడు, సోమరియైన... యువకుఁడు, సాహసుఁడు. అదిగాక ట్రాంక్విబారులోఁ దన పూర్వులు పదునొకండుతరములవిచ్ఛిన్నముగా పరిపాలించి యుండిరి. డేనులరాజ్యమనిపేరేగాని, పాలనాకార్యమంతయు

నీ మొదలియార్ల దే. అటువంటిసీమలో చొక్కలింగము గర్వో త్సాహములతో నిపుడు బయలుదేరెను. పోలీసులదర్పమున కాగ్రహమును అతనిఁ గలఁచివైచుచుండెను.

చొక్కలింగమునుఁ జూడఁగానే, జనము వానికిఁ బోవు టకుఁ దారియొసఁగెను. మొదలియారు సూపర్నెంటునుజూచి, శాంతికి భంగముకలుగదని నచ్చఁజెప్పవలెననియే సంకల్పించి వచ్చియుండెను.

## 6

కోట ఉత్తరపుద్వారమును మొదలియారు సమీపిం చెను. అక్కడ మలబారుపోలీసులు బారుతీఱియుండిరి. వారి కీతనిపుట్టుపూర్వోత్తరములు తెలియవు. మహాఠీవితో వచ్చు చున్న నీతనిఁ జూడఁగానే వారి కసహనమాయెను. చొక్క లింగము వారినిఁ జేరి, తాను సూపర్నెంటుతో మాట్లాడవచ్చితి నని దర్పముగా బల్కెను. ఒకపోలీసువాఁడు తనలాఁటీపొన్ను తో నీతని వెన్కకునెట్టుచు, "పో, అవతలకు, గమ్మారులాగు ముందఱికివచ్చినావు. తగ్గకపోతివా, నీకండలో గుండు దూఱును. జాగ్రత్త, సూపర్నెంటు నెవ్వరును చూడ వీలు లేదు." అని దబాయించెను.

నందన్, మూఖన్, కావేరీ, ఇరుల్లన్, కరుప్పన్, ఇరు ల్లప్పన్, అమవశి, గోవిందన్, పవడాయి, నల్లన్, కరియను

ఇత్యాదిగా మూఁగియున్న మొదలియారుజనము తమయజ మానికైన యవమానము నవలోకించెను. తరతరములుగా తా మాతనియుప్పుదిని బ్రదికియున్న జనము—అతని రెండు వేలకలములధాన్యము మొనమొన్ననే దోచుకొన్న జనము— ఒక్కుమ్మడిగా నాగ్రహపరవశమయ్యెను. ద్వారమును కావలి గాచుచున్న పోలీసుభటులపై వారుఱికిరి. నల్లకా అమవశె కరి యనులు మొదలియారును మెలకువతో భద్రమైనప్రదేశము నకు దాటించిరి.

పోలీసులపైకి జన ముఱుకఁగానే, ప్రతిభటుఁడును యీలవేసెను. అది విని సూపర్నెంటును, ఖాన్ బహదూరును మేల్కొనిరి. ఆగ్రహపరవశులైయున్న జనులు చుట్టుపట్ల నసంఖ్యాకముగా బడియున్న రాళ్లు రువ్వుటకు సిద్ధపడుచుండిరి.

మాయవరము డిస్ట్రిక లెక్టరును రంగమునకు వచ్చియుం డెను. అల్లరి నణచివేయు టాతనివిధి. అందులోనే అతని ప్రమోషన్ ఇమిడియున్నది. వెంటనే శాంతికి భంగముకల్గ నున్నదనియు, రెండునిమిషములలో నెక్కడిజన మక్కడ చెదరిపోవలెననియు, లేనిచో తుపాకులు కాల్పఁబడుననియు నాతఁడు హెచ్చరించెను. ఆసమ్మర్దములో నాతనిమాటను విను వాఁడెవ్వఁడు! అతఁడు ప్రక్కనున్న మఱ్ఱిచెట్టునకుఁ జెప్పికొని యుండవచ్చును! మరల జనమును చెదరిపొమ్మని హెచ్చరికఁ జేసెను. ప్రొద్దుటినుండివచ్చి చేరియున్న పదివేలజనము తుపా కులు కాల్చెదరనినను, రెండునిమిషములో వెడలిపోవుట

సాధ్యమా! ఒకవైపు సముద్రము, దక్షిణమున కోటగోడలు, మిగిలిన రెండుదిక్కులను శిథిలగృహములు, ద్వారమును కటాయించి పోలీసులు—డిప్టీకలెక్టరు తనవిధ్యుక్తము తాను నెఱవేర్చెను.

లాఠీప్రయోగ మారంభమాయెను. ఒకసారి, రెండుసార్లు, మూడుసార్లు. జనము చెదరిపోలేదు. లాఠీపోటులు చాలవని తుపాకీకాల్పులు! గుండ్లు గవ్వలవలె గాలిలో గింగురుమనెను. దైవవశాత్తున కోటగోడలు యెత్తుగానుండినందువలనఁ జాలాగుండ్లు జనమున కెగువగాబోయి, ఆవలతోటలోఁ బక్వమగుచున్న పండ్లగుండా దూసిపోయెను.

పొన్ననునకు మోకాలిక్రింద నొకగుండు గీచుకొనెను. అతఁడు కుంటుచునే కందర్ నిశ్చలముగా నిలిచియున్న చోటికిఁ బోయెను. గాలిలో గుండ్లుచెల్లాచెదరుగానుండెను. కాని రంగర్ రాజేశ్వరి కందర్ సరస్వతులు అద్భుతమైనశాంతిని బ్రకాశించిరి.

హఠాత్తున కందర్ కేకవేసెను. ఇఁక నేమున్నది! గిట్టుమని నేలఁగూలెను. అతనిచేయి గుండెను బట్టుకొనెను. అచ్చటనే గుండుతగిలినది. అచటనే రాత్రి కలలో భూతము విసరినకొరడావిసరు కొట్టినది. కందనునకు మరణావసరము. స్వార్థత్యాగి మరణాతీతుఁడై అమర్త్యుఁడగునవసరము.

"కందా, కందా" యని పదివేలజనము వాపోయెను. సముద్రపుశోక మలలుగా పొంగి పొరలి ఘోషవెట్టెను. ప్రొద్దుటి తెప్పకొయ్యయు తూలిపోవుచుండెను.

"రాజీ, నాజీవితము సమాప్తమగుచున్నది. ఉదయము ననే కలఁగనినవెనుక జాబిల్లి వెల్లు నాకుపశాంతిగూర్చినపుడే యిట్టిదేదో జరుగుననియే శంకించితిని. కాని నన్నుఁగూర్చి విచారము వలదు. నీవు నాజీవితకార్యమును కొనసాగింతువేని నిరాశ్రయము నిరాహారమైన యీజనము నుద్ధరింతువేని, దేశ స్వాతంత్ర్యమునకై పాటుపడెదవేని నామరణము వృథా గాదు."

కందర్ క్షణము నిదానించి, మొగమించుక యెత్తివాణి నిట్లనెను. "రాజీ, రంగస్వామిని వివాహమాడుము. అతఁడు సహృదయుఁడు, త్యాగి. దేశమునకు వన్నె దెచ్చినాఁడు. చొక్క లింగా, కార్యభారము నీపై నున్నది. నీభాగ్యమును నీజీవిత మును, యీబీదజనమునకై వినియోగింపుము. ఈకామాక్షి నీధర్మనిర్వహణమునకుఁ దోడ్పడఁగలదని నాకంతర్వాణి దెల్పు చున్నది. నీ వామెను స్వీకరింపుము. పొన్నా నీవును పరి శుద్ధుఁడవైతివి" కందర్ యిట్లుచెప్పి, పొన్నుస్వామిని వీపుపై నిమిరెను. పొన్నర్ భక్తియు దుఃఖమును వెల్లిగొనఁగా మోక రించెను.

సరస్వతివంకఁదిరిగి కందర్ యిట్లనెను. "సరస్వతీ, నేను హాయిగాఁ జనిపోవుచున్నాను. నాజీవితాశయము నీకధీనము. నిన్ను గుండ్లుసైతము చెనకఁజాలవు. నీవు మనమిత్రులను

మంచిమార్గమున నడిపించవలెను. నీప్రార్థనలందు నన్ను మఱువకుము. ఆ! ఆ!"

కందర్ మరణవేదనను స్థైర్యముతో సహించెను.

"కందా, నీయాశీస్సులు దైవమొసంగువరములు. దేశస్వాతంత్ర్యము సిద్ధించువఱకు మేమైహికభోగముల నాశింపము. అప్పటివఱకు మావివాహములు వేచియుండఁగలవు." అని వారందఱు నొక్కుమ్మడిగా బ్రకటించిరి.

కందర్ స్మృతి తప్పుచుండెను. "రాజీ, నేను పోవుచున్నాను. శాంతముగా—రాజీ, సరస్వతీ—నీళ్లు, మంచినీళ్లు" కందర్ యెదురుగానున్న లవణాబ్ధినిఁ దిలకించుచు, నీటిబొట్టుకై పరితపించెను.

సరస్వతీరాజేశ్వరులు మంచినీళ్లకై చేరువ బావికడకు వెళ్లిరి. ఫాన్స్ర్ కుంటుచునే వారి ననుసరించెను. వారు వచ్చులోపలనే కందర్ పరలోకగతుఁడాయెను.

"అయ్యో, దాహముతీర్చుకొనకయే పోయినాఁడు." అని రాజేశ్వరి వాపోయెను.

"దేశస్వాతంత్ర్యపిపాసను దీర్చుకొనకయే పోయినాఁడు." అని సరస్వతి శోకించెను.

"మనదీక్షను మఱువవలదు. ఇహలోకమున మనకార్యా చరణమే పరలోకమున నాతనిదాహము దీర్పవలయును." అని రంగఁడు దుఃఖము నాపుకొనెను.

"దేశభక్తుఁడు, త్యాగమూర్తి, కందఁసమాధి అక్కూరు కొబ్బరితోఁటలోఁ గల్లంగడియుండినచోట నెలకొల్పుదము. అదియే మనయాశ్రమము. పల్లీసంస్కారమునకు భారతజనోద్ధరణకు మనజీవితములు సమర్పితములు. కందఁ డమర్త్యుఁడై వెలయుఁగాక." అని రాజేశ్వరి పల్కెను. సరస్వతి సమ్మతితోఁ దలపంకించెను.



# పదునేడవ ప్రకరణము.



## ఉపసంహారము.

## 1

ఒకనెల గడచిపోయెను.

మదరాసు, బ్రాడ్వేలో "స్వరాజ్య"పత్రికాకార్యాలయము. సంపాదకునిగది. పొడుగుపాటి కాగితపుతునకలు చెల్లాచెదరుగా నుండెను. ఆదినము వార్తలప్రాణసార మా కాగితములందే. బయట వీథిలో రాకపోకలగలభావిలేఖరుల మనోవీథియందు సమ్మిళితమగుచుండెను.

గదిలోఁ గూర్చొనియున్నవారు తరుణవయస్కులు, విలేఖరులు. పెన్సిలుముక్కలు పొడుగువి, పొట్టివి వారిహస్తముల నలంకరించియుండెను. భాగ్యచిహ్న మచ్చటశూన్యము. బయటఁ గన్పడునది సీరా, సీసము. కాని ఆయువకులహృదయములు స్వర్ణమయములు. త్యాగవహ్నిలోఁ బరిశుద్ధమైనవి, ప్రకాశమానమైనవి. దేశసేవాసమాహూతమైనవి.

ఒకవిలేఖరి చేత నొకలేఖఁ గొని, ప్రధానసంపాదకుని

ప్రధాని దానిఁ జదువుకొనెను. "సరే, మొదటిపుటలోఁ బ్రధాన్యమొసఁగుము. నేను నొకవ్యాఖ్యవ్రాసెదము. రంగస్వామి కామాత్రమైనఁ దగును."

ఆదినంసాయంత్రము పత్రికలో నీవార్త యిట్లుండెను.

"ట్రాంక్విబారు అల్లరికేసును విచారించుచున్న స్పెషలు. మేజిస్ట్రేటు ఎ. పి. నటరాజన్ యం. ఏ., ఐ సి. యస్., గారు నిన్నసాయంత్రము 6 గంటలకు తీర్పుజెప్పిరి.

ఆర్. యస్. రంగస్వామి, యం. ఏ. ఐ. సి. యస్. బారిష్టరు, ఒకసంవత్సరము విడిఖైదు విధింపఁబడెను. శ్రీమతులు రాజేశ్వరీబాయి,సరస్వతి,కామాక్షిగార్లకొక్కొక్కరికిని ఆఱు నెలలు విడిఖైదు. పొన్నుస్వామి కొకసంవత్సరము కఠినఖైదు చొక్కలింగముమొదలియారుగారికిని ఒకసంవత్సరము కఠిన ఖైదు.

నందన్, మూఖన్, కాశేరీ, ఇరుల్లన్, ఇరుల్లప్పన్, అమవశి, గోవిందన్, పవడాయి, నల్లన్, కరియనులకును, మఱి 72 మంది నిందితులకును రెండేసియేండ్లు కఠినఖైదు.

చొక్కలింగమొదలియారుతల్లి, కొడుకు ఖైదుశిక్ష విధింపఁబడెనని వినఁగానే, ఆదినంరాత్రి భగ్నహృదయయై మరణించెను."

## 2

"స్వరాజ్య"పత్రికకు ట్రాంక్విబారువిలేఖరియెవరు? సంశయము వలదు. సుందరమే. నెలక్రిందట నక్కూరుస్టేషన్‌మాస్టరు. అతఁడు మైదానమున సభజరిగినరోజున జనమధ్యమున నుండెను. కాని యింతవఱకు కాతనిగట్టెక్కించినభాగ్యదేవత అతని నక్కడ విడిపోలేదు. భార్యదగ్గఱ నక్కినక్కియుండినవాఁడు, పోలీసులదగ్గఱఁగూడ నక్కి తప్పించుకొనెను. కేసులోఁగూడ నతఁడు నిందితుఁడుగాఁడు. చదువు చెడినవిద్యార్థి, దేశద్రిమ్మరి, సాధువు, సిగ్నలరు, స్టేషనుమాస్టరు, ఇపుడు "స్వరాజ్య" పత్రికకు విలేఖరి. మధ్య 144-వ సెక్షన్ నుల్లంఘించినదేశభక్తుఁడు. సుందరముజీవితము పెండ్లినాటినుండి పరమాద్భుతమైనది.

ఉపజ్ఞ యన నిట్టిదే. అవధీరిత ప్రేమము, ఆత్మానుతాపము, అపర్యాప్తప్రాణసారము. ఉపజ్ఞుఁడు అధమముదేశద్రిమ్మరి. ఉత్తముఁడేని యోగిపుంగవుఁడు.

---

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్‌సన్సు వారి
'వావిళ్ల'ప్రెస్సున ముద్రితము.—1933.

# నెపోలియన్ బోనపార్టి జీవితము

గ్రంథకర్త: శ్రీ కపవరాజు నరసింగరావు పంతులుగారు, బి. ఏ.

ప్రథమభాగము—300 పేజీలు }
ద్వితీయభాగము—364 పేజీలు } వెల రూ. 2-0-0.

అబ్బట్ మాతృకకు సరియైనభాషాంతరీకరణమనియు, మాతృకలోని భావగాంభీర్యపటుత్వ సరళత్వాది సుగుణములు పరిపూర్ణముగ తేటతెలుఁగున అతిరసవంతమగు మృదుమధురశైలిని భాషాంతరీకరింపఁబడి ఆంధ్రసారస్వతకొఱంతఁ దీర్చినదనియు, శ్రీయుత C. R. రెడ్డిగారు, M. A., వైస్‌చాన్‌సలర్, ఆంధ్రవిశ్వవిద్యాలయము, దేశభక్తకొండ వెంకటప్పయ్యపంతులుగారు, B. A. B. L., శ్రీ రాయసం వేంకటశివుడుగారు, M. A., L. T., మామిడిపూడి వేంకటరంగయ్యగారు, M. A., దేశభట్ల లక్ష్మీనరసింహంగారు, M. A., L. T., ఏ. జయరామారావుగారు, B. A., L. T., జయంతి గంగన్నగారు, B. A., L. T., 'హిందూ'పత్రికాధిపతులు మొదలగు ప్రముఖులచేఁ గొనియాడఁబడినది.

# బాలాదిత్య

(చరిత్రాత్మకమగునవల)

ఇది నవలాప్రపంచమున కొక నూతనాలంకారము. శైలిసుందరము. భాషాభిలాషులగు యువకులకవశ్యపఠనీయము. సంఘసంస్కర్తలకు సమ్మోదావహమైనది. ఇతివృత్తము. ఉన్నతాశయప్రేరకము. విచిత్రసంవిధానము. నవరసములకాలవాలము. బాలాదిత్యుని అస్పృశ్యతానివారకప్రయత్నములు, సాంఘికదురాచారనిర్మూలకవ్యాపారములు, అజ్ఞానాంధకారుని జననమరణరహస్యవిచారములు, చారుమతీయశోధర్మల దేశభక్తిపూరితములగు ఉపన్యాసములు, మిహిరగుల నారాయణశర్మల క్రూరకృత్యములు, క్రూరుఁడగు దొంగలరాయఁడు, హరిరాముని పరోపకారకార్యములు—ఇట్టి సంఘటనము పాఠకులకు సంతసము నింపుచుండును! నేఁటికాలమున కనుగుణమైన నవలారత్నమగు నీగ్రంథమును ముద్రించినారము. ప్రతి 1-కి రూ. 2-0-0.

| ప్రతి 1-కి | రూ. | అ. |
| --- | --- | --- |
| తులసీదాసురామాయణము, తెనుగువచనము ... | 7 | 8 |
| దక్కనుపూర్వకథలు ... | 1 | 5 |
| దశకుమారచరిత్రము, శ్రీ ఎనమచింతల సంజీవరాయశాస్త్రి ... | 1 | 3 |
| దేశింగురాజుకథ (జంగముకథ) ... | 0 | 5 |
| ద్వాదశోపనిషత్తులు, సంస్కృతమునకు సరియైన తెనుఁగువచనము | 3 | 0 |
| నలచరిత్ర, చిన్నసైజు, పటములతో ... | 0 | 6 |
| సంస్కృతనాటకకథలు, శ్రీ సీతారామశాస్త్రి ... | 1 | 4 |
| నవనాథభక్తులచరిత్ర, శ్రీ బచ్చు రామన్న ... | 2 | 0 |
| నలుగురుమంత్రులకథ ... | 0 | 4 |
| నీతిచంద్రిక, చిన్నయసూరిది ... | 0 | 6 |
| కపాలకుండల ... | 0 | 14 |
| బాలాదిత్య ... | 2 | 0 |
| పరిహాస్యవినోదకథలు ... | 0 | 12 |
| పంచతంత్రము, వచనము, సులభశైలి ... | 0 | 6 |
| పరమానందశిష్యులకథ ... | 0 | 3 |
| పతివ్రతలచరిత్ర, మంగిపూడి వేంకటశర్మ ... | 1 | 8 |
| పురాణగాథలు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి ... | 0 | 10 |
| ప్రహ్లాదచరిత్ర, చిన్నసైజు, పటములతో ... | 0 | 4 |
| ప్రాచీనదేశచరిత్రలు ... | 1 | 12 |
| బేతాళునికథలు ... | 0 | 8 |
| భారతరమణీమణులు, ప్రథమభాగము ... | 0 | 12 |
| డిటో ద్వితీయభాగము ... | 0 | 8 |
| భోజునికథలు ... | 0 | 8 |
| భోజకాళిదాసకథలు, ప్రథమభాగము ... | 0 | 12 |
| భోజకాళిదాసకథలు, ద్వితీయభాగము ... | 0 | 12 |

| | ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|---|
| రోషినార | ... | 0 | 12 |
| మనోహరి | ... | 0 | 14 |
| మదాలస | ... | 0 | 10 |
| విజ్జలదేవి | ... | 1 | 4 |
| మహాభక్తవిజయము, చిత్రపటములతో సహా | ... | 6 | 0 |
| మదనకామరాజుకథ | ... | 0 | 14 |
| యజుర్వేదకథాసంగ్రహము | ... | 0 | 8 |
| రఘువంశకథ | ... | 0 | 8 |
| రేచుక్క పగటిచుక్కకథ | ... | 0 | 3 |
| విక్రమార్కునికథలు | ... | 0 | 8 |
| వివేకానందవిజయము | ... | 1 | 12 |
| వీరాంగనలు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారిది | ... | 0 | 12 |
| వైద్యులకథలు | ... | 0 | 4 |
| శుకసప్తతికథలు | ... | 0 | 6 |
| షేక్స్పియర్ నాటకకథలు | ... | 1 | 8 |
| సంగ్రహభాగవతము, శ్రీ జనమంచి శేషాద్రిశర్మ | ... | 1 | 0 |
| సంగ్రహభారతము ,, | ... | 1 | 0 |
| సంగ్రహరామాయణము ,, | ... | 0 | 10 |
| సత్యసేనవిజయము | ... | 0 | 4 |
| సావిత్రిచరిత్ర, చిన్నసైజు, పటములతో | ... | 0 | 4 |
| హరిశ్చంద్రచరిత్ర, చిన్నసైజు, పటములతో | ... | 0 | 3 |
| హితోపదేశము, వచనము, సులభశైలి | ... | 0 | 12 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
202, ఎస్ప్లనేడ్, చెన్న